తెలుగు అకాడమి ప్రచురణలు - 79

అనువాదం

# జిల్లామునసబుకోర్టుతీర్పు



గౌరవ సంపాదకులు
శ్రీ దీవి సుబ్బారావు
సంచాలకులు, తెలుగు అకాడమి

అనువాదకులు
డా. గుమ్మా శంకరరావు
రిసర్చి ఆఫీసరు (రిటైర్డ్), తెలుగు అకాడమి
శ్రీ ఎస్. ఎస్. మోహన్‌రావు
తెలుగు అకాడమి

పరిష్కర్త
శ్రీ పోతుకూచి సూర్యనారాయణమూర్తి
అడ్వకేట్, రాజమండ్రి



తెలుగు అకాడమి
హైదరాబాదు
1997

# ముందుమాట

అధికార భాషగా తెలుగును అమలు చెయ్యడంలో ప్రభుత్వానికి సహకరించడం తెలుగు అకాడమి ప్రధాన లక్ష్యాలలో ఒకటి. ఈ మేరకు తెలుగు అకాడమి 1980 లోనే పరిపాలన, న్యాయపదకోశాన్ని ఇంగ్లీషు-తెలుగు క్రమంలో తయారుచేసి ప్రచురించింది. 1996 లో దానిని విస్తృతీకరించి పరిష్కృత, పరివర్ధిత ప్రతిగా ప్రచురించింది. ఈ గ్రంథం ఉపయోగించేవారి సౌలభ్యం కోసం దీనినే తెలుగు-ఇంగ్లీషు క్రమంలో ప్రచురించబోతున్నది.

1990 లో అప్పటి అధికార భాషా సంఘం వారి అభ్యర్థన మేరకు, వారు సూచించిన ఇరవై జిల్లా మునసబు కోర్టు తీర్పులను తెలుగు అకాడమి తన సిబ్బంది చేతే అనువదింపజేసింది. అయితే, అప్పటి పరిపాలనపరమైన కొన్ని ఇబ్బందుల కారణంగా, పాఠ్యేతర గ్రంథాల ప్రచురణపై గల నిబంధనల దృష్ట్యా, ఈ గ్రంథాన్ని ఇప్పుడు ప్రచురించడం సాధ్యమయింది. ఇదే రీతిలో హైకోర్టు తీర్పుల సూచి (1986)ని కూడా తెలుగులోకి అనువదింపజేసి అకాడమి ప్రచరించబోతున్నది.

ఈ గ్రంథంలోని తీర్పులు ముఖ్యంగా ప్రోనోటు దావాలే. ఆస్తి పంపకం, కోర్టు నిషేధ ఉత్తరువులు (injunction orders) మొదలైన వాటికి సంబంధించిన దావాలను కూడా ఇకముందు తెలుగు చేసి ప్రచురించాలనే సంకల్పం ఉంది.

న్యాయవ్యవహారాలు తెలుగులో జరుపుకొనే విధానంలోను, ఇంగ్లీషుతో పరిచయం లేని తెలుగు పౌరులను కూడా న్యాయవ్యవహారాల నిర్వహణలో భాగస్వాములను చేసే విధానంలోను ఈ గ్రంథం ఉపకరిస్తుందని ఆశిస్తున్నాం. ఈ గ్రంథానువాదమూ, ముద్రణ చేయించడంలో బాధ్యత వహించిన వారు డా. పి. దక్షిణామూర్తి, డా. ఎ. మంజులతగారలు. తెలుగు అకాడమి న్యాయశాస్త్ర విషయనిపుణులు శ్రీ ఎమ్. రామచందర్ ప్రూఫ్‌ల సవరణ బాధ్యత వహించి, ముద్రణ యోగ్యప్రతి తయారు చేశారు.

# విషయ సూచిక

# ప్రధాన జిల్లా మునసబు కోర్టు, తిరుపతి

## జిల్లా మునసబు కోర్టులో

హాజరు : శ్రీ బి. ఈశ్వర రెడ్డి, బి.ఏ., బి.ఎల్.,
ప్రధాన జిల్లా మునసబు, తిరుపతి.

శనివారం జనవరి మొదటి తేదీ పందొమ్మిది వందల డెబ్బైఏడు.

ఓ.ఎస్.నెం. 416/1975.

మెసర్స్ శ్రీ ఫైనాన్సియర్స్, తిరుపతి, రిజిస్టరయిన ఒక వ్యాపారసంస్థ పక్షాన ప్రాతినిధ్యం వహించిన నిర్వహణ భాగస్థుడు శ్రీ బి. పాండురంగయ్య ........... వాదికీ

1. పి. రాజరత్నం చెట్టి
2. పి. వెంకటాచలపతి చెట్టి.................................. ప్రతివాదులకూ

మధ్య :

ఈ వ్యాజ్యం 25–4–76, 30–11–76, 13–12–76, 14–12–76, 18–12–76, 20–12–76 తేదీలలో చివరిసారిగా విచారణకు నా ముందుకు వచ్చింది. ఇందులో వాది తరఫున న్యాయవాది శ్రీ పి.వి.శ్రీనివాసదేవర్, ప్రతివాదుల తరఫున న్యాయవాది శ్రీ కె.ప్రకాశం హాజరయ్యారు. ఈ రోజు వరకు విచారణకోసం నాదగ్గర ఉన్న కారణంగా, కోర్టు ఈ కింది విధంగా చెప్పింది.

### తీర్పు

తే 18–8–72 న ప్రతివాదులు వాది పేర రూ.2,000/– లకు ప్రామిసరీ నోటు రాసి సం॥కి 18 శాతం వడ్డీతో చెల్లించడానికి ఒప్పుకొన్నదానిలో మిగిలిన బాకీ మొత్తం రూ.860–15లకూ (రూ. 455/–లు అసలు, మిగిలినది రావలసిన వడ్డీ కింద) వీటితో పాటు కోర్టు ఖర్చులు కూడా వసూలు నిమిత్తం వేసిన దావా ఇది.

2. దావాపత్రం (ప్లెయింట్) లో వక్కాణించిన విషయాలు ఇలా ఉన్నాయి :– 18–8–72 వ తేదీన వాదినుంచి ప్రతివాదులు సంయుక్తంగా రూ.2,000/– అప్పు

తీసుకొని వ్యాజ్యపు ప్రామిసరీ నోటు రాసి ఇచ్చారు. అందులో, సాలుసరి 18 శాతం వడ్డీ చెల్లించడానికి ఒప్పుకొన్నారు. ప్రతివాదులు రూ.1445/-లు మాత్రం వాయిదాలలో చెల్లించారు. ఎన్నో సార్లు అడిగినప్పటికీ మిగిలిన బాకీ మొత్తాన్ని చెల్లించ లేదు. ప్రతివాదులు వ్యవసాయదారులు కారు. కాబట్టి ఆ రుణాన్ని తగ్గించలేదు. కాబట్టి ఇది రూ.860–15లు వసూలు నిమిత్తం, తదుపరి వడ్డీ నిమిత్తం వేసిన దావా.

3. మొదటి ప్రతివాది లిఖితపూర్వకమైన స్టేట్‌మెంటు దాఖలు చేశాడు. రెండో ప్రతివాది మొదటి ప్రతివాది దాఖలు చేసిన స్టేట్‌మెంటును అనుసరిస్తూ మెమో దాఖలు చేశాడు. వాది వ్యాపారసంస్థ రిజిస్టర్డు కాదు. పాండురంగయ్య వాటాదారు కాదు. వ్యాపార సంస్థలోని కక్షిదారులుగా అందరు వాటాదార్లు ఉండవలసి ఉంది. కాబట్టి వ్యాజ్యానికి విచారణ యోగ్యతలేదు. వాటాదారులను చేర్చు కోనందువల్ల ఈవ్యాజ్యం కొట్టివేయడానికి తగిఉంది. తే18–8–72న వాది దగ్గర ప్రతివాదులు రూ.2000/–లు అప్పుతీసుకొని సాలుసరి వడ్డీ 18 శాతం చెల్లించడానికి ప్రోనోటు రాసి ఇచ్చారన్న సంగతి నిజంకాదు. ప్రోనోటు రూ.2000/–లకు రాయించుకొని, రూ.1800/– లు మాత్రమే ప్రతివాదికి వాది ఇచ్చాడు. కాబట్టి వ్యాజ్యం ప్రోనోటుకు రూ.200/– మేరకు ప్రతిఫలం లేదు. రెండో ప్రతివాది మొదటి ప్రతివాది కుమారుడు. రెండో ప్రతివాది ప్రోనోటులో చేరడం కేవలం పూచీ దారుగా మాత్రమే. వ్యాజ్యం ప్రోనోటు మొత్తంలో నుంచి అతడు ఏమీ పొందలేదు. 1938వ సం.రపు చట్టం IV అర్థం పరిధిలో ఇద్దరు ప్రతివాదులూ వ్యవసాయదారులే. ఇద్దరు ప్రతివాదులూ వ్యవసాయదారులు కావడంవల్ల అప్పు బాకీ రూ.1000/–లు కన్న తక్కువ ఉండటం వల్ల 1976వ సం.రపు చట్టం 24 ను దృష్టిలో ఉంచుకొని వ్యాజ్యం నిలిపివేయాలి. కాబట్టి యీ వ్యాజ్యాన్ని ఖర్చులు చెల్లించే పద్ధతిమీద కొట్టి వెయ్యడం అయింది.

4. పై వాదనల మీద ఈ కింది సారాంశాలను నిర్దిష్ట పరచడమయింది :

(1) వ్యాజ్యం సముచితంగా నివేదితమయిందా? దానికి విచారణ యోగ్యత ఉందా?

(2) రూ.1800/- లకు వరకు మాత్రమె వ్యాజ్యం ప్రోనోటుకు ప్రతిఫలం చేకూరిందా?

(3) రెండో ప్రతివాది వ్యాజ్య మొత్తాన్ని చెల్లించడానికి బాధ్యుడు కాడా?

(4) ప్రతివాదులు వ్యవసాయదారులా?

(5) 1976 సం॥ 24 చట్టం దృష్ట్యా వ్యాజ్యాన్ని నిలిపివేయాలా?

(6) ఏ పరిహారానికి ?

5. బి.పాండురంగయ్య వాది తరఫున మేనేజింగ్ పార్ట్నరును వాదితరఫు సాక్షి–1 గా పరీక్షించడమయింది. ఎ–1 నుంచి ఎ–5 వరకు ఎగ్జిబిట్లు (సాక్ష్యం దాఖలా పత్రాలు) గా గుర్తించారు. ప్రతివాదుల తరఫున మొదటి ప్రతివాదిని మాత్రం (ప్రతివాది తరఫు

సాక్షి-1) గా పరీక్షించడం జరిగింది. బి-1 నుంచి బి-3 వరకు ఎగ్జిబిట్లుగా గుర్తించారు.

6. వాదాంశం నెం.1 :- వా.సా.-1 వ్యాపారసంస్థ రిజిస్టరయిందనీ తాను మేనేజింగ్ పార్ట్నరుననీ వాఙ్మూలం ఇచ్చాడు. అతడు ఎగ్జిబిట్ ఎ-1 (వ్యాపారసంస్థ రిజిస్టరు ఉదాహృత భాగం) దాఖలు చేశాడు. అది వా. సా.-1 మొదటి భాగస్థుడని చూపుతోంది. సి.పి.సి ఆర్డరు 30 రూల్ 1 ని బట్టి కాజ్-టైటిల్‌లో వాటాదార్లందరినీ చేర్చవలసిఉండగా, ప్రస్తుత వ్యాజ్యంలో ఆ వాటాదార్లందరూ ఆ కాజ్-టైటిల్లో లేకపోవడంవల్ల వ్యాజ్యానికి విచారణ యోగ్యత లేదని ప్రతివాది వాదన. ఆర్డరు 30 రూల్ 1 కాజ్-టైటిల్‌లో వాటాదార్లందరినీ తప్పని, సరిగా చూపాలని నిర్దిష్టంగా చెప్పడం లేదు. ప్రస్తుత వ్యాజ్యాన్ని వ్యాపారసంస్థ దాఖలు చేసిందే కాని వాటాదార్లు కాదు. ఒక వ్యాపారసంస్థ వేసిన దావా అంటే ఆ సంస్థ వాటాదార్లు అందరూ వేసిందే. అందువల్ల ప్రతివాది కోరితే వాటాదార్లందరి పేర్లూ అందించడం జరుగుతుంది. ఆర్డరు 30 రూల్ 1 ప్రకారం ఇలా ఉంది :-

"అలాంటి వ్యాపారసంస్థలోని వాటాదారులుగా ఉన్న వ్యక్తుల పేర్లూ, చిరునామాలూ పంపమని కోర్టు వారిని అలాంటి సందర్భంలో వ్యాజ్యంలోని ఏపక్షమయినా కోరవచ్చు" ఇది ఆవశ్యక అంతర్నిహితం. కేవలం వ్యాపారసంస్థ మాత్రమే దాఖలు చేసిన వ్యాజ్యం కావచ్చు. కానీ వ్యాపారసంస్థకు చట్టబద్ధమయిన సత్యం లేదు. దాని వాటాదారుల్లో ఒకరు దానికి ప్రాతినిధ్యం వహించవచ్చు. కాబట్టి వాది వ్యాపారసంస్థ ప్రాతినిధ్యం సముచిత మే అని నేను భావిస్తున్నాను. కాజ్-టైటిల్లో మిగతా వాటాదార్లందరినీ చేర్చక పోవడం దావాకు ప్రాణాంతకమైన దేమీ కాదని నిర్ణయించేస్తున్నాను. కాబట్టి ఇతర వాటాదార్లను చేర్చకపోవడం వల్ల దావా యోగ్యమైనది కాదనను. దావా విచారణ యోగ్యమయినదిగానే నిర్ణయిస్తూ, ఈ వాదాంశాన్ని వాది పక్షాన తీర్పు ఇస్తున్నాను.

7. వాదాశం నెం.2 :- వాదికి చెందే రూ.200/-ల ప్రతిఫలం పాక్షిక విఫలమని ప్రతివాదులు నిస్సందేహంగా నిరూపించుకోవలసిఉంది. ఇందులో ప్ర.వా.-1 ప్ర.సా.-1 ఏకైక సాక్ష్యం ఉంది. కాబట్టి ఈ సాక్ష్యం స్వార్థపరమైనది. ఈ సాక్ష్యం స్వార్థపరమైనదయినా ఎగ్జిబిట్ ఎ-1 తేదీనాటికి ప్రతివాదులకు వాది రూ.200/-లు చెల్లించి ఉండక పోవచ్చుననే పరిస్థితులు ఉంటే వాటిని కోర్టు పరిశీలించవచ్చు. ఎగ్జిబిట్ ఎ-1 తేదీనాడు ప్రతివాది రూ.100/-లు చెల్లించినట్లు వాది స్వయంగా చూపినట్లు ప్రతివాదుల పక్షం న్యాయవాది చూపించడం జరిగింది. ఈ పరిస్థితులు వాదికి దురుద్దేశం లేదని తెలుస్తుంది. లేకపోతే వాది ప్ర.వా.-1 మొత్తంగా చూపించి ఉండేవాడు కాదు. ఇది మినహా, ప్రోనోటు రాసి ఇచ్చిన మీదట సక్రమంగా ప్రతిఫలం ప్రతివాదికి ముట్టింది అనే న్యాయస్థానం పురోభావనను కాదనడానికి తగిన పరిస్థితులు కనిపించవు. పైగా, లిఖితపూర్వక స్టేట్‌మెంట్ 5వపేరాలో "ఈ ప్రతివాది తానొక్కడే రూ. 2000/-లు పైచెప్పిన తేదీన అప్పు తీసుకొన్నట్లు నివేదించాడు. అయితే, ప్రతివాదుల ఖచ్చితమైన వాదం దృష్ట్యా ఈ వాదన ప్రామాదికం కావచ్చు, ప్రోనోటు సంపూర్ణ ప్రతిఫలయుక్తంకాదని ఎలాగయితేనేం, ప్రతివాదుల పక్ష సాక్ష్యంలోకాని, అలాంటి సాక్ష్య పరిస్థితులలో కానీ

సంతృప్తికరమైన స్థితి కాదు. ప్రోనోటు సంపూర్ణ ప్రతిఫలయుక్తమని నిర్ణయిస్తున్నాను. ఈ వివాదంశం వాది పక్షాన నిర్ణయిస్తున్నాను.

8. వాదాంశం నెం.3 :- ప్రోనోటు విషయంలో పూచీదారుగా మాత్రమే ప్ర.వా.-2 ప్రోనోటుపైన సంతకం పెట్టాడనడం చెల్లదు. కాబట్టి ప్ర.వా.-2 కూడా ప్రోనోటు బాపతు సొమ్ము మొత్తానికి బాధ్యత వహించాలని నేను అభిప్రాయ పడుతున్నాను. కాబట్టి ఈ వాదాంశాన్ని వాదికి అనుకూలంగా నిర్ణయిస్తున్నాను.

9. వాదాంశం నెం. 4 :- ప్రతివాదులు తాము వ్యవసాయదారులమని రుజువు చేసే భారం వారి పైననే ఉంది. క్రాస్‌పరీక్ష లో ప్ర.సా.-1 తాను తిరుపతిలో నాయనార్ బిల్డింగ్‌లో గత 6 సం.లుగా నివసిస్తున్నాననీ, 2 సం.లుగా వ్యాపారం చేస్తున్నాననీ ఒప్పుకున్నాడు. అతని మాట ప్రకారం పుంగనూరు తాలూకా ఆవులపల్లెలో అతనికి భూములున్నాయి. క్రాస్‌పరీక్షలో ఆ భూమి పట్టానెంబరు గానీ సర్వేనెంబరు గానీ తనకు తెలీదని అతడు అంగీకరించాడు. కానీ అతనికి 4 ఎకరాల పల్లం, మెట్ట భూములు ఉన్నట్లు వాఙ్మూలం ఇచ్చాడు. ఆ భూములు అతని పూర్వీకులవీ అనీ, అందువల్ల అతని వద్ద స్వంత దస్తావేజులు లేవనీ అందువల్లే వాటిని అతడు దాఖలు చేయలేక పోయాడని అతని వాదన. ఎగ్జిబిట్ బి-2, బి-3 శిస్తు రసీదులను అతడు దాఖలు చేశాడు. ఆ వ్యవసాయ భూములను ప్రతివాదులు అమ్మగలిగే హక్కును ఎగ్జిబిట్ బి-2, ఎగ్జిబిట్ బి-3 చూపుతాయో లేదో పరిశీలించడం జరిగింది. ఎగ్జిబిట్ బి- 2 మీద 28-1-76 తేదీ ఉండగా ఎగ్జిబిట్ బి-3 మీద 2-5-76 తేదీ ఉంది. రెండు ఎగ్జిబిట్లు బి-2, బి-3 సర్వే నెంబరునుకానీ పట్టా నెంబరునుకానీ చూపించలేదు ; ప్రతివాదులకున్నదని చెప్పే భూమినికాని చూపించలేదు. వాది న్యాయవాది చొడగం రామ్‌మోహన్- (ఎదిరి) చలసాని నారాయణరావు 1959 మధ్య వివాదం "ఆంధ్ర లా టైమ్స్" పేజీ 799 ని ఉదహరించారు. "గ్రో మోర్ ఫుడ్" ఉద్యమాన్ని అనుసరించి ఏదైనా ఒక వ్యక్తికి భూమిని దున్నడానికి గానీ, పంటలు పండించడానికి గానీ, అనుమతి లభిస్తే అది కేవలం వ్యవసాయానికి అనుమతిగానే భావించాలి. కానీ మరే ఇతర ప్రయోజనాలకు కాదు అన్నది అందరికీ తెలుసు. 1938 సం.రపు మద్రాసు వ్యవసాయదారుల పరిహార చట్టం పరిచ్ఛేదం 3 (ii)లో ఉన్న "సేలబుల్ ఇంటరెస్ట్" (అమ్మగలిగిన హక్కు) అన్న మాటను 801వ పుటలో పరిశీలించడమయింది. అమ్మగలిగిన హక్కుగల ఫల-పుష్పవన, వ్యావసాయిక ఏ భూమిలోనైనా హక్కు అని దీని అర్థంగా మనం అవగాహన చేసుకోవాలి. కాబట్టి ఎగ్జిబిట్ బి-1, బి-2 లలో సర్వే నెంబరు గానీ పట్టా నెంబరుగానీ పేర్కొనకపోవడం వల్ల ఆ భూములలో ప్రతివాదులకు అమ్మే హక్కు ఉందన్న నిర్ధారణకు నేను రాలేను. కాబట్టి ఈ వాదాంశాన్ని వాదికి అనుకూలంగా నేను నిర్ణయిస్తున్నాను.

10. వాదాంశం నెం. 6 :- దావాపత్రం క్లెయిమ్ వివరాల్లో 18-8-72వ తేదీన ప్రతివాదులు రూ.100/-లు చెల్లించినట్లు చూపారు. కానీ ఈ రూ.100/-లకు ఎదురువడ్డీ ఇవ్వలేదు. కాబట్టి ప్రతివాదులకు ఈ రూ.100/- లమీద ఎదురు వడ్డీ అనుమతించడమయింది. కాబట్టి ఈ రూ.100/- ల మీద 18-8-72 నుంచి దావాపత్రం

తేదీ వరకు వడ్డీ రూ.18–50లు.

ఫలితంగా, కోరినవిధంగా దామాషా ఖర్చులతో రూ.843–65 లకు వ్యాజ్యం డిక్రీ అయింది.

సంక్షిప్త లేఖకునికి చెప్పి, అతడు సంక్షిప్త లేఖనాన్ని తిరిగి లిపిలోకి మార్చి సవరణలు చేసిన తర్వాత 1977 సం.రం జనవరి 1వ తేదీన బహిరంగంగా కోర్టులో ప్రకటించడమయింది.

(సంతకం)
బి. ఈశ్వరరెడ్డి
ప్రధాన జిల్లా మునసబు,
తిరుపతి.

సాక్ష్యం అనుబంధం
పరీక్షించిన సాక్షులు

వాది : ప్రతివాది :

వా.సా.–1 బి. పాండురంగయ్య ప్ర.సా.–1 ఆర్. రాజరత్నం చెట్టి.

**వాది ఎగ్జిబిట్లు:**

ఎగ్జిబిట్ ఎ–1.18–8–72 వాది పేర ప్రతివాదులు రాసి ఇచ్చిన ప్రోనోటు రూ.2000/–లకు

ఎ–2. 14–8–75. రిజిస్టర్ ఆఫ్ ఫర్మ్స్.
ఎ–3. తిప్పిపంపిన రిజిస్టర్డ్ నోటీసు
ఎ–4. తిప్పిపంపిన రిజిస్టర్డ్ నోటీసు
ఎ–5. 13–8–75. వాది వకీలు ప్రతివాదులకు పంపిన నోటీసు నకలు

**ప్రతివాదుల ఎగ్జిబిట్లు:–**

బి.1. పి. రాజరత్నం చెట్టి పేర ఉన్న పాస్ పుస్తకం.

బి.2. 28–1–72. శిస్తు రసీదు.

బి.3. 2–5–76. శిస్తు రసీదు.

(సంతకం)
బి.ఈశ్వరరెడ్డి
ప్రధాన జిల్లా మునసబు.

– సరైన నకలు –

(సంతకం)
ఇన్ ఛార్జి జిల్లా జడ్జి

# 2.

# అదనపు జిల్లా మునసబు కోర్టు, చిత్తూరు

## అదనపు జిల్లా మునసబు కోర్టులో

హాజరు : సి. గోపాలరెడ్డి, బి.ఏ., బి.ఎల్.,
అదనపు జిల్లా మునసబు.

1971వ సం.రం. అక్టోబరు 29వతేదీ శుక్రవారం.

ఒ.ఎస్.నెం.443/71

కామాక్షమ్మ ............................................................ వాదికీ

ఆర్.వెంకటముని నాయుడు .................................................. ప్రతివాదికీ

మధ్య :

వాది తరపున న్యాయవాది, శ్రీ ఎ.శ్రీనివాసులు నాయుడు ; ప్రతివాది తరపున న్యాయవాది శ్రీ పి.పట్టాభిరామస్వామిరెడ్డి హాజరు కాగా తే26-10-71 న నాముందు విచారణకు వచ్చి యీరోజు వరకు తీర్పు నిమిత్తం నిలచి ఉన్నందున కోర్టు ఈ కింది విధంగా చెప్పింది :-

తీర్పు

వాది పేర ప్రతివాది రాసి ఇచ్చిన ప్రోనోటు బాకీ రూ.1080/-ల వసూలు నిమిత్తం వాది ఈ దావా వేసింది.

2. ఈ కింది ఆరోపణలు దావాపత్రంలో ఉన్నాయి ; 1-9-1969 తేదీన వాది దగ్గిరి నుంచి రూ.2000/- లు ప్రతివాది అప్పు తీసుకొని, దాని మీద సాలుసరి వడ్డీ 12 శాతంతో సహా అసలు తీర్చడానికి ఒప్పుకొని వాది పేర ప్రోనోటు రాసి ఇచ్చాడు. తే20-11-1969 న ప్రతివాది ఆ ప్రోనోటు అసలు కింద రూ.1000/-లు, వడ్డీ కింద రూ.40/-లు చెల్లించాడు. ఎన్నోసార్లు అడిగినప్పటికీ, న్యాయవాది తే15-3-1971 న నోటీసు ఇచ్చినప్పటికీ ప్రతివాది మిగిలిన మొత్తాన్ని చెల్లించలేదు. 1938 సం.రం iv చట్టం ప్రయోజనాలకు, ప్రతివాది వ్యవసాయదారుడైనందువల్ల అర్హుడు. ఆ చట్టం ప్రకారం రుణం తగ్గించడం జరిగింది. వ్యాజ్యం మొత్తం ప్రతివాదినుంచి రావలసి ఉంది.

3. ఈ కింది ఆరోపణలతో లిఖితపూర్వకమైన స్టేట్‌మెంట్ ప్రతివాది దాఖలు చేశాడు. తే. 1-9-1969 న రూ.2000/-లకు వాది పేర ప్రతివాది దావా ప్రోనోటు రాసి ఇచ్చాడు. తే 10-11-1969 న ప్రతివాది రూ.1040/- లు చెల్లించాడు. ఆగస్టు 1970 లోనో అప్రాంతంలోనో మరో రూ.500/- లు ప్రతివాది వాదికి చెల్లించాడు. కాని వాది ఆ ప్రోనోటు ఎక్కడో పెట్టడంవల్ల కనపడటంలేదు కాబట్టి ప్రోనోటుమీద తరువాత చెల్లురాసి ఇస్తానని వాగ్దానం చేసింది. బంధుత్వం, నమ్మకం కారణంగా వాది మాటలు ప్రతివాది నమ్మి తరవాత రసీదు ఇమ్మని ఒత్తిడి చేయలేదు. తరవాత వాది ప్రతివాదుల మధ్య మనస్పర్థలు ఉద్భవించాయి. వాది ఈ చెల్లింపును దాచిపెట్టి ఈ వ్యాజ్యం దాఖలు చేసింది. ఆర్థిక సంబంధమైన చిక్కుల్లో ఉన్న కారణంగా మిగిలిన బాకీ మొత్తం చెల్లించడానికి ప్రతివాది ఆరు నెలల వ్యవధి కోరాడు.

4. పైవాదనల పరిశీలన మీద ఈ కింది వివాద అంశాలు రూపొందించడం జరిగింది.

(1) వాదికి ప్రతివాది 1970 ఆగస్టులో రూ.500/-లు చెల్లించాడా?

(2) బాకీగా తేబడే మొత్తాన్ని చెల్లించడానికి ఆరు నెలల వ్యవధిని ప్రతివాదికి ఇవ్వవచ్చా?

(3) ఏ పరిహారం ఇవ్వాలి?

5. వాది తరఫున, వాది ఒక్కరిని మాత్రమే వాది తరఫున సాక్షి-1 గా పరీక్షించారు. ప్రతివాది తరఫున ప్రతివాది తరఫుసాక్షి-1 గా ప్రతివాదిని పరీక్షించారు.

6. వివాదాంశం నెం. 1 :- ప్రతివాది 1-9-69 తేదీన రూ.2,000/- లు వాదినుంచి అప్పుతీసుకొని వాదిపేర దావా ప్రోనోటు, ఎగ్జిబిట్ ఎ-1, తాను రాసి ఇచ్చాననీ, ఎగ్జిబిట్ ఎ-1 కింద రూ.1040/-లు ప్రతివాది తాను చెల్లించాననీ, ఇంకా రూ.500/- లు వాదికి 1970 ఏప్రిల్‌లో చెల్లించాననీ తన సాక్ష్యంలో ప్రతివాది చెప్పాడు. వాది తన ఇంటికివచ్చి, డబ్బు చెల్లించమని కోరిందని తాను ప్రోనోటు తెమ్మని అడిగినట్లూ ప్రతివాది చెప్పాడు. తన భర్త ప్రోనోటు ఎక్కడో పెట్టాడని అతడు ఇంట్లో లేడని చెప్పింది. ప్రోనోటుపైన చెల్లు రాయడానికి తరవాత తెస్తాననీ వాది చెప్పింది. ఆమె మాటలు నమ్మి ప్రతివాది రూ.500/-లు చెల్లించాడు. కానీ ఈ చెల్లును కప్పిపుచ్చి ఈ మధ్య తల ఎత్తిన మనస్పర్థలవల్ల వాది ఈ దావా వేసింది. ఎగ్జిబిట్ ఎ-3 నోటీసును వాది ఇచ్చిందనీ, అది ఎగ్జిబిట్ ఎ-4 గా తాను అందుకున్నాననీ దానికి జవాబు ఎగ్జిబిట్ ఎ-5గా ఇచ్చానని ప్రతివాది చెప్పాడు. ప్రతివాది చెప్పినట్లు అతడు రూ.500/- లు చెల్లించలేదని వాది తన సాక్ష్యంలో చెప్పింది. ప్రతివాది రూ.500/-లు వాదికి చెల్లించినట్లు లిఖితపూర్వక ఆధారం ఏదీ లేదు. ప్రోనోటు మీద కూడా ప్రతివాది సొమ్ముచెల్లించినట్లు చెల్లు లేదు. వాదికి రూ.500/-లు ప్రతివాది చెల్లించినట్లు, వాది రసీదు ఇవ్వనట్లూ ప్రోనోటు మీద ఎలాంటి చెల్లూ వాది పెట్టనట్లూ తెలుపుతూ ప్రతివాది ఎలాంటి నోటీసూ వాదికి

ఇవ్వలేదు. నిజంగా ప్రతివాది రూ.500/- లు చెల్లించి ఉంటే ఆ చెల్లింపుకు వాది రసీదు ఇవ్వలేదనీ వాదికి ప్రతివాది తప్పకుండా నోటీసు ఇచ్చి ఉండేవాడు. లిఖితపూర్వకమయిన స్టేట్ మెంటులో 1970 ఆగస్టులోనో ఆ ప్రాంతంలోనో ఈ మొత్తం చెల్లించినట్లు చెప్పి, తన సాక్ష్యంలో మాత్రం 1970 ఏప్రిల్ నెలలో ఈ మొత్తం చెల్లించినట్లు ప్రతివాది చెప్పాడు. చెల్లింపు విషయంలోని పరస్పర వైరుధ్యం ఉన్న ప్రతివాది మాటలు, స్పష్టంగా ప్రతివాది వాదన సరయినదికాదని చూపుతున్నాయి. ప్రతివాది తన లిఖితపూర్వకమయిన స్టేట్ మెంట్ లోగానీ, నోటీసులో గానీ, తన సాక్ష్యంలో గానీ, ఈచెల్లింపుచేసిన సరైన తేదీని చెప్పలేక పోయాడు. రూ.500/-ల మొత్తం చెల్లించి ఉన్నట్లయితే ప్రతివాది ఎక్కడో అక్కడ గుర్తుగా రాసుకొని ఉంచేవాడు. వాది తనభర్త ప్రోనోటు ఎక్కడో పెట్టాడనీ, రూ.500/- తీసుకుందనీ ప్రతివాది తన సాక్ష్యంలో చెప్పాడు. కానీ ప్రతివాది తన లిఖిత స్టేట్ మెంట్ లో వాదే ప్రోనోటు ఎక్కడో పెట్టినట్లు చెప్పిందనీ ప్రతివాది చెప్పాడు. ప్ర.సా-1 స్వార్థపూరితమైన మూజువాణీ సాక్ష్యం తప్ప, మౌఖిక లేదా పత్ర ఇతరమయిన సంబంధమయిన సాక్ష్యం వాదికి ప్రతివాది రూ.500/-లు చెల్లించినట్లు ఏమీలేదు. ప్ర.సా-1 ఈ సాక్ష్యం కూడా లిఖితపూర్వకమయిన స్టేట్ మెంట్ లో చెప్పి ఉన్న విషయంవరకు విరుద్ధంగా ఉంది. కాబట్టి ప్రతివాది సాక్ష్యానికి నేనేమి విలువ ఇవ్వదలచుకోలేదు. వాదికి 1970 ఆగస్టులో ప్రతివాది రూ.500/- లు చెల్లించినట్లు నిరూపించలేకపోయాడు. కాబట్టి 1970, ఆగస్టులో రూ.500/-లు వాదికి ప్రతివాది చెల్లించలేదనే ఈ వివాదాంశంపై నేను నిశ్చయిస్తున్నాను.

7. వివాదాంశం 2 :- ప్రతివాది తాను వ్యవసాయదారుణ్ణనీ, తన భూముల మీద 6 నెలలో ఆదాయం తనకు వస్తుందనీ, ప్రస్తుతానికి తనవద్ద సొమ్ము లేదనీ, ఈ సొమ్ము చెల్లించడానికి 6 నెలల సమయం ఇప్పించమనీ ప్రతివాది తన సాక్ష్యంలో చెప్పాడు. ప్రతివాది ధనవంతుడని ఇప్పుడే చెల్లించగలడని వాది చెప్పారు. వాది, ప్రతివాదుల సాక్ష్యాన్ని విచారించి వ్యాజ్య మొత్తాన్ని చెల్లించడానికి ప్రతివాదికి 3 నెలలు సమయం ఇస్తున్నాను.

పర్యవసానంగా కోరిన విధంగా ఖర్చులతో సహా వ్యాజ్యం డిక్రీ ఇవ్వడమయింది. వ్యాజ్య మొత్తాన్ని చెల్లించడానికి మూడు నెలలు వ్యవధి ఇవ్వడమయింది.

స్టెనో టైపిస్ట్‌కు చెప్పి, అది అతడు టైపుచేయగా దాన్ని నేను సవరించి పందొమ్మిదివందల డెబ్బై ఒకటవ సం॥రం అక్టోబరు నెల ఇరవై తొమ్మిదో తేదీన బహిరంగంగా కోర్టులో దీన్ని ప్రకటించడమయింది.

(సంతకం)
సి. గోపాల్ రెడ్డి.
అదనపు జిల్లా మునసబు,

## సాక్ష్యం అనుబంధం.
## పరీక్షించిన సాక్షులు

వాది సాక్షులు : ప్రతివాది సాక్షులు :

వా.సా. 1. కామ్యాక్షమ్మ ప్ర.సా.–1. ఆర్. వెంకటముని నాయుడు

**వాది తరపున నమోదయిన ఎగ్జిబిట్లు :**

ఎగ్జి. ఎ–1. 1–9–69 రూ.2000/–లకు వాది పేర ప్రతివాది రాసి యిచ్చిన ప్రోనోటు.

ఎగ్జి. ఎ–2. 20–11–1969. రూ.1000/– లు పెట్టిన చెల్లు

ఎగ్జి. ఎ–3. 15–3–71 ప్రతివాదికి వాది పంపిన నోటీసు నకలు ప్రతి.

ఎగ్జి. ఎ–4. 17–3–71 తపాలా శాఖవారి తిరుగు రశీదు.

ఎగ్జి. ఎ–5. 29–3–71 వాదికి ప్రతివాది పంపిన జవాబు నోటీసు.

ప్రతివాది తరపు గుర్తించిన ఎగ్జిబిట్లు. ఏమీలేవు.

(సంతకం)
సి. గోపాల్ రెడ్డి
అదనపు జిల్లా మునసబు.

– సరైన నకలు –

(సంతకం)
ఇన్‌ఛార్జి జిల్లా న్యాయమూర్తి.

# 3.

# ప్రధాన జిల్లా మునసబు కోర్టు, తాడేపల్లిగూడెం

## ప్రధాన జిల్లా మునసబు కోర్టులో

**హాజరు : ఎం.ఏ.ఖయూమ్, బి.ఎస్.సి., ఎల్.ఎల్.బి.,**
ప్రధాన జిల్లా మునసబు.

1984వ సం.రం డిసెంబరు 7వ తేదీ శుక్రవారం. (శక సం.రం. 1906 అగ్రహాయనం 10వ రోజు).

ఎస్.సి.నెం. 13/1983.

దాళ్ళపల్లి విమలమ్మ, జాన్ విక్లిప్ భార్య..............................వాదికీ
ఎలుచూరి పెంటయ్య, అప్పలస్వామి కుమారుడు.....................ప్రతివాదికీ

మధ్య :

వాది తరపున న్యాయవాది శ్రీ ఆర్. వెంకటేశ్వరరావు, ప్రతివాది తరఫున న్యాయవాది శ్రీ వి.రెడ్డమ్మ హాజరు కాగా వ్యాజ్యం 5-12-1984 వ తేదీన నాముందు తుది విచారణకు వచ్చి ఈ రోజువరకు వ్యాజ్యం నిలిచి ఉన్నందున ఈ కోర్టు ఈ కింది విధంగా ప్రకటించింది:-

## తీర్పు

తేదీ 2-5-78న రూ.500/- లకు సాలుకి 12 శాతం వడ్డీతో ఇవ్వడానికి అంగీకరిస్తూ వాది పేర ప్రతివాది రాసి ఇచ్చిన ప్రోనోటు బాపతు అసలు, వడ్డీ నిల్వబాకీ మొత్తం రూ.600-18లు వసూలు నిమిత్తం వేసిన దావా.

2. దావాపత్రం (ప్లెయింటు) లో నిర్దిష్టంగా చెప్పిన విషయాల సంక్షిప్త రూపాలు ఇలా ఉన్నాయి. 2-5-78వ తేదీన తన కుటుంబ ఖర్చుల నిమిత్తం వాది నుంచి ప్రతివాది రూ.500/-లు అప్పు తీసుకున్నాడు. సాలుకు 12 శాతం వడ్డీతో దీన్ని తిరిగి చెల్లించటానికి ఒప్పుకొని వాదిపేర ప్రోనోటు రాసి ఇచ్చాడు. 29-4-81 వ తేదీన ప్రతివాది రూ.200/-లు చెల్లించి, ప్రోనోటు మీద దానికి చెల్లు రాశాడు. తేదీ 1-6-83న వాది నోటీసు జారీ చేయించింది. ప్రతివాది దాన్ని అందుకొని తే 8-6-83న తిరిగి

దీనికి సమాధానం పంపాడు. ఆ నోటీసుకు సమాధానంలో వున్న విషయాలు నిజమైనవి కావు, సరైనవికావు. 1938వ సం.రం. చట్టం IV ప్రయోజనానికీ ప్రతివాది అర్హుడు. కాబట్టి 1938వ సం.రం. చట్టం IV ప్రకారం వడ్డీ తగ్గించి వేయడమైంది. ప్రతివాది చిన్న వ్యవసాయదారుడు కాకపోవడం వల్ల 1977వ సం.రం. చట్టం VII ప్రయోజనాలు కోరడానికి అతనికి హక్కు లేదు.

3. దావాపత్రం లోని విషయాలన్నీ ఖండిస్తూ ప్రతివాది లిఖితపూర్వకమైన స్టేట్ మెంటు దాఖలు చేశాడు. ప్రతివాది వాదినుంచి 3 బస్తాల ధాన్యం బస్తాకి రూ.70/- చొప్పున తీసుకొని, మరో బస్తా ధాన్యం వీటితో పాటు 1978 డిసెంబరు నెలాఖరు నాటికి ఇవ్వడానికి ఒప్పుకున్నట్లు రాశాడు. ఆ మూడు బస్తాల ధాన్యం ధర రూ.210/-లు కాగా మరో రూ.290/-లు దానికి చేర్చి మొత్తం రూ.500/- లకు తన చేత వాది ప్రోనోటు రాయించుకున్నట్లు చెప్పాడు. 1978 నవంబరు నెలలో రూ.100/-లు; 1979 డిసెంబరులో రూ.100/-లు; 1980 మే నెలలో రూ.200/-లు; 1980 నవంబరులో రూ.100/-లు; తేదీ 29-4-81న రూ.200/-లు ప్రతివాది చెల్లించాడు. కానీ ప్రోనోటు కాలదోషం పట్టకుండా ఉండే నిమిత్తం 29-4-81వ తేదీన చెల్లు మాత్రమే నోటు మీద వాది రాయించడమయింది. వాయిదాల పద్ధతిలో మొత్తం రూ.700/-లు ప్రతివాది, వాదికి 3 బస్తాల ధాన్యానికి చెల్లించాడు కాబట్టి వాదే ప్రతివాదికి బాకీ ఉంది. ఎందుకంటే ప్రతివాది ప్రోనోటు ఇచ్చివేయమని వాదిని గట్టిగా కోరినపుడు ఆ ప్రోనోటు తన దగ్గరుండటంవల్ల ప్రయోజనం పొందదలచి ఆమె ఈ తప్పుడు దావా వేసింది. అందువల్ల ఈ దావా సొమ్ము చెల్లించడానికి ప్రతివాది బాధ్యుడు కాడు. ఈ దావాను ఖర్చులతో కొట్టివెయ్యాలి.

4. విచారించ వలసిన విషయం లిఖితపూర్వక స్టేట్ మెంటులోనూ ఈ దావా పత్రంలోను ఈ అప్పు గురించి పేర్కొన్న పరిస్థితులలో ప్రతివాది బాకీ చెల్లించడానికి బాధ్యుడా?

5. వాది తరఫున వా. సా.-1ను పరీక్షించడం జరిగింది. ఎగ్జిబిట్లు ఎ-1 నుంచి ఎ-4 వరకూ వాది తరఫున గుర్తించడమయింది. ప్రతివాది తరఫున ప్ర.సా.-1ని సాక్షిని పరీక్షించడం జరిగింది. ఇక్కడ అంటే ప్ర.సా.-1 వాదే. వాది న్యాయవాదికి ప్రతివాది న్యాయవాది పంపిన నోటీసు సమాధానం ఎగ్జిబిట్ ఎ-1 తే.2-5-78దీన రూ.500/-లకు వాదిపేర ప్రతివాది రాసి ఇచ్చిన ప్రోనోటు ఎగ్జిబిట్ ఎ-2. తే.29-4-81దీన ప్రతివాది చెల్లించిన పాక్షిక చెల్లింపు రూ.200/-లు చెల్లు ఎగ్జిబిట్ ఎ-3. తే.1-6-1983దీన ప్రతివాదికి వాది పంపిన రిజిస్టర్డు నోటీసు నకలు ప్రతి ఎగ్జి. ఎ. 4. ఇందులో ప్ర.సా.-1 ప్రతివాదే.

6. ఎగ్జిబిట్ ఎ-2 ప్రోనోటు కింద 6సం.ల కిందట ప్రతివాదికి వాది రూ.500/-లు అప్పు ఇచ్చానని; దానికి ఒప్పుకున్న సాలుసరి వడ్డీరేటు 12 శాతమని వా.సా.-1 వాది తన సాక్ష్యంలో చెప్పింది. ఎగ్జిబిట్ ఎ-3 చెల్లుకింద రూ.200/-లు ప్రతివాది చెల్లించాడు. మధ్యలో ఇంకేమొత్తం అతను చెల్లించలేదు. ఎగ్జిబిట్ ఎ-4 ప్రతివాదికి జారీ చేసిన నోటీసు నకలు ప్రతి. ఎగ్జిబిట్ ఎ-1 దానికి సమాధానం. ప్రతివాది 3 బస్తాల ధాన్యం

(రూ.200/–ల విలువ) తీసుకోలేదు. దావా ప్రోనోటు ఎగ్జిబిట్ ఎ–2 ఈ సందర్భంలో రాసింది కాదు. ప్రతివాది వాయిదాలలో రూ.700/–లు చెల్లించడం వాస్తవం కాదు. పూర్తిమొత్తం అంతా రావలిసినదే.

7. ప్ర.సా.–1 తనసాక్ష్యంలో ఇలాచెప్పాడు : – వాది తనకు వదినె గారు. వాది దగ్గర నుంచి 3 బస్తాల ధాన్యం బస్తా 1కి రూ.70/–ల చొ.న (ప్రతివాది) అతడు తీసుకున్నాడు. ఆ మూడు బస్తాలతో పాటు అదనంగా ఒక బస్తా వాదికి తిరిగి తాను ఇవ్వాలి. వాయిదాలలో వాదికి తాను రూ.700/–లు చెల్లించాడు. ధాన్యం తీసుకునేటప్పుడు వాదికిచ్చిన కాగితం తిరిగి ఇవ్వమని తాను గట్టిగా కోరాడు (డిమాండ్ చేశాడు). వాది ఆ కాగితం ప్రస్తుతం తనవద్ద లేదని తర్వాత తనకు ఇచ్చివేస్తానని ప్రతివాదికి చెప్పింది. చివరి చెల్లింపు రూ.200/–ల చెల్లు ఆ కాగితం మీద నమోదు అయింది. అతడు (ప్రతివాది) పూర్తిగా ఆ డబ్బు చెల్లించాడు. ఏ సొమ్ము చెల్లించవలసిన బాధ్యత అతనికిలేదు. వాదికిచ్చిన నోటీసు ఎగ్జిబిట్ ఎ–1.

8. దావా ప్రోనోటుకు ప్రతిఫలయుక్తంకాదని దావా ప్రతివాది వాదన. ప్రతివాది ఏ ప్రతిఫలం అందుకోలేదని నిరూపించుకోవడానికి ప్రతివాది మీద ఎక్కువ రుజువు భారం ఉంది. అతడు చెప్పే మాటలు తప్ప ప్రతివాదికి తన వాదాన్ని బలపరిచేది ఏదిలేదు. ప్రతివాదికి వాది అందించే ప్రతిఫలం గురించి వాదికి అనుకూలంగా "నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్స్ యాక్టు" 118 సెక్షన్ కింద ఈ పురోభావన వర్తిస్తుంది. ప్రతివాది తన సాక్ష్యంలో వాదికి వాయిదాలలో రూ.700/–లు చెల్లించినట్లు చెప్పాడు. ఎగ్జిబిట్ ఎ–2 ప్రోనోటు మీద రూ.500/–లు చెల్లించినట్లు చెల్లు నమోదు కాలేదు. ప్రోనోటు బాకీ వాదికి ప్రతివాది చెల్లించినప్పుడు వాది దానిమీద చెల్లు నమోదు చేసేటట్లు చూడవలసిన విధి ప్రతివాదిది. ప్రోనోటు మీద రూ.500/–ల చెల్లు ఎందుకు చేయించలేదో ప్రతివాది ఏ వివరణా ఇవ్వలేదు. ముందుగానే అన్ని చెల్లింపులూ చెల్లించాననీ, ఎక్కువ చెల్లిస్తే ఆమే (వాదే) లెక్క వేసుకొని ఇచ్చి వేస్తుందని అనుకొన్నట్లు క్రాస్ పరీక్షలో ప్రతివాది చెప్పాడు. పరిశీలించడానికి సబబైన ఆధారం ఇదికాదు. రూ.500/–లు చెల్లింపులు తానెక్కడా గుర్తు రాసుకోలేదని కూడా ప్రతివాది చెప్పాడు. ప్రతివాది చాలాసార్లు అడిగినప్పటికీ వాది ప్రోనోటు ఇవ్వనప్పుడు ప్రతివాది వాదికి ప్రోనోటు తిప్పిపంపమని నోటీసు ఇచ్చి ఉండవలసింది. ప్రతివాది అలా చెయ్య లేదు. కాబట్టి ప్రోనోటు బాకీ నిమిత్తం రూ.500/–లు చెల్లించినట్లు ప్రతివాది నిరూపించలేకపోయాడు. ఈ పరిస్థితుల్లో ఈ దావా బాకీని ప్రతివాది చెల్లించాలి. పర్యవసానంగా వాది కోరినట్లు వ్యాజ్యం ఖర్చులతో డిక్రీ ఇవ్వడమయింది.

సంక్షిప్త లేఖకునికిది చెప్పడం, అది అతడు తిరిగి రాయగా దాన్ని సరిదిద్ది బహిరంగంగా కోర్టులో 1984 సం.రం. డిసెంబరు నెల 7 వ తేదీన ప్రకటించడమయింది.

(సంతకం) ఎం.ఎ. ఖయూమ్.
ప్రధాన జిల్లా మునసబు.
తాడేపల్లిగూడెం.

## సాక్ష్యం అనుబంధం
## పరీక్షించిన సాక్షులు

వాది పక్షాన పరీక్షించిన సాక్షులు :–

వా.సా. –1 దాళ్ళపల్లి విమలమ్మ.

ప్రతివాది పక్షాన పరీక్షించిన సాక్షులు:–

ఎలుసూరి పెంటయ్య.

### గుర్తించిన దావా పత్రాలు (డాక్యుమెంట్స్)

**వాది తరఫున:–**

ఎగ్జిబిట్ ఎ–1. 8–6–83 వాది న్యాయవాదికి ప్రతివాది న్యాయవాది పంపిన తిరుగు సమాధానం నోటీసు.

ఎగ్జిబిట్ ఎ–2. 2–5–78. రూ.500/–లకు వాది పేర ప్రతివాది రాసి ఇచ్చిన ప్రోనోటు.

ఎగ్జిబిట్ ఎ–3. 29–4–81 రూ. 200/–లు పాక్షిక చెల్లింపుకు ఎగ్జిబిట్ ఎ–2 వెనక భాగాన ప్రతివాది రాయించుకొన్న చెల్లు నమోదు.

ఎగ్జిబిట్ ఎ–4. 1–6–83 వాది ప్రతివాదికి పంపిన రిజిస్టర్డ్ నోటీసు నకలు ప్రతి.

**ప్రతివాది తరఫున :–** ఏమీలేవు.

(సంతకం) ఎం.ఏ.ఖయూమ్
ప్రధాన జిల్లా మునసబు

| సరైన నకలు |

(సంతకం)
ప్రధాన జిల్లా మునసబు,
తాడేపల్లిగూడెం.

# 4.

# మొదటి అదనపు జిల్లా మునసబు కోర్టు, మచిలీపట్నం

మొదటి అదనపు జిల్లా కోర్టులో

హాజరు : శ్రీ బి. చలపతి సూరి, బి.ఏ., ఎల్.ఎల్.బి.,
మొదటి అదనపు జిల్లా మునసబు.

1984వ సం.రం. ఆగస్టు 7వ తేదీ, మంగళవారం.

ఎస్.సి.నెం.18/83.

చింతలపాటి హనుమత్ శాస్త్రి..........................................వాదికీ

విష్ణుభొట్ల లక్ష్మీపతి..........................................ప్రతివాదికీ

మధ్య :

వాది తరపున శ్రీ జె.వి.కె.గురునాథం, శ్రీ బి.కామరాజు న్యాయవాదులు గానూ ప్రతివాది తరపున శ్రీ ఎం.వి.రాఘవయ్య, న్యాయవాదిగానూ హాజరు కాగా ఈ దావా నాముందు విచారణకు రాగా, కోర్టు ఈ విధంగా చెప్పింది:–

తీర్పు

1. దావాపత్రంలో ఉద్ఘాటించిన విషయ సారాంశం ఇట్లా వుంది:

తే27–6–1981న వాది దగ్గరి నుంచి రూ.800-00 లు ప్రతివాది అప్పుగా తీసుకొని దానికి సాలుసరి 12 శాతం వడ్డీతో సహా చెల్లించడానికి ఒప్పుకొని ఈ దావా ప్రోనోటు రాసి ఇచ్చాడు. వాది ఎన్నోసార్లు అడిగినప్పటికీ ప్రతివాది ఈ మొత్తం ఇవ్వలేదు. కాబట్టి వాది కోర్టువారిని పూర్తి మొత్తానికి డిక్రీ ఇమ్మని ప్రార్థిస్తున్నాడు.

2. లిఖితపూర్వకమయిన స్టేట్‌మెంటు ప్రతివాది దాఖలు చేశాడు. అందులో ఇలా ఉంది: వాది చెప్పినట్లు రూ.800/–లు ప్రతివాది మూడుసార్లు చెల్లింపులు చేశాడు. మొదటిసారి రూ.100/–లు మేనెల 1982లోనూ., రూ.50/–లు 1982 జూలై నెలలోనూ,

రూ.50/—లు 1982 అక్టోబరు నెలలోను మొత్తం రూ.200/—లు కానీ మిగిలిన సొమ్ము కుటుంబ చిక్కులవల్ల ప్రతివాది చెల్లించలేకపోయాడు. పాక్షికంగా చెల్లించిన రూ.200/—లు జమచేయించవలసిందిగా ప్రతివాది ప్రార్థిస్తున్నాడు.. అంతే కాకుండా తనకు నెలసరి జీతం నికరం రూ.300/—లు మాత్రమే అందుతున్నదనీ అది తన కుటుంబానికి రెండు పూటలా తిండి పెట్టడానికే తనకు చాలదనీ అందులో చెప్పాడు. కాబట్టి నెల 1కి రూ.20/—లు చొ.న చెల్లించటానికి కోర్టు అనుమతిని ప్రతివాది కోరాడు.

3. ఈ దావాలో పరిశీలించడానికి ఉన్న అంశాలు ఇవి:—

(i) ప్రతివాది చెబుతున్నట్లు పాక్షిక చెల్లింపులూ రూ. 300/-లకు మించినవి అన్న విషయాల పరిశీలన దావానోటును బలపరచకపోవడం నిజమా? ప్రతివాది చెప్పే చెల్లులు నిజమా?

(ii) డిక్రీ మొత్తాన్ని నెల 1కి రూ.20/—ల చొప్పున నెలసరి వాయిదాల్లో ప్రతివాది తీర్చడానికి అర్హుడేనా?

4. వా.సా.—1 గా వాదినే తన దావాను నిరూపించుకోడానికి పరీక్షించడం జరిగింది. ఎగ్జిబిట్ ఎ—1 నుంచి ఎ—3 వరకు గుర్తించారు. ప్ర.సా.—1 గా ప్రతివాదినే పరీక్షించడం జరిగింది.

అంశం—1.

5. వాది దగ్గరి నుంచి రూ.800/—లు ప్రతివాది అప్పు తీసుకొని దావా ప్రోనోటు ఎగ్జిబిట్ ఎ—1 రాసి ఇచ్చినట్లు వాది సాక్ష్యంలో ఉంది. ఎగ్జిబిట్ ఎ—1 రాసినవాడు ప్రతివాదే. ఎన్నోసార్లు వాది అడిగినప్పటికీ ప్రతివాది ఏమీ బదులు ఇవ్వలేదు. ప్రతివాది పాక్షిక చెల్లింపులు చేసినట్లు లిఖితపూర్వకమయిన స్టేట్‌మెంట్‌లో రాసిన విషయాల్ని వాది కాదన్నాడు. దీనికి వ్యతిరేకంగా, ప్రతివాది తాను రూ.300/—లు మాత్రమే దావా ప్రోనోటు ఎగ్జిబిట్ ఎ—1 కింద అప్పుతీసుకొన్నట్లు వాఙ్మూలం ఇచ్చాడు. చేబదులుగా దానికి ముందు రూ.500/—లు చేబదులుగా తీసుకున్నాడు. 1982 మేనెలలో రూ.100/— లున్నూ 1982 జూలై నెలలో రూ.50/—లున్నూ 1982 అక్టోబరు నెలలో రూ.50/—లున్నూ వాదికి ప్రతివాది చెల్లించినట్లున్నూ వాదిపై నమ్మకంతో వాటికి రసీదులు పుచ్చుకోలేదని ప్రతివాది తన సాక్ష్యంలో చెప్పాడు.

6. ప్రతివాది చెప్పిన నోటిసాక్ష్యం తప్ప, మరే ఇతర నోటిసాక్ష్యం కానీ పత్రసాక్ష్యం కానీ ప్రతివాది పాక్షిక చెల్లింపులు చేసినట్లు రుజువు చేయడానికి లేదు. కాబట్టి ప్రతివాది చెబుతున్నట్లు పాక్షిక చెల్లింపుల్ని నేను నమ్మలేను.

7. మరో విషయం. ప్రతివాది తన న్యాయవాదికి సంజాయిషీ ఇచ్చి రూ.800/—లు అప్పు తీసుకొన్నట్లు లిఖితపూర్వకమయిన స్టేట్‌మెంటులో రాయించాడని వాది తరఫున న్యాయవాది వాదించారు. దావా ప్రోనోటు తారీఖున తాను తీసుకొన్నది రూ.300/—లు

మాత్రమేనని ప్రతివాది ఏ వివాదం లేవనెత్తలేదు. దావా ప్రోనోటు ఎగ్జిబిట్ ఎ-1 పూర్తి ప్రతిఫలయుక్త మైనదయినందువల్ల ఆ పూర్తిమొత్తానికి దావాలో కోరిన విధంగా డిక్రీ ఇప్పించ వలసిఉంటుందని ఆయన ఇంకా వాదించారు. ఇది ఇలా ఉండగా ఎగ్జిబిట్ ఎ-1 తేదీని వాది రూ.300/-లు మాత్రమే అప్పు ఇచ్చినట్లు కాని అంతకుముందు రూ.500/-లు ఇచ్చినట్లూ వాది స్వయంగా తన క్రాస్‌పరీక్షలో చెప్పాడు. వాది స్వయంగా చెప్పిన సాక్ష్యం ఆధారంగా ఎగ్జిబిట్ ఎ-1 తేదీన ప్రతివాది రూ.300/-లు మాత్రమే పుచ్చుకున్నాడన్నది స్పష్టం. వాది ప్రతివాదికి చేబదులుగా ఇచ్చిన రూ.500/-లకు వాది వేరుగా దావా చేసుకొనే హక్కు అతనికి ఉన్నది.

8. ప్రోనోటు ఆధారంగానే వ్యాజ్య కారణం ఉత్పన్నమయింది. ప్రోనోటు తేదీని అతడు రూ.300/-లు మాత్రమే అప్పు ఇచ్చినట్లు స్పష్టంగా ప్రోనోటు వెనుక భాగాన పేర్కొనిఉంది. దావా ప్రోనోటు, రూ.300/-లకు మించి ప్రతిఫలం లేదన్నదే వ్యక్తమవుతున్నది కాబట్టి వాది రూ.300/-లు, దానిమీద ప్రోనోటు తేదీ నుంచి వడ్డీ మాత్రమే వసూలు చేసుకోవాలి. కానీ రూ.800/-ల మీద దరిమిలా వడ్డీ కాదు. కాబట్టి ఈ విషయాంశం ఆ ప్రకారం నిర్ణయించడమయింది.

9. అంశం నెం. 2 :- ప్రతివాది తనకు నెలసరి జీతం రూ.300/-లు మాత్రమే అందుతున్నదని అది తన పెద్దకుటుంబానికి భుక్తి గడవడానికే చాలదని ప్రతివాది తరఫున వాదన. నెలకి రూ.20/-ల చొ.న డిక్రీ మొత్తం చెల్లించడానికి తనను అనుమతించమని ప్రతివాది అభ్యర్థిస్తున్నాడు. కానీ ఈ దావాలో రూ.300/-లకు మాత్రమే డిక్రీ ఇవ్వడమవుతూంది; కాని వాది కోరుకున్నట్లు పూర్తిమొత్తానికి కాదు. కాబట్టి డిక్రీ మొత్తం వాదికోరిన అసలు మొత్తంలో సగమే కావడంవల్ల చాలా చిన్న మొత్తం అయింది. కాబట్టి వాయిదాలలో చెల్లింపు సహాయం మంజూరు చేయడం వాంఛనీయం కాదు. కాబట్టి ఈ అంశం ప్రతివాదికి వ్యతిరేకంగానూ వాదికి అనుకూలంగానూ నిర్ణయించడమయింది.

10. పర్యవసానంగా దామాషా ఖర్చులతో రూ.373-50లకు డిక్రీ ఇవ్వడమయింది. సాలుసరి 6 శాతం వడ్డీతో ప్లెయింట్ (దావాపత్రం) తేదీ నుంచి చెల్లింపు తేదీవరకు రూ.300/-ల మీద వడ్డీ కట్టాలి అని డిక్రీ ఇవ్వడమయ్యింది. మిగిలిన దావా క్లెయిమ్ ఖర్చులు లేకుండా కొట్టివేయడమయింది.

దీన్ని సంక్షిప్త లేఖకునికి చెప్పాను. అతను దాన్ని లిప్యంతరణం చేసిన తర్వాత, 1984వ సం.రం. ఆగస్టు 7వ తేదీన బహిరంగంగా కోర్టులో నేను ప్రకటించాను.

(సంతకం)
బి. చలపతిసూరి.
మొదటి అదనపు జిల్లా మునసబు,
మచిలీపట్నం.

## సాక్ష్యం అనుబంధం.
## పరీక్షించిన సాక్షులు

**వాది తరపున పరీక్షించినటువంటి సాక్షులు:-**

వా.సా. –1. శ్రీ చింతలపాటి హనుమత్ శాస్త్రి.

**ప్రతివాది తరపున పరీక్షించినటువంటి సాక్షులు:-**

ప్ర.సా. –1. శ్రీ విష్ణుభొట్ల లక్ష్మీపతి.

**వాది తరపున గుర్తించిన ఎగ్జిబిట్లు :-**

ఎగ్జిబిట్ ఎ–1/27–6–81 వాది పేర ప్రతివాది రాసి ఇచ్చిన దావా ప్రోనోటు.
ఎగ్జిబిట్ ఎ–2/7–2–83 ప్రతివాదికి వాది పంపిన నోటీసు నకలు ప్రతి.
ఎగ్జిబిట్ ఎ–3/8–2–83. ఎగ్జిబిట్ ఎ–2 అందినట్లు ప్రతివాది తపాలా తిరుగు రసీదు.

**ప్రతివాది తరపున గుర్తించిన ఎగ్జిబిట్లు:-** ఏమీ లేవు

(సంతకం)
బి. చలపతిసూరి
మొదటిఅదనపు జిల్లా మునసబు,
మచిలీపట్నం.

– సరైన నకలు –

(సంతకం)
మొదటి అదనపు జిల్లా మునసబు,
మచిలీపట్నం.

# 5.

# జిల్లా మునసబు కోర్టు, గన్నవరం

జిల్లా మునసబు కోర్టులో

హాజరు: శ్రీ పి. వీరభద్రస్వామి, బి.యస్.సి., ఎల్.ఎల్.బి.,
జిల్లా మునసబు.

1984వ సం.రం. నవంబరు 7వ తేదీ బుధవారం.

యస్.సి.నెం.10/83.

చలసాని బాబు జగన్మోహనరావు..............................................వాదికీ

బొప్పూడి సుభద్రా దేవి ..................................................ప్రతివాదికీ

మధ్య :

వాది తరపున శ్రీ ఎం.హనుమంతరావు చౌదరి, న్యాయవాది ; ప్రతివాది తరపున న్యాయవాది శ్రీ ఎం. ఏసుబాబు 31-10-84 తేదీన హాజరుకాగా నాముందు దావా విచారణకు వచ్చి ఈనాటి వరకు విచారణకు నిలిచి ఉన్నందున ఈ కోర్టు కింది విధంగా తీర్పు ఇచ్చింది.

తీర్పు

ప్రోనోటు మీద రావలసిన అసలు ఫాయిదాలు రూ. 758-00 బాకీ వసూలు నిమిత్తం స్మాల్ కాజ్ దావా వాది వేశాడు.

2. ఈ కింది విషయాలతో దావాపత్రం వాది దాఖలు చేశాడు. ప్రతివాది 17-10-1977వ తేదీన తన కుటుంబ అవసరాల కోసం రూ.450/-లు అప్పు తీసుకొని, ప్రోనోటు రాసిన తేదీనుంచి అప్పు తీర్చేవరకు దానికి సాలుసరి 12 శాతం వడ్డీ తోపాటు తిరిగి చెల్లించడానికి ఒప్పుకొని నోటు రాసి ఇచ్చింది. సొమ్ము చెల్లించమని ప్రతివాదిని అడిగినప్పుడు తే11-10-1980 దీన రూ.10/-లు ప్రతివాది చెల్లించి ప్రోనోటు వెనక భాగాన చెల్లు నమోదు చేయించింది. దరిమిలా అడిగినప్పటికీ ప్రతివాది సొమ్ము చెల్లించలేదు. కాబట్టే ఈ దావా.

3. ఈ కింది విషయాలతో ఒక లిఖితపూర్వకమైన స్టేట్‌మెంట్‌ను ప్రతివాది దాఖలు చేసింది ఆరోపించిన ప్రోనోటు రాసి ఇచ్చిన తేదీనాడు రూ.450/–లు ప్రతిఫలం చెల్లించారనడం నిజంకాదు. 1976 సం.లో దీపావళికి ముందు వాది తండ్రి ప్రతివాదికి రూ.200/–లు ఇచ్చాడు. దరిమిలా ఒక సం.రం. తర్వాత వాది తండ్రి మల్లికార్జునరావు ప్రతివాది ఇంటికి వచ్చి ఒక కాగితానికి రెండు పక్కలా బలవంతంగా ఆమె బొటనవేలి ముద్రలు వేయించాడు. ఇదే ప్రోనోటుగా వాది మార్చు చేసినట్లు ప్రతివాది నమ్ముతున్నది. దావా ప్రోనోటు మీద బొటన వేలిగుర్తులు వేసిన తర్వాత సుమారుగా ఒక సంవత్సరంలోపలో, అవతలో ముప్పావుబస్తా కందులు (వస్తు) రూపంలో మొత్తం పాత బాకీ చెల్లింపు కింద ప్రతివాది ఇచ్చినట్లు కన్పిస్తుంది. నిజానికి ఈ ప్రతివాది సుభాన్ బాకీ తిరిగి చెల్లించింది. మల్లికార్జునరావుకు బాకీ ఉన్న అతని తాకట్టు బాకీని విడుదల చేసింది. సుభాన్ నుంచి బాకీ వసూలుచేసి, తిరిగి ప్రతివాదికి చెల్లించడానికి మల్లికార్జునరావు వాగ్దానం చేశాడు. పైన చెప్పిన మల్లికార్జునరావు సుభాన్ నుంచి బాకీ వసూలు చేసి ప్రతివాదికి ఇవ్వకుండా తప్పించుకుంటున్నాడని తెలిసి ప్రతివాది అతని చర్యను ప్రశ్నించింది. దాని మీద ఈ మల్లికార్జునరావు కక్ష సాధింపుగా ఈ దావా వేయించాడు. ఈ దావా బాకీ 1977వ సం.రం. 7 నంబరు చట్టం కల్పించే సదుపాయాలు కిందకు వస్తుంది అని ప్రతివాది విన్నవించింది. ఎందుకంటే ఆమె 3 ఎకరాలు మెట్టభూమి ఉన్న వ్యవసాయదారురాలు కాబట్టి. దావా ప్రోనోటు నకిలీది కాబట్టి దాన్ని విచారించనవసరంలేదు.

4. వాది కోరిన మొత్తానికి అర్హుడా, కాదా అన్నది పరిశీలించవలసిన అంశం.

5. అంశం:– తే 17–10–77 దీన రూ.450/–లు ప్రతివాది అప్పుతీసుకొని దావా ప్రోనోటు రాసిఇచ్చిందని వాది దావా. సొమ్ము చెల్లించమని అడిగిన మీదట తే 11–10–80 దీన రూ.10/–లు చెల్లించి ఆమేరకు చెల్లు నమోదు చేయించుకుంది. దావా మొత్తం అంతే రావలసినదే. వాది దావాను బలపరుస్తూ వా.సా.–1 వాదే స్వయంగా పరీక్షింపబడ్డాడు. అలాగే వా.సా.–2 గా మానేపల్లి భోగేంద్రుడు ప్రోనోటు లేఖరి పరీక్షింపబడ్డాడు. ఇంకా ప్రోనోటుమీద చెల్లు రాసిన యెలమంచిలి రంగమన్నార్ వా.సా.–3 గా పరీక్షింపబడ్డాడు.

6. తే17–10–77 దీన రూ.450/–లు ప్రతివాది అప్పు తీసుకుని ఎగ్జిబిట్ ఎ–1 దావా ప్రోనోటు వుయ్యూరులో రాసి ఇచ్చిందని వాది చెప్పాడు. లేఖరి మానేపల్లి భోగేంద్రుడు పిల్లి సత్యనారాయణ అనే అతను దానిమీద సాక్షి సంతకందారు. ఆమె ప్రతిఫలం పూర్తిగా అందుకుంది. తే11–10–1980 దీన ఆమె రూ.10/–లు చెల్లించింది. ఆచెల్లు నమోదు ఎగ్జిబిట్ ఎ–2 రాసిన వాడు యెలమంచిలి రంగమన్నార్. వాది తరఫు సాక్షి మానేపల్లి భోగేంద్రుడు సాక్ష్యంలో ఏడేళ్ళ కిందట ప్రతివాది రూ.450/–లు వాది దగ్గర అప్పు తీసుకున్నదనీ, ఆ ప్రోనోటు ఎగ్జిబిట్ ఎ–1 వుయ్యూరులో వాది ఇంటి దగ్గర తానే రాశానని చెప్పాడు. ప్రతివాది తన బొటన వేలిముద్ర తనసమక్షంలోనే వేసిందన్నాడు. తేదీ 17–10–77 నాడు రూ.450/–లు ప్రతివాది అప్పుతీసుకొని వుయ్యూరులో వాది ఇంటి దగ్గర ఈ దావా ప్రోనోటు ఎగ్జిబిట్ ఎ–1 రాయించి ఇచ్చిందని వా.సా.–1,2ల సాక్ష్యంలో తెలుస్తోంది. వా.సా.–3 గా యెలమంచిలి రంగమన్నారు తన సాక్ష్యంలో

తే11-10-80 దీన ప్రతివాది రూ.10/- లు చెల్లించిందనీ, ఆ చెల్లు నమోదు ఎగ్జిబిట్ ఎ-2 తానే రాశాననీ తన ఎదుటనే ఆమె బొటనవేలి ముద్ర వేసిందని చెప్పాడు.

7. రూ. 200/-లు 1976లో వాది తండ్రి ఆమె కిచ్చినట్లు ప్రతివాది వాదన దరిమిలా వాది తండ్రి ప్రతివాది ఇంటికి వచ్చి బలవంతంగా కాగితానికి రెండువైపులా తన బొటన వేలిముద్రలు తీసుకున్న సంవత్సరం తర్వాత ముప్పావు బస్తా కందులు పాత బాకీ పూర్తి తీర్మానం కింద ఆమె చెల్లించింది. ప్రతివాది సుభాన్ అనే ఒకనికి ఉన్న అప్పును తిరిగి చెల్లించింది. అతని తాకట్టును మల్లికార్జునరావు వల్ల విడుదల చేసింది. ఈ మల్లికార్జునరావు వాది తండ్రి. ఈ మల్లికార్జునరావు ఈ మొత్తాన్ని సుభాన్ నుంచి వసూలు చేసి ప్రతివాదికి ఇస్తానని వాగ్దానం ఇచ్చాడు. బాకీ ఉన్న మొత్తాన్ని సుభాన్ నుంచి వసూలు చేసికూడా మల్లికార్జునరావు ఆమెకు ఇవ్వలేదు. ఆమె చెల్లింపుకోసం అడగ్గా, వాది తండ్రి బలాత్కారంగా తన బొటన వేలిముద్రలు సేకరించిన కాగితాన్నే నకిలీ ప్రోనోటుగా సృష్టించాడు.

8. ప్రతివాది తరపు సాక్షి-1 గా తానూ, ప్ర.సా-2 గా పి. సుబ్బారెడ్డి; ప్ర.సా-3గా పి. రంగారెడ్డి ; ప్ర.సా-4 గా ఆళ్ళ వెంకటేశ్వర రెడ్డి మొత్తం నలుగురు సాక్షులు ప్రతివాది తరపున పరీక్షించబడ్డారు.

9. రూ.400/- లు ప్రోనోటుకింద అప్పు తీసుకొని ఎగ్జిబిట్ ఎ-1 దావాప్రోనోటు రాసి ఇచ్చినట్లు ప్రతివాది ప్ర.సా.-1 గా పరీక్షించబడినప్పుడు వాఙ్మూలంలో చెప్పింది. ముఖ్య పరీక్షలో ప్రతివాది ముప్పావు బస్తా కందులు పూర్తి బాకీ తీర్మానం కోసం ఇచ్చినట్లు చెప్పింది. కానీ క్రాసు - పరీక్షలో మాత్రం దావా ప్రోనోటు బాపతు వడ్డీ నిమిత్తం ముప్పావు బస్తా కందులు చెల్లించాననీ, నగదు రూపంలో రూ.400/-లు చెల్లించాననీ ప్రతివాది చెప్పింది. వాద, ప్రతివాదనలను బట్టి అది ఆమె వాదం కాదు. అంతేకాదు నిజానికి వాది తండ్రి బలాత్కారంగా కాగితానికి రెండువైపులా బొటన వేలిముద్రలు తీసుకొని వుంటే ఆమె అతనికి నోటీసు జారీచేయించి ఉండేది. పై పెచ్చు దావా ప్రోనోటు మీద బొటన వేలిముద్రలు వేయించుకున్న ఒక సంవత్సరం తర్వాత రూ.200/-ల ఇంకో బాకీ పూర్తి తీర్మానం నిమిత్తం ముప్పావు బస్తా కందులు ప్రతివాది ఇచ్చానంది. ఆమె సాక్ష్యంగా వాది, ప్రతివాదనలకు పూర్తిగా అనుగుణంగా లేదు. తానూ, ప్రతివాదీ కలిసి వాది దగ్గరకు వెళ్ళి, ప్రోనోటు తిరిగి ఇచ్చివేయమని అడిగినప్పుడు అతడు ఆ ప్రోనోటు పోయిందని చెప్పాడని ప్ర.సా.-2 సాక్ష్యంలో చెప్పాడు. ఈ సాక్ష్యం ప్రకారం, రూ.400/-లు ప్రతివాది వాదికి చెల్లించినప్పుడు తాను ప్ర. సా. -2 ఉన్నాడు. కానీ ప్రోనోటు పోయిందని చెప్పినప్పుడు ఈ చెల్లింపుకు రసీదు కూడా వాళ్ళు రాయించుకోలేదు. దీనికి విరుద్ధంగా. ప్ర.సా.-3 గా పి.గంగారెడ్డి సాక్ష్యం ఇలా చెప్పాడు. "ఇప్పటికి నాలుగు సంవత్సరాల కిందట ప్రతివాది ముప్పావు బస్తా కందులు వుయ్యూరికి తానొక చౌదరికి వడ్డీ కింద ఇవ్వవలసిఉందని చెప్తూ తెచ్చిందని అతని సాక్ష్యానికి అంత ప్రాముఖ్యం లేదు. ఆళ్ళ వెంకటేశ్వరరెడ్డి ప్ర.సా.-4 గా సాక్ష్యం చెప్పాడు. ప్రతివాది కోరిన మీదట అతడు ముప్పావు బస్తా కందులు తీసుకొని వాది ఇంటికి చేర్చాడు. అప్పుడు ప్రతివాది ప్రోనోటు తిరిగి ఇచ్చివేయమని కోరగా, వాది అది పోయిందని చెప్పాడు. తే 17-10-77దీన

ఎగ్జిబిట్ ఎ-1 కింద ప్రతిఫలం ముట్టలేదని ప్రతివాది నిరూపించలేకపోయింది. ముప్పావు బస్తా కందులు వడ్డీ కింద ఇచ్చినట్లు నగదు రూ.400/-లు వాదికి చెల్లించినట్లు కూడా ప్రతివాది నిరూపించలేకపోయింది. వా.సా.లు 1 నుంచి 3 వరకున్నూ ఎగ్జిబిట్లు ఎ-1, ఎ-2 లు దావామొత్తం వాదికి ప్రతివాది ఇవ్వాలని నిరూపించాయి. కాబట్టి ఈ అంశం వాదికి అనుకూలంగా నేను నిర్ణయిస్తున్నాను.

10. ఫలితంగా రూ.758/-లకు ఖర్చులతోనూ, దావా తేదీనుంచి సొమ్ము చెల్లించే వరకూ సాలుసరి 6శాతం వడ్డీతోనూ దావా డిక్రీ ఇవ్వడమయినది.

సంక్షిప్త లేఖకునికి చెప్పి, అతడు లిప్యంతరీకరించిన తర్వాత, నేను సరిదిద్ది, బహిరంగంగా కోర్టులో 1984వ సం.రం. నవంబరు 7వ తేదీన ప్రకటించాను.

(సంతకం)
పి. వీరభద్రస్వామి
జిల్లా మునసబు, గన్నవరం.

**సాక్ష్యం అనుబంధం**

**పరీక్షించిన సాక్షులు**

**వాది తరపున:-**

వా.సా. 1. చలసాని బాబు జగన్మోహనరావు
వా.సా. 2. మానేపల్లి భోగేంద్రుడు
వా.సా. 3. ఎలమంచిలి రంగమన్నారు

**ప్రతివాది తరపున:-**

ప్ర. సా. 1. బి. సుభద్రమ్మ
ప్ర. సా. 2. పి. సుబ్బారెడ్డి
ప్ర. సా. 3. పి. గంగిరెడ్డి
ప్ర. సా. 4. ఆళ్ళ వెంకటేశ్వరరెడ్డి.

**గుర్తించిన పత్రాలు**

వాది తరపున :-

ఎగ్జిబిట్ ఎ-1/17-10-77 ప్రోనోటు
ఎగ్జిబిట్. ఎ-2 /11-10-80. ఎగ్జిబిట్ ఎ-1 మీద రూ10/- లు పాక్షిక చెల్లింపు ఎండార్స్‌మెంటు, నమోదు.

ప్రతివాది తరపున :-

ఏమీలేవు.

(సంతకం)
పి.వీరభద్రస్వామి.
జిల్లా మునసబు, గన్నవరం.

– సరైన నకలు –

(సంతకం)
జిల్లా మునసబు, గన్నవరం.

# 6.

# ప్రధాన జిల్లా మునసబు కోర్టు, నంద్యాల

ప్రధాన జిల్లా మునసబు కోర్టులో

హాజరు: శ్రీ ఎ. బాలచంద్రారెడ్డి, బి.ఏ; బి.ఎల్.,
ప్రధాన జిల్లా మునసబు.

1984వ సం.రం. అక్టోబరు 29వ తేదీ సోమవారం.

స్మాల్ కాజ్ దావా నెం49/83

గూటూరు రామయ్య.................................................వాదికీ

అద్దంకి చిన్న సుబ్బయ్య.............................................ప్రతివాదికీ

మధ్య :

వాది తరఫున న్యాయవాది శ్రీ ఎస్.శ్రీనివాసులు ప్రతివాది తరఫున న్యాయవాది ఎ.శేషగిరిరావు హాజరుకాగా తే 25–10–84 నాడు ఈ దావా నాముందు విచారణకు వచ్చి నేటికీ నిలిచి ఉన్నందువల్ల ఈ కింది తీర్పు చెప్పడమయింది.

తీర్పు

దావా ప్రోనోటు మీద రావాల్సిన అసలూ వడ్డీ బాకీ వసూలు నిమిత్తం రూ.800/–లకు వాది ప్రతివాదిపై వేసిన దావా ఇది. ప్లెయింట్‌లో (దావాపత్రంలో) ఉన్న విషయాలు ఇలా ఉన్నాయి:–

తే.28–8–80దీన తన కుటుంబావసరాలకు గురవయ్య కుమారుడు బాలయ్య దగ్గర ప్రతివాది నగదురూపంలో రూ.600/–లు అప్పు తీసుకొన్నాడు. దానికి నిర్ణయించుకున్న సాలుసరి వడ్డీరేటు 24 శాతం. తేదీ 28–8–80 నుంచి 1–10–81 వరకూ 12 శాతం చొప్పున వడ్డీ లెక్కించి ప్రతిఫలం మొత్తంగా రూ.670/–లు. 18 అక్టోబరు, 1981వ తేదీన తీసుకొని తరవాత సదరు గూటూరు బాలయ్య దావా ప్రోనోటు వాది పేర బదిలీ చేశాడు. ఎన్నిసార్లు అడిగినా రిజిస్టర్డు నోటీసు పంపినా ప్రతివాది దావా ప్రోనోటు బాపతు మొత్తం చెల్లించనందువల్ల ఈ దావా వచ్చింది. సాలుసరి 12 శాతం వడ్డీ

కోరడమయింది. ప్రస్తుత వాది పేర ప్రోనోటు బదిలీ కావడం ప్రతివాదికి బాగా తెలుసు. ప్రతివాదికి ప్రోనోటు బదిలీ చేసిన తర్వాత నెలలో తెలపడం జరిగింది. చిట్టచివరకు రిజిస్టర్డు నోటీసు ద్వారా కూడా తెలపడమయింది. ప్రోనోటు బదిలీ చేసినవ్యక్తి 2 సం॥ల కిందట చనిపోయాడు. ఖర్చులతో పాటు దావా డిక్రీ ఇమ్మని కోర్టును వాది ప్రార్థిస్తున్నాడు.

2. ప్రతివాది లిఖితపూర్వకమయిన స్టేట్ మెంట్ దాఖలు చేశాడు. దానిలో విషయాలు ఇలా వున్నాయి :–

గూటూరు బాలయ్య పేర ప్రతివాది ఒక ప్రోనోటు రాసి ఇచ్చాడు. సదరు బాలయ్య ఒక సంవత్సరం కిందట చనిపోయాడు. బాలయ్య చనిపోయిన తర్వాత, ప్రస్తుత వాది ప్రోనోటు అక్రమంగా స్వాధీనం చేసుకొని, బదిలీ నమోదు కింద చనిపోయిన బాలయ్య సంతకం సృష్టించాడు. తే18–10–81 దీన ప్రస్తుత వాది నుంచి చనిపోయిన బాలయ్య రూ.670/– లు తీసుకొని తన పేర బదిలీ చేశాడనడం శుద్ధ అబద్ధం. తే18–10–81న బదిలీ నమోదు సృష్టించబడింది. బదిలీ నమోదు కింద ఉన్న సంతకం చనిపోయిన గూటూరి బాలయ్యది కాదు. దావా వాది బుద్ధిపూర్వకంగా బదిలీ ఎండార్స్‌మెంటు కింద లేటు బాలయ్య సంతకం ఫోర్జరీ చేశాడు. ప్రోనోటు బాపతు బాకీ తీర్చమని బాలయ్య తాను చనిపోవడానికి మూడునెలల కిందట ప్రతివాదిని అడిగాడు. పంటకోత అయిన తరవాత తాను చెల్లిస్తానని చనిపోయిన బాలయ్యకు ప్రతివాది చెప్పాడు. చనిపోయిన బాలయ్యకు భార్య, కుమార్తె ఉన్నారు. ఇదే వాది దావా నెం. ఓ.యస్ 365/82 న బండి నాగయ్య మీద కూడ దావా వేశాడు. ఆ దావాలో కూడా గూటూరు బాలయ్య సంతకం రామయ్యగా ఈ వాది ఫోర్జరీ చేశాడు. బి.నాగయ్య దానిపై ప్రతివాదం చేస్తున్నాడు. ఆ దావా ఇంకా విచారణలో ఉంది. ఈ వాదనలను దృష్టిలో ఉంచుకొని ఖర్చులతో పాటు దావాను కొట్టి వెయ్యాలని ప్రతివాది అభ్యర్థన.

3. వాది తన తరఫున వాది తరఫు సాక్షులు 1నుంచి 3వరకు పరీక్షించాడు. ఎగ్జిబిట్ ఎ–1 నుంచి ఎ–4 వరకు గుర్తించబడ్డాయి. ప్రతివాది తరఫుసాక్షులను తన దావా రుజువు చేసుకోడానికి ప్రతివాది పరీక్షించాడు. ఎగ్జిబిట్ బి–1 నుంచి బి–5 వరకూ గుర్తించబడ్డాయి.

4. బదిలీ నమోదు ఎగ్జిబిట్ ఎ–2 అసలయినదా? నకిలీదా అన్నది ఉత్పన్నమైన ప్రశ్న.

5. ఎగ్జిబిట్ ఎ–1 ప్రోనోటు రాసినట్లు ప్రతివాది అంగీకరించినాడు. 18–10–81వ తేదీన రూ.670/లు ప్రతిఫలం చెల్లించిన తర్వాత ప్రోనోటు తనపేర బదిలీ చేయించుకొన్నట్లు వా.సా–1 చెప్పాడు. ఎగ్జిబిట్ ఎ–2 బదిలీ నమోదు జబ్బులో ఉన్న తన సోదరునికి అతడు రూ.670/–లు చెల్లించాడు. ప్రోనోటు తనపేర బదిలీ చేసేటప్పుడు అతను మంచం పట్టి ఉన్నాడు. అప్పుడు తన సోదరుడైన అతడు లేవలేకున్నాడు. అతణ్ణి పట్టుకొని లేవనెత్తగా తన సోదరుడు ఎగ్జిబిట్ ఎ–2 బదిలీ ఎండార్స్‌మెంటు (నమోదు) కింద తన సంతకం పెట్టాడు. తనసోదరుని సంతకంలో మునిపటిదానికీ ప్రస్తుతం ఉన్న

దానికీ కొంత తేడా ఉండవచ్చు. ఎగ్జిబిట్–2 రాసినప్పుడు సాక్షి సంతకాలు రాసినవారు, లేఖకుడు హాజరులో ఉన్నారు. ప్రస్తుత వాది సోదరుడు బాలయ్య లేడు. ప్రతివాదిని అప్పు తీర్చమని కోరుతున్నప్పటికీ అతడు ఏదో ఒక నెపంతో తప్పించుకుంటున్నాడు. వాది డిమాండ్ నోటీసు పంపాడు. ఎగ్జిబిట్ ఎ–3 దాని నకలు ప్రతి. తపాలా తిరుగు రసీదు ఎగ్జిబిట్ ఎ–4 ఎగ్జిబిట్ ఎ–3 కి ఏ జవాబులేదు. అందుకే ఈ దావా. తానూ తన సోదరుడూ 20 ఏళ్ళ కిందట వేరుపడ్డామని క్రాసుపరీక్షలో వా.సా.–1 చెప్పాడు. అతనికి ఒక్కడే సోదరున్నాడు. ఆ సోదరునికి భార్య, ఒక కుమార్తె ఉన్నారు. తనసోదరుడు ఇతరులకు ఎంతవరకు అప్పులిచ్చిందీ అతనికి (ప్రస్తుతవాదికి) తెలీదు. ఈ కోర్టులో తన సోదరుని పేర ఏ డిక్రీలు లేవు. బండి నాగయ్య మీద ఒ.యస్. 365/82లో వాది (ప్రస్తుతవాది) దావా వేశాడు. ఎగ్జిబిట్ ఎ–2 ఎండార్స్‌మెంట్ రాసిన లేఖకుడూ ఓ.యస్. నెం. 365/82 లోనూ ఒక్కడే. అందులోని ప్రతివాది ప్రోనోట్‌లో సంతకాన్ని సృష్టించినట్లు స్టేట్‌మెంటు దాఖలు చేశాడు. నాగళ్ళ వెంకటసుబ్బయ్య అనేవానిమీద ఒ.యస్. నెం. 293/81 లో లేటు బాలయ్య డిక్రీ పొందాడు. గూటూరు బాలయ్యకు, అతని భార్యకు సుమారు రూ.12000/–లు బ్యాంకులో ఉన్నాయి. బాలయ్య ఎప్పుడు చనిపోయిందీ అతడు చెప్పలేకపోయాడు. ఎగ్జిబిట్ ఎ–2 అయిన ఒకనెల తరవాత బాలయ్య చనిపోయినాడు. తన సోదరుని ప్రేరణతోనే ఎగ్జిబిట్ ఎ–1 లేఖకుణ్ణీ, సాక్షి సంతకాలు చేసేవాళ్ళను అతడు (వాది) తెచ్చాడు. తన సోదరుడు కర్నూలు ప్రభుత్వ ఆసుపత్రిలో చనిపోయాడు. లేటు బాలయ్య ఇతరులకు సొమ్ములు ఇచ్చిందీ లేనిదీ తెలీదనిన్నీ అతనికి బ్యాంక్‌లో సొమ్ములున్నాయో లేదో తెలీదనిన్నీ క్రాస్ పరీక్షలో వా.సా.–2 చెప్పాడు. బాలయ్యను చనిపోకముందు ఎప్పుడు చూశాడో అతడు చెప్పలేక పోయాడు. బాలయ్య జబ్బుతో ఎన్నినాళ్ళనుంచి బాధపడుతున్నదీ, లేవలేని పరిస్థితి ఎప్పటి నుంచి ఉన్నదీ అతనికి తెలీదు. రామయ్య పేర బండినాగయ్య రాయించి ఇచ్చిన ప్రోనోటు లేఖకుడతడే. ఆ ప్రోనోటు తేదీ అతడు చెప్పలేక పోయాడు. ఆ దావాలో లేటు బాలయ్య పేరు తొలగించి లేటు రామయ్య పేరు చేర్చడం జరిగిందని ప్రతివాది ఒక స్టేట్‌మెంటు దాఖలు చేశాడు. అంతకు ముందు రీతిలోనే బాలయ్య సంతకం పెట్టాడు. కానీ ఎగ్జిబిట్ ఎ–2 కింద సంతకం పెట్టేటప్పుడు అతని చెయ్యి వణుకుతూ ఉంది. బాలయ్య ఇతరులకు సొమ్ములు అడ్వాన్సు ఇచ్చాడు. వ్యాపారం చేస్తూఉండేవాడనీ క్రాసుపరీక్షలో వా.సా.–3 చెప్పాడు. బాలయ్య ఎన్ని నెలల ముందు వ్యాపారం ఆపాడో అతడు చెప్పలేక పోయాడు. 1981 సం ॥లో ఏ నెలలో ఈ నమోదు రాత జరిగిందో అతడు చెప్పలేకపోయాడు. బాలయ్యను కూర్చోబెట్టగా అదే పెన్నుతో అతడు సంతకం పెట్టాడు. బాలయ్య ప్రోనోటులో తను ధ్రువీకరించినదీ లేనిదీ తనకు జ్ఞాపకం లేదన్నాడు. ఈ న్యాయవాదుల సంఘంలో 26 ఏళ్ళ నుంచి న్యాయవాదిగా తాను ప్రాక్టీసు చేస్తున్నానని ప్ర.సా.–1 చెప్పాడు. గూటూరు బాలయ్య అతనికి తెలుసు. అతడు తన క్లయింటు. అతని సంతకాలతో తనకు పరిచయముంది. అతని (బాలయ్య) తరఫున ఎన్నో దావాలు అతడు వేశాడు. ఎగ్జిబిట్ బి–1 దావాపత్రం (ప్లెయింటు). ఎగ్జిబిట్ బి–2 వకాలత్‌నామా ఎగ్జిబిట్ బి–1, అంటే బి–3, బి–4లు తన సమక్షంలో సంతకాలయ్యాయి. ఎగ్జిబిట్ బి–5 వలె ఎగ్జిబిట్ బి–2

లోని సంతకం చేయడం అతని సమక్షంలోనే జరిగింది. ఎగ్జిబిట్ బి–1, ఎగ్జిబిట్ బి–2 లలో అతడు సంతకం పెట్టాడు. ఎగ్జిబిట్ బి–1, బి–2లు సంతకం పెట్టినప్పుడు గూటూరు బాలయ్య ఆరోగ్యంగానే ఉన్నాడనీ, ఎగ్జిబిట్ బి–1, ఎగ్జిబిట్ బి–2 లలో అతడు సంతకం పెట్టినప్పుడు అతనికే సహాయం లేదనీ క్రాసు పరీక్షలో ప్ర.సా.–1 చెప్పాడు.

6. ఎగ్జిబిట్ బి–3 నుంచి బి–5 వరకున్నూ ఎగ్జిబిట్ ఎ–2 కు మధ్య చాలా పెద్ద తేడా ఉంది. అంగీకరించిన సంతకాలకూ ఎగ్జిబిట్ ఎ–2 లోని వివాదాస్పదమయిన సంతకానికీ మధ్య మౌలిక విశేషలక్షణాలలో మార్పులు ఉన్నాయి. ఎగ్జిబిట్ ఎ–2 లోని వివాదాస్పదమయిన సంతకానికీ, ఎగ్జిబిట్ బి–3 నుంచి బి–5 వరకు గల వాటిలోని సంతకాలకూ చాలా పెద్ద తేడా ఉంది. మామూలు కంటికే ఆ ఎగ్జిబిట్ ఎ–2 లోని సంతకానికీ, ఎగ్జిబిట్లు బి–3 నుంచి బి–5 వరకు గలవాటిలోని సంతకాలకూ మధ్య మౌలిక విశేషలక్షణాలలో తేడా కనిపిస్తుంది. వాది అందించిన వివరణలు చాలవు. ఎగ్జిబిట్ ఎ–2 కింద గూటూరు బాలయ్య సంతకం పెట్టినప్పుడు జబ్బుపడి ఉన్నంత మాత్రాన మౌలిక విశేష లక్షణాలు సంతకంలో మార్పు చేయవు. ఎగ్జిబిట్ ఎ–2 లోని సంతకం స్పష్టంగా ఉంది. మామూలు విధానంలో రాసినట్లే ఉంది. ప్రతివాది అది ఫోర్జరీ అన్నాడు. కాబట్టి ఎగ్జిబిట్ ఎ–2 అసలుదే కానీ నకిలీది కాదని నిరూపించుకోవలసిన బాధ్యత, బరువూ వాదిమీదే ఉన్నాయి. అంతేకాక దస్తూరి నిపుణునికి సంతకం కాగితం వాది పంపలేదు. వా.సా.లు 1 నుంచి 3 వరకు ఉన్న వారి సాక్ష్యం నేను నమ్మటం లేదు. ఆ సాక్ష్యం మొత్తాన్ని తోసివేస్తున్నాను. లేటు గూటూరు బాలయ్య చనిపోయిన తర్వాత ఎగ్జిబిట్ ఎ–2ను ఫోర్జరీ చేసినట్లు నా నిర్ణయం కాబట్టి చర్చలను దృష్టిలో పెట్టుకొని, ఖర్చులతో పాటు దావాను కొట్టి వేయడమయింది.

సంక్షిప్త లేఖకునికి చెప్పి, అతడు లిప్యంతరణం చేసిన తర్వాత, దాన్ని సరిదిద్ది ఈ 1984వ సం.రం. అక్టోబరు 29వ తేదీన బహిరంగంగా కోర్టులో ప్రకటించాను.

(సంతకం)
బాలచంద్రారెడ్డి
ప్రధాన జిల్లా మునసబు,
నంద్యాల.

సాక్ష్యం అనుబంధం
పరీక్షించబడిన సాక్షులు

వాది తరపున :-

వా. సా. – 1. జె. రామయ్య (వాది)
వా. సా. – 2. ఎస్. వెంకట శివయ్య (ఎ2 లేఖకుడు)
వా. సా. – 3. ఆర్. రామసుబ్బయ్య (ఎగ్జిబిట్ ఎ–2 ధ్రువీకరించిన వారు)

ప్రతివాది తరుపున:-

ప్ర. సా.–1 జి. గుండూరావు.

## ఎగ్జిబిట్లు

వాది తరపున :-

ఎగ్జిబిట్. ఎ–1 28–8–80 దావా ప్రోనోటు

ఎగ్జిబిట్. ఎ–2 18–10–81 బదిలీ నమోదు

ఎగ్జిబిట్. ఎ–3 17–6–83 వాది ప్రతివాది కిచ్చిన నోటీసు నకలు ప్రతి.

ఎగ్జిబిట్ ఎ–4. ------ తపాలా తిరుగు రసీదు.

ప్రతివాది తరపున:-

ఎగ్జిబిట్ బి–1. ఓ.యస్ 293/81 లోని మూల దావాపత్రం.

ఎగ్జిబిట్ బి–2. ఓ.యస్. 293/81 లోని వకాలత్ నామా

ఎగ్జిబిట్ బి–3, బి–4. ఓ.యస్. 293/81 లోని ప్లెయింటు లోని జె.బాలయ్య సంతకాలు.

ఎగ్జిబిట్ బి–5. ఓ.యస్. 293/81 లో వకాలత్ నామాలోని జె.బాలయ్య సంతకం.

(సంతకం)
పి. డి. ఎం.
నంద్యాల.

–సరైన నకలు–

(సంతకం)
జిల్లాన్యాయమూర్తి, కర్నూలు.

# 7.

# జిల్లా మునసబు కోర్టు, గద్వాల

జిల్లా మునసబు కోర్టులో
(జిల్లా మహబూబ్‌నగర్)

హాజరు: శ్రీ నాగభూషణరావు, బి.ఏ., బి.ఎల్.,
జిల్లా మునసబు, గద్వాల.

పందొమ్మిది వందల ఎనభై అయిదో సం.రం. ఫిబ్రవరి నెల రెండో తేదీ శనివారం.

ఎస్.సి.నెం. 4/1984.

పి. నాగేశ్వర్రావు, తండ్రి : పి. కేశన్న, హిందువు
వయస్సు 49సం.లు, ఉపాధ్యాయుడు,.................................. వాదికీ
గద్వాల కాపురస్థుడు.

బి. హన్మంతు చనిపోయాడు. అతనికి వీరమ్మ భార్య,
హిందువు, వయస్సు 40 సం. లు. వృత్తి : గృహిణి,
గద్వాల కాపురస్థురాలు.................................................. ప్రతివాదికీ

మధ్య :

క్లెయిం : తే. 11-10 -1982న ప్రోనోటు ఆధారంగా వడ్డీతో బాటు రూ.700/-లు బాకీ వసూలు నిమిత్తం దావా.

న్యాయవాది కె.తిప్పారెడ్డి వాది తరఫున, ప్రతివాది తరుపున న్యాయవాదిగా శ్రీ ఎం.రాములు గౌడ్ హాజరుకాగా తుది తీర్పు నిమిత్తం వచ్చి నాముందుకు 28-1-1985 తేదీన, 31-1-85 వ తేదీన విచారణకు రాగా కోర్టు ఈ కింది విధంగా తీర్పు చెప్పింది.

తీర్పు

1. రూ.500/-లు తీసుకొని సాలుసరి 24 శాతం వడ్డీతో సహా దాన్ని చెల్లించడానికి ఒప్పుకొని తే11-10-82 దీన హనుమంతు, అనే ఒక ఉపాధ్యాయుడు వాది పేర ప్రోనోటును రాసి ఇచ్చాడు. కానీ సొమ్ము ఏమీ చెల్లించకుండానే చనిపోయాడు. హనుమంతు చనిపోయిన తర్వాత ఆ సొమ్ము చెల్లించమని అతని భార్యను అడగడం జరిగింది. ఎగ్జిబిట్

ఎ-2/2-3-84 న్యాయవాది నోటీసు ద్వారా కూడ అడగడం అయింది. తే. 3-3-84 దీన ప్రతివాది అందుకున్నట్లు ఎగ్జిబిట్ ఎ-3 ఉంది. అందిన తర్వాత ప్రతివాది 7-4-84న తేదీన ఎగ్జిబిట్ ఎ-4 కింద బాకీ కట్టించుకునే ఉద్దేశంతో సమధానం ఇచ్చింది. పై పరిస్థితుల్లో రావలిసిన బాకీ వసూలు ఖర్చులూ దరిమిలా వడ్డీతో బాటు రూ.700/-లను ప్రతివాది ఆస్తి ఆమెనుంచి రాబట్టుకోవడానికి వాది వేసిన దావా ఇది.

2. ప్రతివాది ఒక లిఖితపూర్వకమైన స్టేట్‌మెంటు దాఖలు చేసింది. అందులో ఇలా ఉంది: "లేటు హనుమంతు ఆమెభర్త. వాది దాఖలు చేసిన ఈదావా తప్పుగా వేసింది అని ఆమె వాదిస్తున్నది. వేసిన దావాకు వ్యాజ్య కారణంలేదు. ఇంకా ఇలా అందులో వుంది:- ఆ ప్రతివాది గౌరవనీయులయిన ఉపాధ్యాయుడు తగినంత జీతం తీసుకుంటున్నవాడని అతనికి ఎవరివద్దా ఎటువంటి బాకీ తీసుకోవలసిన అవసరం లేదనీ తనకెప్పుడూ ఇలాంటి అప్పు వ్యవహారం గురించి ఎవరిదగ్గరా ఉన్నట్లు ప్రతివాది కుటుంబం మీద కొన్ని ప్రత్యేక కక్షల కారణంతో వేయడం ప్రతివాదికి అసమంజసమనీ, ఈ సొమ్ము మొత్తం చెల్లింపనవసరం లేదనీ;" అంతేకాక తనభర్త ఉపాధ్యాయవేతనానికి తోడు అదనంగా దర్జీగా సంపాదించేవాడని అన్నది. ఇతరుల దగ్గర అప్పుతేవడం కేవలం అవసరం లేనిదనీ వాది ఆరోపణ అబద్ధమనీ కాబట్టి ఖర్చులతో పాటు దావా కొట్టివేయవలసిందనీ ఆ లిఖితపూర్వక స్టేట్‌మెంటు రాసింది.

3. వాది దావా క్లెయిమ్‌కు అర్హుడా? కాదా? అనిన్నీ ప్రతివాది భర్త లేటు హనుమంతు ఎగ్జిబిట్ ఎ- 1 ప్రోనోటు కింద సాలుసరి 24 శాతం వడ్డీతో బాటు చెల్లించడానికి అంగీకరిస్తూ వాది దగ్గర రూ.500/-లు అప్పు తీసుకొన్నాడా లేదా అనిన్నీ ఇక్కడ విచారణకు ఉత్పన్నమైన వివాదాంశాలు.

4. ప్రతివాది వాదన ఇలా ఉంది. ప్రతివాది భర్త అయిన లేటు హనుమంతుకు ఎటువంటి సొమ్ములు అప్పుగా తీసుకోవలసిన అవసరం లేదు. లేటు హనుమంతు తెస్తున్న నెల జీతం రూ.1000/-లో ప్రతివాది కుటుంబావసరాలకు సరిపోవడమే కాకుండా మిగిలి ఉంటుంది. ఇంకా ప్రతివాది ఇలా ఉటంకించింది:- ఉపాధ్యాయుల మధ్య తగవులాటల వల్ల అంటే ఈ వాది వా.సా.-1కు ప్రతివాది భర్తకూ మధ్య ఉన్న జగడాల వల్లనే ఈ దావాను తప్పుడుగా దాఖలు చేశారు. పై అభిప్రాయాన్ని బలపరచడానికి ప్రతివాది తనతో పాటు తన ప్రాంతంలో నివసిస్తూన్న ప్రతివాది తరఫు సాక్షులు 1,2లను సాక్ష్యం కోసం హాజరు పరిచింది. ప్ర.సా.లు-1 నుంచి 2 లేటుహనుమంతు ప్రతివాది భర్త అనిన్నీ అతడు ఉపాధ్యాయుడుగా పనిచేసేవాడనీ, రెండుసంవత్సరాల కింద చనిపోయాడనీ అందరూ అంగీకరించారు. అంతేకాదు వా.సా.లు- 1,2కూడా ఉపాధ్యాయులే అని వారు లిఖితపూర్వకమయిన స్టేట్‌మెంట్‌లోనూ వాదికి ఇచ్చిన సమాధానం నోటీసు ఎగ్జిబిట్ ఎ-4 లోనూ ఉపాధ్యాయుల మధ్య కలహాలవల్ల తప్పుడు దావా వేశారనిన్నీ ఎగ్జిబిట్ ఎ-1 ప్రోనోటు దొంగసృష్టి అనిన్నీ వాదనను వ్యక్తీకరించింది. కానీ వాది తరఫు సాక్షి-1 గా పరీక్షింపబడిన వాది ఇలా చెప్పాడు:- ప్రతి వాది భర్తఅయిన లేటు హనుమంతు తన వద్దనుంచి రూ.500/-లు అప్పు తీసుకొని స్వదస్తూరీతో 11-10-82వ తేదీన ఎగ్జిబిట్

ఎ–1 ప్రోనోటు రాసి ఇచ్చాడు. అవసరమయిన స్టాంపులు తెచ్చి అతికించిన తర్వాతనే లేటు హనుమంతు ఎగ్జిబిట్ ఎ–1 లో సంతకం పెట్టాడు. ఆ సమయంలో వా.సా.–2 మరో ఉపాధ్యాయుడు కూడా హాజరయి ఉన్నాడు. వాది ఇంటి దగ్గర ఈ దావా వ్యవహారం జరిగింది. దీన్ని వా.సా.–2 వాస్తవమని చెప్పాడు. వా.సా.–2 తనకు వాది లేటు హనుమంతు తెలుసు అన్నాడు. రూ.500/–లు అప్పు వాది దగ్గర లేటు హనుమంతు తీసుకొని దాన్ని సాలుసరి 24 శాతం వడ్డీతో బాటు చెల్లిస్తానని ఎగ్జిబిట్ ఎ–1 ప్రోనోటు రాసి ఇచ్చాడు. ప్రోనోటు రాసిన తర్వాత రెవిన్యూ స్టాంపులు అతికించి, ఎగ్జిబిట్ ఎ–1 మీద సంతకం పెట్టాడు. ఆసమయంలో వాది రూ.500/– లు లేటు హనుమంతుకు చెల్లించాడు. అది తన సమక్షంలో జరిగింది దానికి సాక్షిగా తాను సంతకం పెట్టాడు. ఆ ఎగ్జిబిట్ ఎ–1 మీద లేటు హనుమంతు సంతకం ఉంది. ఎగ్జిబిట్ ఎ–1 లేటు హనుమంతే రాసి ఇచ్చాడనిన్నీ అతడు ప్రతివాది భర్త అనిన్నీ ఆ సమయంలో లేటు హనుమంతు రూ. 500/– లు అప్పు తీసికొన్నాడనిన్నీ వా.సా.లు–1,2 పదే పదే చెప్పారు. వా.సా.–2 గౌరవనీయుడు, నమ్మదగినవాడని ప్రతివాది తరఫున పరీక్షించబడిన ప్ర.సా.లు–1, 2 చెప్పారు. ప్రతివాదికి ప్రతికూలంగాను వాదికి అనుకూలంగాను వా.సా.–2 కి చెప్పే అవసరంలేదు. హనుమంతు కూ వాదికీ మధ్య జగడాలు శతృత్వం ఉన్నాయన్న నోటిమాట తప్ప ప్రతివాది తరఫున చెప్పిన ఏ ఒక్క సాక్షీ చెప్ప లేదు. కనీసం ఆ కారణమైన చెప్పలేదు. ప్ర.సా.–1 తన క్రాసు పరీక్షలో వాళ్ళ కలహాల కారణం తనకు తెలీదని చెప్పాడు. వాదికీ ప్రతివాదికీ మధ్య శత్రుత్వంలేదు. తన క్రాసుపరీక్షలో ప్ర.సా.–1 ఇంకా ఇలా చెప్పాడు. హనుమంతు అప్పు తీసుకున్నదీ లేనిదీ తనకు తెలీదనిన్నీ హనుమంతు అప్పులు తీసుకున్నప్పుడెప్పుడూ తనను తీసుకొని వెళ్ళలేదనిన్నీ చెప్పాడు. హనుమంతుకీ వాదికీ మధ్య ఉన్న కలహం ఏరకమయిందీ తాను చెప్పజాలననీ తన క్రాసు పరీక్షలో ప్రతివాది కూడా చెప్పింది. చెప్పిన యధార్థాన్ని కాదనడం సులభమే కాని దాన్ని నిరూపించడం కష్టం. వాదికీ హనుమంతుకీ ముందున్న కలహాలన్ని ప్రతివాది నిరూపించగలిగే స్థితిలో లేదు. ప్రతివాది భర్తకూ, వాదికీ కలహం ఉండేదన్న కేవల సూచన మాత్రమే ప్రతివాదిని ఆ బాధ్యత నుంచి విముక్తిరాలిని చెయ్యజాలదు. అలాగే, ఎగ్జిబిట్ ఎ–1 తనభర్త లేటు హనుమంతు రాసింది కాదనీ దొంగసృష్టి పత్రం అనీ ప్రతివాది చెప్పింది. ఎగ్జిబిట్ ఎ–1 వంటి పత్రాన్ని దొంగసృష్టి చేయవలసిన అవసరం వాదికి లేదు. కోర్టులో దావా దాఖలు చేసేముందు న్యాయవాది నోటీసు ఎగ్జిబిట్ ఎ–2 పంపాడు. తపాలా తిరుగు రసీదు (ఎగ్జిబిట్ ఎ–3) మీద ప్రతివాది సంతకం పెట్టింది. అది నిజం కాకపోతే [వాది] అలా చేసి ఉండేవాడు కాదు.

5. ఎగ్జిబిట్ ఎ–1 లేటు హనుమంతే రాసి ఇచ్చాడనిన్నీ ఎగ్జిబిట్ ఎ–1 మీది సంతకం లేటు హనుమంతుదేననిన్నీ నిరూపించుకోవలసిన బాధ్యత వాదిదే అని ప్రతివాది వాదించింది. ఎగ్జిబిట్ ఎ–1 మీది సంతకం తన భర్తది కాదని లేటు హనుమంతు భార్య అయిన ప్రతివాది చెప్పింది. అది తన భర్త సంతకం కాదని చెప్పడం సులభమే. ఎగ్జిబిట్ ఎ–1 మీద ఉన్న సంతకం లేటు హనుమంతుది కాదు. ఇతరులది అని చెప్పడానికి తన అభిప్రాయాన్ని బలపరచడానికి, సంతకాన్ని సవాలుచేస్తున్నాను అని చెప్పడానికి ప్రతివాది తరఫున ఏ ఇతర అక్షరాస్యుణ్ణీ పరీక్షకు నివేదించలేదు. కేవలం

మామూలు కంటితో పోల్చి చూడ్డానికి కూడా తన అభిప్రాయాన్ని బలపరచుకోడానికి ఒప్పుకున్న సంతకాల వైనప్పటికీ ప్రతివాది అందించ లేదు. వాది చెప్పడమే కాకుండా లేటు హనుమంతు ఎగ్జిబిట్ ఎ-1 ప్రోనోటు స్వదస్తూరితో రాసి రెవిన్యూ స్టాంపులు అతికించిన తరవాత తన సమక్షంలో సంతకం పెట్టాడని ప్రమాణం చేసి ఎగ్జిబిట్ ఎ-1 ప్రోనోటు ధ్రువీకరణదారు వా.సా-2 వాదితరపున చెప్పాడు. ప్రతివాది తరఫున సాక్షులుగా పరీక్షింపబడిన ప్ర.సా-1,ప్ర.సా.-2లు కూడా వా.సా.-2 నమ్మదగిన సాక్షి అని ఒప్పుకున్నారు. ప్ర.సా.లు-1, 2 వ్యక్తులు వా.సా-2 గౌరవనీయుడని అంగీకరించిన దాన్ని పరిగణిస్తూ, ఎగ్జిబిట్ ఎ-1 లేటు హనుమంతే రాసి ఇచ్చాడని వా.సా.-2 చెప్పడం వల్ల వాది నమ్మదగిన సాక్షుల్ని ఎదుటపెట్టి, తన వ్యాజ్యాన్ని బాగా నిరూపించుకున్నాడని చెప్పవచ్చు. దీనివల్ల ప్రతివాది భర్త అయిన లేటు హనుమంతు వాది నుంచి రూ.500/-లు అప్పు తీసుకొని సాలుసరి 24 శాతం వడ్డీతో బాటు సొమ్ము చెల్లిస్తానని ఒప్పుకొని ఎగ్జిబిట్ ఎ-1 రాసి ఇచ్చాడని తేలింది. వాది ప్రాథమిక బాధ్యతను సంతృప్తికరంగా నిరూపించుకున్నాడు. ఇంకా ప్రతివాది ఆ సంతకం లేటు హనుమంతుది కాదని భావిస్తే "చేతిరాత నిపుణులకు" ఆ సంతకం కాగితం పంపి, వాళ్ళ అభిప్రాయం తెలుసుకోడానికి చర్యలు తీసుకొని ఉండవలసింది. ఆ కాగితం కూటసృష్టి అన్న ప్రతివాది అభిప్రాయం బలపరచుకోడానికి అప్పుడు వీలయ్యేది.

6. ర్యాలి కామేశ్వరరావుకూ బెంపూడి సూర్య ప్రకాశరావు మరికొందరికీ మధ్య జరిగిన వివాదంలో ఎ.ఐ.ఆర్. 1962 ఆంధ్రప్రదేశ్ పుట : 178 లో వచ్చిన కోర్టు నిర్ణయం మీద ప్రతివాది తరఫున న్యాయవాది ఆధారపడ్డారు. పత్రంమీద స్వయంగా వీలునామా కర్త సంతకం పెట్టడం చూసిన ప్రత్యక్ష్య సాక్ష్యం నమ్మదగిన వ్యక్తుల సాక్ష్యంమీద అది ఆధారపడి ఉంది. నిపుణుల అభిప్రాయం మీద నమ్మడానికి లేదా నిపుణుల అభిప్రాయం కోసం పంపవలసిన అవసరంలేదు. ప్రతివాది తరఫున న్యాయవాది ఇలా అభిప్రాయ పడ్డారు:- ఇండియన్ ఎవిడెన్స్ యాక్టు 67వ పరిచ్ఛేదం కింద, ఏవ్యక్తి అయినా ఒక డాక్యుమెంటు పూర్తిగా కానీ పాక్షికంగా కానీ రాసినట్లు . కానీ, సంతకం పెట్టినట్లు కానీ ఆరోపణ వస్తే, ఆ సంతకం లేదా పత్రం దస్తూరీ అవ్యక్తి దస్తూరీతో ఋజువు కావాలి. ఆ ఇండియన్ ఎవిడెన్స్ యాక్టు 68వ పరిచ్ఛేదం కింద, న్యాయం ఆ డాక్యుమెంటు ధ్రువీకరణ కోరినట్లయితే ఆ ధ్రువీకరణను సాక్ష్యంగా భావించనక్కర్లేదు. అయితే దీనికి కనీసం ఒక్కడయినా అమలు నిరూపణకు సజీవ ధ్రువీకరణ సాక్షి అవసరం. ప్రస్తుత దావా ఎగ్జిబిట్ ఎ-1 లేటు హనుమంతు రాసిన ప్రోనోటు. కానీ ప్రతివాది (ఎగ్జిబిట్ ఎ-1లో ఉన్నసంతకం లేటు హనుమంతుది కాదని అభిప్రాయ పడింది. ఎగ్జిబిట్ ఎ-1 ప్రోనోటును ఏసాక్షి ధ్రువీకరించనవసరం లేకపోయినప్పటికీ వా.సా.-2 ఎగ్జిబిట్ ఎ-1 ను ధ్రువీకరించాడు. ఈ వా.సా.-2 వాది తరఫున పరీక్షించడం జరిగింది. ఈ వాది లేటు హనుమంతుకు రూ.500/-లు ఇచ్చాడు. ప్ర.సా.లు- 1, 2 వ్యక్తులు పైసాక్షిని గౌరవనీయుడుగా అంగీకరించారు. ఆసాక్షి ప్రమాణం మీద లేటు హనుమంతు అది రాశాడని వాఙ్మూలం ఇచ్చాడు. పైన ఉటంకించిన నిర్ణయం ప్రకారం మరణించిన వ్యక్తి సంతకం పెట్టిన వీలునామాకు ప్రత్యక్ష సాక్ష్యం ఉంటే నిపుణుల అభిప్రాయం తెలుసు కోవలసిన

అవసరం లేదు. ఇండియన్ ఎవిడెన్స్ యాక్టు 45వ పరిచ్ఛేదం ప్రకారం దస్తూరీ నిపుణుల అభిప్రాయ సేకరణ అవశ్యం అవసరమే, దాన్ని జాగ్రత్తగా స్వీకరించాలి. దస్తూరీలలో వివాదం తలఎత్తినప్పుడు కోర్టు వారు ఒక తుది నిర్ణయానికి రావడానికి దస్తూరీ నిపుణుని అభిప్రాయం సహాయకారిగా ఉంటుంది. దస్తూరీలను పోల్చి ఒక అభిప్రాయం ఏర్పరచుకోవడం అనుభవాన్ని బట్టి చేసేది కాబట్టి అరుదుగా తప్పు అభిప్రాయానికి వచ్చే అవకాశం ఉంది. అందుకే నమ్మకమైన ప్రత్యక్ష సాక్ష్యం ఉన్నప్పుడు నిపుణుని అభిప్రాయ సేకరణ అనవసరం. వా.సా.–2 ప్రత్యక్ష సాక్షి అతడు లేటు హనుమంతు తన సమక్షంలోనే సంతకం చేసినట్లు వాఙ్మూలం ఇచ్చాడు. కాబట్టి వాది లేటు హనుమంతు ఎగ్జిబిట్ ఎ–1 ను రాశాడన్న సాక్ష్యం నిలబెట్టి నిరూపించుకున్నాడని నా అభిప్రాయం. వాదికీ తన భర్త హనుమంతుకూ మధ్య ఉన్న పాత జగడాల కారణంగా అది కూటసృష్టి కాగితం అని ప్రతివాది అభిప్రాయ పడింది. అది కేవలం వాదికి, బాకీ ఉన్న మొత్తం ఎగవేయడానికి వేసిన ఎత్తు కానీ అంతకన్న వేరేమి కాదు. చనిపోయిన హనుమంతు ఈ అప్పు తీసుకున్నాడు. ఈ హనుమంతు మరెవరో కాదు ప్రతివాది భర్తే. అందువల్ల వాదికి ప్రతివాది భర్త ప్రోనోటు రాసిఇచ్చాడన్న వాదాన్ని నేను నమ్ముతున్నాను. ఆప్రోనోటుకు ప్రతిఫలంగా రూ.500/–లు పుచ్చుకొని సాలుసరి 24 వ శాతం వడ్డీతో బాటు ఆ సొమ్ము తిరిగి చెల్లించడానికి అంగీకరించి హనుమంతు స్వదస్తూరితో ఎగ్జిబిట్ ఎ–1 ప్రోనోటు రాసి ఇచ్చాడన్నది స్పష్టం.

7. పై చర్చల వల్ల, వాది కోరినట్లు ఖర్చులతో సహా దావా డిక్రీ ఇవ్వడమయింది. ఇది రూ.700/– లు బాకీ వసూలుతో బాటు పూర్తిగా బాకీ చెల్లించే వరకూ దావా తేదీ 26–3–84 నుంచి అసలు మొత్తం రూ.500/– లమీద సాలుసరి 6 శాతం వడ్డీ చొప్పున దరిమిలా వడ్డీని కూడా ప్రస్తుత ప్రతివాది అధీనంలో లేటు హనుమంతు ఆస్తులనుంచి రాబట్టు కోడానికి డిక్రీ యివ్వడమైనది.

సంక్షిప్త లేఖకురాలికి చెప్పి, ఆమె లిప్యంతరణం చేసిన తరువాత సరిదిద్ది 1985వ సం.రం. ఫిబ్రవరి నెల 2 వరోజు కోర్టులో బహిరంగంగా నేను దీన్ని ప్రకటించాను.

(సంతకం)
జిల్లా మునసబు, గద్వాల.

సాక్ష్యం అనుబంధం

పరీక్షించిన సాక్షులు.

**వాదితరపున:-**

వా.సా:–1. శ్రీ పి.నాగేశ్వరరావు. వాది.

వా.సా.–2. శ్రీ జానకిరాములు.

**ప్రతివాది తరపున:-**

ప్ర.సా. - 1 శ్రీ సుదర్శన్

ప్ర.సా. - 2 శ్రీ నారాయణ.

ప్ర.సా. - 3. శ్రీమతి బోయవీరమ్మ.... ప్రతివాది.

**వాది తరపున ఎగ్జిబిట్లు.**

ఎగ్జిబిట్. ఎ-1. తే 11-10-82దీన వాది పేర లేటు హనుమంతు రాసి ఇచ్చిన ప్రోనోటు.

ఎగ్జిబిట్ ఎ-2. తే 26-3-84దీన ప్రతివాదికి న్యాయవాది పంపిన నోటీసుకు కార్యాలయ నకలు ప్రతి.

ఎగ్జిబిట్ ఎ-3. తే 3-3-84దీన ప్రతివాదికి ముట్టినట్లు తపాలా శాఖవారి తిరుగు రసీదు.

ఎగ్జిబిట్ ఎ-4 తే 7-3-84దీన ప్రతివాది వాదికి పంపిన నోటీసు సమాధానం.

**ప్రతివాది తరపున ఎగ్జిబిట్లు:-** ఏమీలేవు

(సంతకం)
జిల్లా మునసబు, గద్వాల.

-సరైన నకలు-

(సంతకం)
జిల్లా మునసబు, గద్వాల.

# 8.

# మొదటి అదనపు జిల్లా మునసబు కోర్టు, చీరాల

మొదటి అదనపు జిల్లా మునసబు కోర్టులో

హాజరు: శ్రీ వై.వి.రామారావు, బి.ఏ., ఎల్.ఎల్.బి.,
మొదటి అదనపు జిల్లా మునసబు.

1982వ సం.రం డిసెంబరు 14వ తేదీ మంగళవారం.

ఎస్.సి.నెం.7/80

అన్నవరపు శ్రీరాములు ..................................................వాదికీ

చూడబోయిన రాఘవులు (అతని తరపున అతని అవిభక్త కుటుంబ యజమాని గాను) ..................................................ప్రతివాదికీ

మధ్య :

వాది తరపున న్యాయవాది శ్రీ ఎ.నరసింహారావు; ప్రతివాది తరపున న్యాయవాది శ్రీ బి.శేషగిరిరావు హాజరయి వాదాలు వినిపించగా 8–11–1982 తేదీన నా సమక్షంలో తుది విచారణ కోసం వచ్చి, నేటి వరకు నిలచి ఉన్నందువల్ల ఈ కింది తీర్పు కోర్టు చెప్పింది: –

తీర్పు

1. సాలుసరి వడ్డీ 18 శాతంతో అసలు కూడ తిరిగి చెల్లించడానికి ఒప్పుకొని వాది పేర ప్రతివాది రూ.230/–లకు తే6–2–1974 దీన రాయించి ఇచ్చిన ప్రోనోటు బాపతు అసలు వడ్డీలతో సహా ఇవ్వవలసిన బాకీ మొత్తం రూ.295–15 లు వసూలు నిమిత్తం వేసిన దావా ఇది.

2. ప్లెయింటులో ఉటంకించిన విషయాలు సంక్షిప్తంగా ఇలా ఉన్నాయి:

తేదీ 6–2–1974న సాలుసరి 18శాతం వడ్డీ రూ.230/–లు వాదినుంచి ప్రతివాది

అప్పు తీసుకొని అదే రోజున వాది పేర ప్రోనోటు రాయించి ఇచ్చాడు. 6-2-1977వ తేదీన రూ.5/-లు ప్రతివాది చెల్లించి ప్రోనోటు మీద ఆమేరకు చెల్లు రాయించుకున్నాడు. ఎన్నో సార్లు అడిగినప్పటికీ ప్రతివాది బాకీ తీర్చలేదు. చట్టం 4/38 ప్రకారం రుణాన్ని తగ్గించారు. చట్టం 7/77 తాలూకు ప్రయోజనాలకు ప్రతివాది అర్హుడుకాడు.

3. దావా ప్లెయింటులో ఉటంకించిన విషయాలన్నీ అబద్ధాలనీ న్యాయపరంగా దావా చెల్లదనిన్నీ ప్రతివాది లిఖితపూర్వక స్టేట్‌మెంటు దాఖలు చేశాడు. ప్రతివాది ఒప్పుకోని ఆరోపణలన్నీ వాది నిరూపించాలి. వాది సొమ్మేమీ ఇవ్వలేదు. ఈప్రోనోటు హామీగా రాసి ఇచ్చింది కాదు. రుణ చట్టం 7/77 తనకు వర్తిస్తుంది కాబట్టి ఆ రుణం తీర్చవలసిన అవసరంలేదు. ప్రతివాదికి మెట్టపొలం ఉంది. అతడు వ్యవసాయం మీద ఆధార పడి ఉన్నాడు. వ్యవసాయ రాబడి మినహా ఇంకే ఇతర రాబడీ తనకు లేదు. చట్టం 7/77 ప్రతివాదికి వర్తిస్తుందా ?

4. పరిశీలించవలసిన వాదాంశాలు చట్టం 7/77 ప్రతివాదికి వర్తిస్తుందా? వాది దగ్గర ప్రతివాది ఏమైనా రుణం తీసుకున్నాడా?

5. వాది తరపున వాది తరపు సాక్షులు- 1,2లను పరీక్షించారు. ఎ-1 నుంచి ఎ-4 వరకు ఎగ్జిబిట్లు గుర్తించారు. ఇద్దరు సాక్షుల్ని ప్రతివాది పరీక్షించాడు. బి-1, బి-2 లను ప్రత్యేకించి ఎగ్జిబిట్లు గా గుర్తించారు.

6. తేదీ 6-2-1974న ప్రతివాది రూ.230/-లు వాది నుంచి అప్పు తీసుకొని ఎగ్జిబిట్ ఎ-2 ప్రోనోటు రాయించి ఇచ్చాడు. తేదీ 6-7-77న ప్రతివాది రూ.5/-లు చెల్లించి ఆమేరకు చెల్లు ఎగ్జిబిట్ ఎ-3 కింద నమోదు చేయించాడు. ఎన్నిసార్లు అడిగినా ఎగ్జిబిట్ ఎ-2 కింద ప్రతివాది ఏమీ చెల్లించలేదు అని వాది దావా. వాది నుంచి ఏమి అప్పు తీసుకోలేదని ప్రతివాది అన్నాడు. తనకు 3-00 ఎకరాల మెట్టభూమి మాత్రమే ఉండటం వల్ల చట్టం 7/77 వర్తిస్తుందని ప్రతివాది అన్నాడు.

7. ప్రతివాది రాయించి ఇచ్చినట్లు చెప్పే ప్రోనోటు ఎగ్జిబిట్ ఎ-2గా వాది చూపాడు. ఎగ్జిబిట్ ఎ-2 వల్ల 6-2-1974వ తేదీన రూ.230/-లు వాది నుంచి ప్రతివాది వ్యవసాయఖర్చులకోసం అప్పు తీసుకున్నట్లూ ఎగ్జిబిట్ ఎ-2 మీద ప్రతివాది సంతకం పెట్టినట్లూ స్పష్టంగా ఉంది. అలాగే, ఎగ్జిబిట్ ఎ-2 కు ప్రతివాది పాక్షిక చెల్లింపుగా రూ.5/-లు తే 6-2-77 దీన చెల్లించినట్లు ఎగ్జిబిట్ ఎ-3 కింద చెల్లుకు ప్రతివాది సంతకం పెట్టాడు. ఎగ్జిబిట్ ఎ-2 రాయించి ఇవ్వలేదని నోటితో చెప్పడం మినహా ప్రతివాదికి ఇతర సాక్ష్యాలు లేవు. ప్రతివాది నేను చిన్న రైతుననీ చట్టం 7/77 తనకు వర్తిస్తుందన్న ఇతర వాదనలు ప్రతివాది చేసుకున్నాడు. దాన్ని బలపరచడానికి తనతో (ప్రతివాదితో) పాటు కడవకుదురు గ్రామకరణంగా చెప్పే గాలి చినసుబ్బారావు ప్రతివాది తరపున సాక్షి-2 పరీక్షించడం జరిగింది. అతని సాక్ష్యం ప్రకారం సర్వే నెం. 303/1 లో 1-11 ఎకరం మాగాణి, సర్వేనెం.304/3 లో 50 సెంట్లూ, సర్వే నెం. 274/4

లో 53 సెంట్ల్లో, సర్వే నెం.362/7లో 19 సెంట్ల్లో, ఇంకా మరో 25 సెంట్ల్లో భూమి ప్రతివాదికి ఉన్నట్లు తేలింది. ప్ర.సా.–2 సాక్ష్యం ప్రకారం ప్రతివాదికి 1 ఎకరం 11 సెంట్లు మాగాణీ, 1–47 సెంట్లు మెట్టపొలం ఉన్నట్లు తేలింది. ప్రతివాదికి మేజరయిన కుమారుడు ఉన్నాడనిన్నీ ప్రతివాదీ అతడూ కలిసే ఉంటున్నారనీ ఇరుపక్షాలు అంగీకరించారు.

8. వ్యవసాయేతరమైన రాబడి సాలుసరి రూ.1200/లకు మించి ప్రతివాదికి ఉందనీ, అతనికి రెండు టైర్ల ఎడ్లబండి లేనట్లు ఎక్కడా ప్రత్యేకంగా చెప్పలేదనీ, అంతేకాక స్వయంగా ప్రతివాది తనభూమిని తానే దున్నటంలేదని అంగీకరించాడనీ దానివల్ల చట్టం 7/77 అతనికి వర్తించదని వాది తరపున న్యాయవాది వాదించాడు.

9. 1981(2) ఎన్.ఎ.డబ్ల్యు.ఆర్.పుట 351 ; 1982 (1) ఆంధ్ర వీక్లీ రిపోర్టరు, పుట 251 ; 1980 (2) ఆంధ్ర వీక్లీ రిపోర్టరు పుట 44 ; 1981 ఎ.పి. లా జర్నల్, పుట 373 లోని తీర్పుల మీద వాది తరపు న్యాయవాది వాద బలానికి ఆధారం చేసుకున్నారు. 1981(2) ఎ.పి.యల్.జె. పుట 373లో ఇలాఉంది:–

"సొంతభూమి ఉన్న, సొంతంగా వ్యవసాయం చేస్తున్న గరిష్ఠ పరిమితికి లోబడిన భూమిగల చిన్నరైతు తీసుకున్న అప్పు తీర్చి వేసినట్లే. అతని భార్య, మైనరు పిల్లలు కలిగిఉన్న భూపరిమితితో దీనికి సంబంధం లేదు."

వాది తరపున న్యాయవాది ఈ దావాలో ఇలా అభిప్రాయ పడ్డారు. "ప్రతివాది స్వయంగా వ్యవసాయం చేయలేదని అంగీకరించినందువల్ల చట్టం 7/77 వర్తించదు". కానీ వాది స్వయంగా ప్రతివాదితో అతని కుమారుడు కలిసి జీవిస్తున్నట్లు ఒప్పుకున్నాడు. వాది చెప్పినదాని ప్రకారం, ప్రతివాదికి భూములుండి, కొందరి భూముల్ని కౌలుకు తీసుకొని కూడ వ్యవసాయం చేయిస్తున్నాడు. కాబట్టి అతడు తన దావాపత్రంలో ఉటంకించిన దాన్నుంచి తిరిగిపోజాలడు, కేవలం ప్ర.సా.–1 చెప్పి ధ్రువపరచిన దానిమీద మాత్రమే ఆధారపడుతున్నాడు.

10. 1982 (1) ఆంధ్ర వీక్లీ రిపోర్టరు పుట 251 లోని తీర్పు ప్రకారం:–

"కాని వ్యవసాయేతర సాలుసరి రాబడి ఒక వెయ్యి పన్నెండు వందలకు మించి రాబడి ఉన్నవారు ఇందులోకి చేరరు" అని క్లాజు (ii) సెక్షన్3 లో ఉంది. అంతే కాకుండా ఈ మాటలు సెక్షన్ 3 లోనివాటికి, (i), (ii) లలోని వాటికి మినహాయింపుగా ఉన్నాయి. ప్రతివాది సాలుసరి వ్యవసాయేతర రాబడి రూ.1200/–లకు మించి ఉందని రుజువు చేయవలసిన బాధ్యత వాదిపై ఉంది. ఈ విషయంలో వాది తరపున సాక్ష్యం ప్ర.సా.–1 కథనంమీద ఆధారపడటం మినహా ఇంకేమిలేదు. ఆ కథనంలో కూలీగా ప్రతివాది రోజుకు రూ.5/– లేదా రూ.6/–లు సంపాదిస్తాడని ఉంది. వాది బండిమీద ప్రతివాదికి అద్దె రూపంలో కొంత సొమ్ము వస్తుందని వాదించినప్పటికీ ప్రతివాది తనకు రెండు టైర్ల ఎద్దుల బండి లేదని చెప్పాడు.

11. 1980(2) ఆంధ్ర వీక్లీ రిపోర్టరు పుట 444లో అతడు వ్యవసాయదారు అన్నది బాకీదారు ప్రథమతః రుజువు చేసుకోవాలన్న బాధ్యత ఉంది. కానీ ప్రస్తుత దావాలో, గ్రామకరణాన్ని ప్రతివాది పరీక్షించాడు. ప్రతివాది వ్యవసాయదారు అనీ అతనికి 1 హెక్టారు భూమి కన్న తక్కువ భూమి ఉందనీ ఆ గ్రామకరణం చెప్పాడు. వాది ప్ర.సా.–2 ని అడ్డు పరీక్ష (క్రాస్ ఎగ్జామినేషన్) చేయలేదు. ఆంధ్ర ప్రదేశ్ చట్టం 7/77 సి.ఎల్.జె లోని సెక్షన్ (3)ను అనుసరించి బాకీదారు అంటే వ్యవసాయకూలీ, పల్లెల్లోని చేతివృత్తి పనివాడు లేదా చిన్నరైతు, ఈ చట్టం మొదలు కావడానికి ముందు అప్పు తీసుకున్నవాడు అని అర్థం ఉంది. ముఖ్యంగా వ్యవసాయభూమి మీదినుంచి వచ్చిన రాబడినే ముఖ్య జీవనాధారం కలవాడూ, లేదా వ్యవసాయభూమి ఉండి సొంతంగా వ్యవసాయంచేసేవాడు, కౌలుకు తీసుకొని వ్యవసాయం చేసేవాడు, లేదా గుత్తకు పంటవాటా తీసుకునేవాడు, స్వాధీనపు తనఖా పెట్టుకొన్నవాడూ, పల్లపు భూమి ఒక హెక్టారుకు, మెట్టభూమి 2 హెక్టార్లకు మించని భూమికలవాడూ అని చిన్నరైతుకు నిర్వచనం ఉంది.

ప్రతివాది దాఖలు చేసిన ఎగ్జిబిట్లు బి1, బి2 లు. చీరాల సబార్డినేట్ జడ్జి కోర్టులో ఎస్.సి. 11/79 లోని తీర్పు ధ్రువీకరణ ప్రతి బి–2. ఈ తీర్పు వల్ల ప్రతివాది చిన్నరైతుగా చట్టం 7/77 సదుపాయాల కిందికి వస్తాడు. ఈతీర్పు 18– 2–1981 లో వెలువడింది. ప్రతివాది తరఫున న్యాయవాది ఇలా వాదించాడు." ఎస్.సి.11/79 దావా తర్వాత ప్రతివాది అదనంగా సంపాదించిన ఆస్తి లేదు. ఈదావా తరవాత మరికొంత ఆస్తి ప్రతివాదికి ఉన్న సాక్ష్యం ఏమీలేదు. ప్రతివాదికి టైరుబండి ఉన్న సాక్ష్యం కూడా ఏమిలేదు." ఇంకా ఇలా వాదించాడు. "ఎస్.సి.11/79 లోని తీర్పు పూర్వనిర్ణయ తీర్పుగా ప్రవర్తిస్తుంది. కానీ వాది వాదన ఏమిటి అంటే "మొదట్లో లిఖితపూర్వక స్టేట్ మెంట్ దాఖలు చేసేటప్పుడు ప్రతివాది ఈ పూర్వనిర్ణయం తీర్పుగా వర్తిస్తుందని చెప్పకుండా ఎస్.సి. 11/79 పూర్వనిర్ణయ తీర్పుగా వర్తిస్తుందని ఇప్పుడు వాదించజాలడని". కానీ ఎస్.సి. 11/79 తీర్పును ప్రతివాది దాఖలు చేసి ఉన్నాడు. ఎస్.సి. 11/79 లోని చాలా అంశాలను కోర్టు ముందు వాది వాదన చేశాడు. అంతేకాదు రూ. 1200/– లకన్న ఎక్కువ వ్యవసాయేతర రాబడి ప్రతివాదికి వస్తున్నట్లు అదనపు సాక్ష్యం వాది చూపలేక పోయాడు. ఇంకా ప్లెయింటులో పేర్కొన్నట్లు ప్రతివాది వ్యవసాయదారు అని స్వయంగా వాదే అంగీకరించాడు. ప్రతివాది తాను కూలిపనికి వెళ్తున్నట్లు చెప్పినప్పటికీ అతని ముఖ్యజీవనాధారం వ్యవసాయం మీది రాబడిగానే తీసుకోవచ్చు. ప్ర.సా.–1 సాక్ష్యంలో అతనికి భూమిమీద కేవలం రూ.150/– లు మాత్రమే వస్తుంది. గత పది సంవత్సరాలుగా పక్షవాతంతో బాధపడుతున్న తనతల్లికి రోజూ రూ.8/- లేదా రూ. 10 /–లు మందులకోసం అతడు ఖర్చు పెడుతున్నాడు.

ఈ అన్ని కారణాలవల్ల చట్టం 7/77 ప్రతివాదికి వర్తిస్తుందని నేను నిర్ణయిస్తున్నాను. అందువల్ల ప్రతివాది చిన్నరైతు కావడంచేత బాకీ చెల్లించివేసినట్లే భావించాలి. పర్యవసానంగా ఈ దావా ఖర్చులతో కొట్టివేయడమయింది.

1982వ సంవత్సరం డిసెంబరు 14వ తేదీన సంక్షిప్త లేఖకురాలికి చెప్పి, ఆమె లిప్యంతరణం చేసిన తర్వాత సరిదిద్ది కోర్టులో బహిరంగంగా దీన్ని ప్రకటించాను.

(సంతకం)
వై.వి. రామారావు
మొదటి అదనపు జిల్లా మునసబు

**సాక్ష్యానుబంధం.**
పరీక్షించిన సాక్షులు

**వాది తరపున:**

1. ఎ. శ్రీరాములు
2. జి.ఎస్.ప్రకాశరావు.

**ప్రతివాది తరపున:-**

ప్ర.సా. 1: – ఎస్. సి. 11/1979 లోని సిహెచ్.రాఘవులు.
ప్ర.సా 2: – గాలి చినసుబ్బారావు

**గుర్తించిన దావా పత్రాలు : వాది తరపున :**

ఎగ్జిబిట్ ఎ–1 :– ఎస్.సి. 11/1979 లోని సి.హెచ్.రాఘవులు చెప్పిన వాఙ్మూలం అధికార ప్రతి

ఎగ్జిబిట్ ఎ–2/ 6–2–1974 :– వాది పేర ప్రతివాది రాయించి ఇచ్చిన ప్రోనోటు.

ఎగ్జిబిట్ ఎ–3/6–2–1977 :– ఎగ్జిబిట్ ఎ–2 మీది నమోదు

**ప్రతివాది తరపున:-**

ఎగ్జిబిట్ బి–1 /18–2–1981 :– యస్.సి. 11/1979 లోని డిక్రీ అధికారిక ప్రతి.

ఎగ్జిబిట్ బి2/18–2–1981 :– ఎస్.సి. 11/1979 లోని తీర్పు అధికారిక ప్రతి.

(సంతకం)
వై.వి.రామారావు
14–2–1982
మొదటి అదనపు జిల్లా మునసబు

– సరైన నకలు–.

(సంతకం)
జిల్లా సెషన్స్ జడ్జి,
ప్రకాశం జిల్లా, ఒంగోలు.

# 9.

# ప్రధాన జిల్లా మునసబు కోర్టు, ఒంగోలు

ప్రధాన జిల్లా మునసబు కోర్టులో

హాజరు: శ్రీ సి. సాంబశివరావు; ఎం.ఏ., బి.యల్.
ప్రధాన జిల్లా మునసబు.

1984 మార్చి 7వ తేదీ బుధవారం

ఎస్.సి. 4/83; 137/83

రాయపనేని సుబ్బయ్య.............................................వాదికీ

కాకుమాని పెద కోటయ్య.............................................ప్రతివాదికీ

మధ్య :

వాది తరఫున వకీలు శ్రీ ఎం.పాండురంగయ్య, ప్రతివాది తరఫున వకీలు శ్రీ డబ్ల్యు.ఎల్.ప్రసాదు హాజరుకాగా పై రెండు దావాలు 21-2-1984వ తేదీన తుది విచారణ నిమిత్తం నాముందుకు వచ్చి నేటివరకు విచారణకు ఉన్నందువల్ల కోర్టు కింది ఉమ్మడి తీర్పు చెప్పింది:-

ఉమ్మడి తీర్పు

ప్రతివాది వాదినుంచి రెండు వేరువేరు ప్రోనోట్లపై అప్పు తీసుకొన్న అసలు మీద వడ్డీ బాకీ వసూలు నిమిత్తం వేసినవి ఈ రెండు దావాలు.

2. తే 27-3-77దీన రూ.3000/-లు ; తే29-5-77దీన రూ.3000/-లు ప్రతివాది అప్పు తీసుకొని దానికి సాలుసరి వడ్డీలు క్రమంగా 15 శాతం, 18 శాతంతో తిరిగి చెల్లించడానికి ఒప్పుకున్నాడు. ఆ ప్రోనోట్లు కాలదోషం పట్టబోతున్న కారణంగా 27-3-77 ప్రోనోటు మీద ప్రతివాది 22-3-80 వ తేదీన రూ.10/-లు చెల్లించాడు. అలాగే తే29-5-77దీన ప్రోనోటు మీద రూ.10/-లు 27-5-80వ తేదీన చెల్లించాడు. వాది అనేక పర్యాయములు అడిగినప్పటికీ ఇవ్వవలసిన బాకీ సొమ్ము ప్రతివాది చెల్లించలేదు. రాయపనేని వెంకటేశ్వర్లు అనే అయన వాది సోదరుని కుమారుడు, ఒ.ఎస్.200/80 డిక్లరేషన్ కోసం దావా వేశాడు. అందులో వేసిన దావా షెడ్యూలులో చూపిన ప్రోనోట్లలో

3/4 వంతు వాటాకు తాను అర్హుడనని అన్నాడు. ఆ దావాలో 5 వ ప్రతివాదిగా ఈ ప్రతివాదిని చూపించాడు. ఆప్రోనోట్ల బాపతు కింద రూ.9,635–22 లు ప్రతివాది జమచేశాడు. పై చెప్పిన దావాలో వాది చెక్ పిటిషన్ దాఖలు చేశాడు కానీ దానిమీద ఇంతవరకు ఉత్తరువులు జారీ కాలేదు. ఆ దావా ప్రోనోట్లు కాలదోషం పట్టబోతున్న కారణంగా తప్పనిసరిఅయి వడ్డీ కోసం వాది దావా వేయవలసి వచ్చింది. దావా పరిహారాలకు కాలదోషం పట్టిందన్న వాదనలతో ఇతర విషయాలతో పాటు రాతస్టేట్ మెంటును ప్రతివాది దాఖలు చేశాడు. వాటా నిమిత్తం రాయపనేని వెంకటేశ్వర్లు దావా వేశాడు. ఈ ప్రతివాది ఆ దావాలో 5వ ప్రతివాదిగా ఉన్నాడు. మొదటి ప్రోనోటు తే27–3–77ది రెండో ప్రోనోటు తేదీ 29–5–77. వాటి కింద సొమ్ము చెల్లించడాన్ని కూడా ఆయన అంగీకరించాడు. అంతేకాదు దానిపై చెల్లునమోదును కూడా అంగీకరించాడు. చట్టం 4/38 ప్రకారం అసలుతో వడ్డీని చెల్లించారు. ప్రోనోటును రద్దు చేయమని వకీలుకు నోటీసు పంపడమయింది. ప్రతివాదికి సంబంధించినంతవరకు అతని చెల్లింపు బాకీని తీర్చివేసింది. కాబట్టి అతడు ఆ మొత్తాన్ని చెల్లించనవసరంలేదు.

మెమో ఆధారంగా ఎస్.సి. 4/83 లో సాక్ష్యాన్ని రికార్డు చేశారు. వాది తరఫున సాక్షుల్ని పరీక్షించ లేదు. ప్రతివాది తరఫున ప్ర.సా. –1 ను పరీక్షించారు. వాదిపక్షాన ఎగ్జిబిట్ ఎ–1 నుంచి ఎ–6 వరకు గుర్తించడమయింది. ప్రతివాది పక్షాన ఎగ్జిబిట్ బి–1 నుంచి బి–3 వరకు గుర్తించడమయింది.

విచారణాంశం ఏమంటే :– ఒంగోలు సబ్ కోర్టులో దాఖలయిన ఒ. ఎస్. 200/80 లో కోర్టులో సొమ్ము జమ అయిన తేదీ నుంచి వడ్డీకి వాది అర్హుడా, కాదా? అతడు వాదిస్తున్నట్లు ప్రతివాది చెల్లింపు బాధ్యతను ఆ చేసినజమ రద్దు చేస్తుందా లేదా?

చాలా కాలం క్రితం రాయించి ఇచ్చినవి ఆ ప్రోనోట్లు, పాక్షిక చెల్లింపులే కానీ పూర్తి మొత్తం చెల్లించలేదు అని వాది తరఫున న్యాయవాది శ్రీ ఎం.పాండురంగారావు చెప్పారు. ఒంగోలు సబ్ కోర్టులో దాఖలు అయిన ఒ.ఎస్. 200/80 లో నిస్సందేహంగా ఈ ప్రతివాది పార్టీయే. అర్జీ దాఖలు చేసి కోర్టు నుంచి ఆదేశం తీసుకోవడమూ, దావా పూర్తి మొత్తాన్ని జమచేయడానికి వాదికి ఒక అవకాశం ఇవ్వడమూ, లేదా జమచేసిన తర్వాత అతడు ఏదైనా నోటీసు ఇవ్వడంగానీ చేయలేదు అని న్యాయవాది అన్నారు. దరిమిలా వాది ఋణదాత ఈమొత్తాన్ని జప్తుకు పెట్టాడు. అతని అనుకూలత కోసం మాత్రమే ఈ మొత్తాన్ని జమచేయడం జరిగింది. అలా వాదికి ఈమొత్తం లేకుండా చేయడమయింది. కాబట్టి అలా ఆ మొత్తం వాదికి లేకుండా చేయడం వల్లా, అలా జమ చేసిన మొత్తంమీద వాదికి లాభం తగినట్లు వృద్ధి పొందక పోవడంవల్లా వాది వడ్డీ పొందడానికి అర్హుడు. అతని వాదానికి బలంగా 1964 (2) ఆంధ్ర వీక్లీ రిపోర్టరు పుట 424లోని (పప్పు సూరమ్మకూ లేటు బొగ్గవరపు సోమన్నకూ మధ్య దావాపై అతడు ఆధార పడ్డాడు. అయితే అక్కడ సెక్షన్ 34 సి.పి.సి. గురించి ప్రస్తావించేటప్పుడు ఇలా అభిప్రాయ పడ్డాడు : – "అపీలు ఇంకా పూర్తి కానందువల్ల, డిక్రీ అమ్మలు నిలుపుదలకు ప్రతివాదులు అర్జీ దాఖలు చేశారు. వాది ఆ అర్జీని వ్యతిరేకించాడు. హామీ ఇచ్చిన పక్షంలో

తీసుకోడానికి వీలుగా డిక్రీ మొత్తాన్ని కోర్టులో జమకట్టే షరతుతో నిలుపుదల ఇవ్వవచ్చునని ప్రత్యామ్నాయాన్ని అతడు సూచించాడు. అలాగే వాది ఆ సొమ్ము జమచేసినా ఆమె హామీ ఇవ్వలేకపోవడంవల్ల సొమ్ము తీసుకోలేకపోయింది. అపీలు పూర్తి అయిన తరవాత జమచేసిన తేదీ నుంచి చివరి డిక్రీ తేదీ వరకు వడ్డీ వసూలుకు వాది కోరాడు. కింది కోర్టు చెల్లింపుకు ఉత్తరువులిచ్చినా హైకోర్టు దాన్ని త్రోసిపుచ్చింది. లెటర్ పేటెంట్ అపీలు వేయడానికి వాది సమర్పించడం జరిగింది.

"ఉన్న విషయం :– కోర్టులో సొమ్ము జమకట్టడానికి బాధ్యుడయిన వ్యక్తి, ఇంకా కోర్టులో ఆసొమ్ము అలా పడిఉండటానికి అనుమతించిన వ్యక్తి వడ్డీ రూపంలో ఆ నష్టాన్ని భరించాలి. కోర్టులోకి ఆ సొమ్ము తేవడానికి ఆ డిక్రీ పొందిన వ్యక్తే ముఖ్యంగా బాధ్యుడయితే జమచేసిన తేదీ నుంచి వడ్డీ పెరుగుదల నిలిచిపోతుంది. అలా కాకుండా తీర్పు ఋణగ్రస్తుడే స్వచ్ఛందంగా ఆసొమ్ము కోర్టులో జమచేస్తూ డిక్రీ పొందిన వ్యక్తిని హామీ ఇచ్చి తీసుకోవలసిందిగా కోరినప్పుడు డిక్రీ పొందిన వ్యక్తి అది పూర్తి చేయలేకపోతే ఆ డిక్రీలోని సొమ్ము మొత్తానికి వడ్డీ పెరుగుదల ఆగదు. ఈ వ్యాజ్యం మొదటి కోవలోకి చెందింది కావడం వల్ల జమ దరిమిలా వడ్డీ చెల్లించడానికి ప్రతివాదుల పక్షాన బాధ్యత లేదు" ఈ నియమాన్ని అనువర్తింపచేస్తూ ఓ.ఎస్.200/80లో డిక్రీ పొందిన వ్యక్తి ప్రేరణవల్ల గాక తీర్పు –ఋణగ్రస్తుడు తనకు తానై సొమ్ము జమచేశాడు. కాబట్టి డిక్రీ సొమ్ము మీద వడ్డీ పెరుగుదల ఆగదు. ఏమైనా అందులో ఆ సొమ్ము క్లెయిం చెయ్యడంలో చిక్కులు వస్తే, సముచిత విధానాన్ని అనుసరించి ఇంటర్ ప్లీడర్ దావా వేసి ఆ వివాదం కక్షిదారులు పరిష్కరించుకోవచ్చు. ఈ దావా విషయంలో ప్రతివాది అలా చెయ్యలేదు. కాబట్టి అతనికి వడ్డీ చెల్లించవలసిన బాధ్యత ఉంది.

ఈ ఆరోపణకు ప్రతివాదంచేస్తూ ప్రతివాది తరఫు న్యాయవాది సలహాదారు శ్రీ డబ్ల్యు.ఎల్ ప్రసాద్ సి.పి.సి. 88వ సెక్షన్‌ను ఉటంకిస్తూ ఎక్కడ ఇంటర్ ప్లీడర్ దావా వెయ్యాలని ఉందో ఇలా చెప్పాడు :–

"ఒకే అప్పు, సొమ్ము మొత్తం లేదా ఇతర ఆస్తి చరమైనా, స్థిరమైనా ఒకవ్యక్తి నుంచి ఇద్దరు లేదా అంతకన్న ఎక్కువ మంది పరస్పర విరుద్ధంగా క్లెయిం చేసేటప్పుడు ఖర్చులు తప్ప అందులో వడ్డీ కోరనప్పుడూ; హక్కు కలిగిన క్లెయిందారుకు మాత్రమే అతడు దాన్ని చెల్లించడానికి సిద్ధంగా ఉన్నప్పుడు ఇతర క్లెయిందారులందరి పైన ఆ వ్యక్తి ఇంటర్ ప్లీడర్ దావా వేయవచ్చు. అది ఏ వ్యక్తికి చెల్లించాలో నిర్ణయం తీసుకోడానికీ నష్టపరిహారం అతనికి తీసుకోడానికి పనికి వస్తుంది. ఏదైనా దావా ఇంకా జరుగుతున్నప్పుడూ, అందులో కక్షిదారుల హక్కులు నిర్ణయించ గలిగినప్పుడూ ఈ ఇంటర్ ప్లీడర్ దావా దాఖలు చేయగూడదు."

ఈ న్యాయ విషయం మీద ఆధారపడుతూ ఇలా చెప్పారు:– "ఒక దావా జరుగుతూ ఉంది.అందులో వేరొక కక్షిదారు తనకు అందులో వాటా రావాలంటూ వాది మీద పంపకం దావా వేశాడు. అతడు ఆ దావాలో ప్రతివాది. ఈ ప్రతివాది కూడ అందులో

ఒక కక్షిదారు. దావా నడుస్తున్న కారణంగా ఇంటర్ ప్లీడర్ దావా ఇక్కడ ఉండదు "కాబట్టి అతడు బాధ్యత విముక్తికి తగిన విధంగా మొత్తాన్ని జమ చేశాడు. ప్రతివాది సొమ్ముకు బాధ్యుడు కాదు. ఇక్కడ వడ్డీ చెల్లింపు ప్రసక్తి రాదు. కోర్టువారు వాదిని దావాపత్రంలో ఏ రకమయిన ఆధారం చూపకపోయినా కాలదోష నియమానికి మినహాయింపు కోరటానికి అనుమతించవచ్చు. అయితే ఆ ఆధారం ప్లెయింటులో అసంబద్ధంగా ఉండగూడదు" అని అందులో ఉంది.

కాబట్టి ఈ వ్యాజ్యాన్ని నిశ్చయించటంలో అది ఏవిధంగానూ సహాయపడదు. పరిధి లేకుండా కోర్టులో యథార్థమైన ప్రొసీడింగ్ కాలాన్ని చేర్చక పోవడం గురించి కాలపరిమితి చట్టంలోని 14వ సెక్షన్ మీద కూడా అతడు ఆధార పడ్డాడు. ప్రధానంగా రెండో వ్యాజ్యం ఎస్.సి. 137/1983 కోసం ఈ నిర్ణయంపై ఆధారపడి ఉంది. మొదటి వ్యాజ్యానికి తరువాయి భాగంగా ఈ రెండో వ్యాజ్యాన్ని పరిగణించడానికి వీల్లేదు. అది ఒక కొత్త వ్యాజ్యంగా కాలపరిమితిని లెక్కించాలి. సెక్షన్ 14 తలెత్తుతుందని మొరపెట్టవలసిన అవసరం లేదు. సరయిన కోర్టులో కాల వ్యవధిలోనే దావా దాఖలు చేయడమయింది. ప్లెయింటును తిప్పివేస్తూ చేసిన ఉత్తరువు న్యాయబద్ధమైనది కాదు. ప్లెయింటుని తిరిగి పుచ్చుకున్న న్యాయసలహాదారు దాన్ని తిరిగి దాఖలు చేశాడు.కాని ప్రస్తుత దావాలోని విషయానికి ఈ పరిశీలనలు వర్తించవు. ఎందుకంటే బాధ్యతను అంగీకరిస్తూ సొమ్ము మొత్తాన్ని జమ చేసినందువల్లనే వేరుకాలాలకు రెండు దావాల్లోనూ వడ్డీ బాకీ ఉన్నట్లు సొమ్మును క్లెయిం చేశారు. బాధ్యతను స్పష్టంగా అంగీకరించినప్పుడూ సొమ్మును జమ చేసినప్పుడూ కాలవ్యవధి దాటిపోయిందన్న దానికి పరిహారం అన్న ప్రశ్నే ఉత్పన్నం కాదు. తాను క్లెయిం చేసిన వడ్డీ గురించి వడ్డీ చట్టం నియమాల మీద అతడు ఆధారపడ్డాడు కూడా.

"(1) అక్కడ కొంత అప్పు లేదా సొమ్ము ఉండాలి. (2) అది కొంత కాలంలో లేదా వేరు విధంగా చెల్లించవలసి ఉండాలి. (3) ఈ అప్పులు లేదా సొమ్ములు కొంతకాలంలో చెల్లించడానికి రాత పూర్వకమైన ఒప్పందం (కాంట్రాక్టు) ఉండాలి.(4) డిమాండు తేదీనుంచి వడ్డీ వసూలుకు హక్కు ఉంటుందని రాతలో ఒక డిమాండు ఉండాలి. పై విషయాల్లో ఏ ఒక్క అంశం లేక పోతే కోర్టు అది సహేతుకమని భావించి సామాన్యంగా వడ్డీ అనుమతించ జాలదు. "దీనికోసం అతడు కింది వ్యాఖ్యానాలపై ఆధారపడ్డాడు–1955 లోని ఎస్. సి. జె. 445;. 1955లోని 2 ఎస్.సి.ఆర్.48; 1955లోని ఎస్.సి 468; 1956;. బి.ఎల్.జె.ఆర్ 759;1958 ; బి.ఎల్.జె.ఆర్. 504 ; ఐ.ఎల్.ఆర్. 37 పెటె.468 ; ఎ.ఐ.ఆర్. 1959 పెటె 39 ఎ.ఐ.ఆర్ 1963 కలకత్తా 307 ; సివిల్ కోర్ట్ మాన్యువల్ సెంట్రల్ యాక్టులు 11 వ కూర్పులో పుట 1468.

జాగ్రత్తగా పరిశీలించి విచారణ చేస్తే, ఈ దావాలో వడ్డీ చెల్లించవలసిన బాధ్యత లేదు. లేదా వడ్డీకి ఆ తేది నుంచి ఏ పార్టీ నోటీసు ఇస్తూ సొమ్ము నిలిపివేయలేదు. కానీ ప్రస్తుతం దాఖలయిన దావాలో ప్రతివాది చెల్లించవలసిన, చెల్లించని ప్రోనోటుల సంబంధించిన సొమ్ము మొత్తాలున్నాయి. ఇరుపక్షాల ఒప్పందాల ప్రకారం దానికి వడ్డీ

ఉంటుంది. కాబట్టి వడ్డీ చట్టం నియమాలు దీనికి వర్తించవు. మాన్యువల్‌లో పేర్కొన్న తీర్పులపై పరిశీలనల్లో ఆధారపడటం జరిగింది. ఆ సంగతులు వర్తించేదీ లేనిదీ చూడటానికి వీరు చిత్తగించడానికీ ఆ తీర్పులను తీసుకొని రాలేదు.

ప్రతివాది తరపు సాక్షి-1 సాక్ష్యంలోని వాస్తవాల్ని చూడటాన్ని బట్టీ, వాది ఏవిధమైన నోటి సాక్ష్యం ఎదుట పెట్టకపోవటాన్ని బట్టీ, రాయపనేని వెంకటేశ్వర్లు అనే మూడో వ్యక్తి దావావేసి తాను దత్త పుత్రుణ్ణని చెప్పుకుంటూ ఒంగోలు సబ్ కోర్టులోని ఒ.ఎస్.-200/80 లోని ఆస్తులలో వాటాకు పంపకం కోరాడు. ఆ దావాలో అతడు 5వ ప్రతివాది అని అభియోగం ఉంది. ఎగ్జిబిట్లు ఎ-1 & ఎ-2 లలో మొత్తాల్లో అతని వాటాకు అతడు క్లెయిం చేశాడు. ఎగ్జిబిట్లు ఎ-1, & ఎ-2ల కింద రావలసిన మొత్తాన్ని అతడు జమ చేశాడు. ఆ దావాల్లోనూ ఈ దావాలోను వాది తరఫున హాజరు అవుతున్న ఇద్దరు న్యాయవాదులకూ తాను చేసిన ఈ జమ గురించి నోటీసు ఇచ్చినట్లు కూడా అతడు చెప్పాడు. కాబట్టి అతడు వడ్డీ చెల్లించ నక్కరలేదు. ఆమొత్తం జమ చేయటానికి వెంకటేశ్వర్లు ఏ నోటీసు ఇవ్వలేదని అతడు అంగీకరించాడు. మొదటి వాయిదా తేదీ నాటికే అతడు ఆ మొత్తాన్ని జమ చేశాడు. ఒ.ఎస్. 347/82 లో మొత్తాన్ని అతని కొడుకు జప్తు చేయడం వల్ల ఆ మొత్తాల్ని తీసుకోవటం జరగలేదు. కాబట్టి ఆ మొత్తం స్వచ్ఛందంగా ఆపార్టీ జమ చేశాడు అన్నది స్పష్టం. కోర్టులోకి ఆ సొమ్ము తీసుకురావడానికి ఏవిధంగానూ వాది బాధ్యుడు కాదు. ప్రతివాదే స్వయంగా ఆ సొమ్మును జమ చేశాడు. సొమ్ము జమచేసినట్లు అతడు నోటీసు ఇచ్చాడు. సందేహం లేదు. కానీ ప్రతివాది కొడుకే దావా వేసి దాన్ని జప్తు చెయ్యడంవల్ల ఆ సొమ్మును తీసుకోడానికి ఆచరణలో వీలు కాలేదు. అందువల్ల ఆ రకంగా ఆ సొమ్ము తీసుకోడానికి అసాధ్యం చేశారు. ఈపరిస్థితుల్లో ఇంటర్ ప్లీడర్ దావా నిస్సందేహంగా వెయ్యనక్కరలేదు. ఆ మొత్తాన్ని జమ చేయడానికి అర్జీ దాఖలు చేశారా, లేదా? ఇంకా ఒంగోలు సబ్‌కోర్టులోని ఒ.ఎస్. 200/80 లో ఇరుపక్షాల్ని విన్న తరవాతనే సొమ్ము జమ చెయ్యడానికి ఉత్తరువు ఇచ్చారా అన్నది స్పష్టంగా లేదు. రికార్డు మీద ఉన్న వాస్తవాలనుంచి స్పష్టంగా ఆ సొమ్ము స్వచ్ఛందంగా జమ చేసినట్లూ, జమ చేసిన తర్వాత నోటీసు ఇచ్చినట్లు తెలుస్తూ ఉంది. కాబట్టి వాది ప్రేరణవల్ల ఈ దావాలో సొమ్ము కోర్టు వారు జమ చేయలేదు. అతడు స్వచ్ఛందంగా ఆ సొమ్ము జమ చేసి, తీసుకోడానికి వీలులేని పరిస్థితి కల్పించాడు కాబట్టి, ఆంధ్రా వీక్లీ రిపోర్టరు 1984(2) తీర్పు నివేదికలోని వాస్తవాలు పరిశీలనలో ప్రస్తుత దావా వాస్తవాలకు వర్తిస్తాయి. ఆ పరిశీలనలు ఈకోర్టుకు వర్తిస్తాయి. కాబట్టి వాది ప్రార్థించినట్లు దరిమిలా సాలుసరి 6 శాతం వడ్డీతోనూ రెండు దావాలూ ఖర్చులతోనూ డిక్రీ ఇవ్వాలి.

పర్యవసానంగా, రెండుదావాలు ఎస్.సి.4/83, ఎస్.సి.137/83 వాది ప్రార్థించినట్లే సాలుసరి 6 శాతం దరిమిలా వడ్డీతోనూ, ఖర్చులతోనూ డిక్రీ ఇవ్వడమయింది.

సంక్షిప్త లేఖకునికి చెప్పి, అతడు లిప్యంతరణం చేసిన తరవాత నేను సరిదిద్ది బహిరంగంగా కోర్టులో 1984వ సం.రం. మార్చి 7వ తేదీన వెల్లడించాను.

(సంతకం)
సి. సాంబశివరావు
ప్రధాన జిల్లా మునసబు, ఒంగోలు.

సాక్ష్యాను బంధం.
పరీక్షించిన సాక్షులు

**వాది తరపున :**

ఎవరూ లేరు.

**ప్రతివాది తరపున :**

కాకమాని పెదకోటయ్య.

**వాది తరపున ఎగ్జిబిట్లు:-**

ఎగ్జిబిట్ ఎ–1/27–3–77 :– ప్రతివాది వాది పేరున రాయిచ్చిన రూ.3,000/–లు ప్రోనోటు.

ఎగ్జిబిట్ ఎ–2 /29–5–77 :– రూ.3,000/–లకు వాది పేర ప్రతివాదికి ఇచ్చిన ప్రోనోటు.

ఎగ్జిబిట్ ఎ–3/22–3–80. రూ.10/లకు ఎగ్జిబిట్ ఎ–1 మీద పాక్షిక చెల్లింపుకు నమోదు

ఎగ్జిబిట్ ఎ–4/27–5–80. రూ.10/లకు మీద పాక్షిక చెల్లింపుకు ఎగ్జిబిట్ ఎ–3 మీద నమోదు

ఎగ్జిబిట్ ఎ–5/ – ఒంగోలు జిల్లా మునసబు కోర్టులో ఓ.యస్. 347/82 లో దాఖలు చేసిన ప్లెయింటు నకలు

ఎగ్జిబిట్ ఎ–6/ – ఒంగోలు జిల్లా మునసబు కోర్టులో ఓ.యస్. 347/82 లో దాఖలు చేసిన ఐ.ఎ. 2481/82 లోని అర్జీ నకలు

ప్రతివాది తరపున ఎగ్జిబిట్లు :-

ఎగ్జిబిట్: బి-1/18-6-82 వాది న్యాయవాదులకు పంపిన లాయరు నోటీసు.

ఎగ్జిబిట్ బి-2/19-6-82 : - వాది నుంచి వచ్చిన తపాలా తిరుగు రసీదు.

ఎగ్జిబిట్ బి-3/29-7-80 ఒంగోలు సబ్ కోర్టులో ఓ.ఎస్-200/80 లో దాఖలు చేసిన ప్లెయింటు తాలూకు అధికారిక నకలు

(సంతకం)
సి. సాంబశివరావు
ప్రధాన జిల్లా మునసబు.

- సరైన నకలు-

(సంతకం)
జిల్లా & సెషన్స్ న్యాయమూర్తి
ప్రకాశం జిల్లా, ఒంగోలు.

# 10.

# జిల్లా మునసబు కోర్టు, మాడుగుల

## జిల్లా మునసబు కోర్టులో

**హాజరు:** శ్రీ ఎన్. సూర్యనారాయణరావు, బి.ఏ., ఎల్.ఎల్.బి.,
జిల్లా మునసబు

1985 సం.రం. ఫిబ్రవరి 21వ తేదీ గురువారం.
ఎస్.సి.1/83(ఎస్.సి.45/82 చోడవరం ఎ.డి.ఎమ్.సి)

మందల సత్యవతి.......................................................వాదికీ

(1) బొడ్డేటి సూర్యనారాయణ

(2) బొడ్డేటి అప్పలనాయుడు.......................................ప్రతివాదులకూ

మధ్య :

వాది తరఫున న్యాయవాది శ్రీ బి.వి.రమణ, మొదటి ప్రతివాది తరఫున న్యాయవాది శ్రీ ఎన్.ఎస్.ఆర్.జి.కృష్ణారావు, రెండో ప్రతివాది తరఫున న్యాయవాది శ్రీ జి.సింహాద్రి రాజు హాజరుకాగా 21–2–1985వ తేదీన ఈ దావా తుది విచారణకు నా ముందుకు వచ్చి ఉన్నందువల్ల, కోర్టు ఈ కింది విధంగా తీర్పు చెప్పింది.

## తీర్పు

(1) తే 29–7–75దీన ప్రతివాదులు వారి వ్యవసాయ ఖర్చుల నిమిత్తం వాది నుంచి రూ.850/–లు అప్పు తీసుకొని ఆ సొమ్మును సాలుసరి 24 శాతం వడ్డీతో తిరిగి చెల్లించడానికి ఒప్పుకొని ప్రోనోటు వాది పేర రాయించి ఇచ్చారు.

దరిమిలా రెండో ప్రతివాది తరఫున అతని అనుమతితో ఏజంటుగానూ మొదటి ప్రతివాది తన తరఫున రూ.500/–లు వాదికి చెల్లించి దావా ప్రోనోటు వెనక పుటన దానికి చెల్లు రాయించాడు. మళ్ళీ తే29–4–77 దీన రూ.200/–లున్నూ తే 7–7–79దీన రూ.100/–లున్నూ మొదటి ప్రతివాది తన తరఫునా, రెండో ప్రతివాది ఏజంటుగానూ చెల్లించి ప్రోనోటు వెనక పుటన తే 5–8–79 దీన చెల్లు రాయించాడు. ప్రోనోటు బాపతు

మిగతా బాకీ అడిగినా ప్రతివాదులు వాయిదా వేస్తూ వచ్చారు. కాబట్టి ప్రతివాదులకు దావా బాకీ తీర్చవలసిన బాధ్యత ఉంది. చట్టం 4/38 సదుపాయాలు ప్రతివాదులకు వర్తించడంవల్ల ఆచట్టం సదుపాయాలమేరకు వడ్డీ క్లైయిమ్ చెయ్యడమయింది.

ప్రతివాదులు చిన్నరైతులు కానందువల్ల వాదికి దావా బాకీ వసూలు చేసుకునే హక్కు ఉంది. కాబట్టి ఈ దావా దాఖలు చెయ్యడమయింది.

దావా ప్రోనోటు తేదీ 29–7–75న దావా చర్యకు కారణమయింది. రూ.500/–లు తేదీ 5–8–79 ; చెల్లించిన రూ.200/–ల చెల్లున్నూ తేదీ 29–4–77; తేదీ 7–7–79 చెల్లించిన రూ.100/–లు చెల్లున్నూ మాడుగుల కోర్టు పరిధిలోకి వచ్చింది. పైన పేర్కొన్న చెల్లులు, దావా ప్రోనోటు కాలదోషం పట్టకుండా చేశాయి.

కోర్టు ఫీజు, పరిధి వగైరాల కోసం దావా విలువ రూ.228–59లు ఎ.పి.సి.ఎస్. చట్టం షెడ్యూలు 1 క్లాజు(ఎ) కిందా ; సెక్షన్ 20 క్లాజు 'ఎ' కిందా కోర్టు ఫీజు రూ.18–40లు చెల్లించడమయింది.

కాబట్టి రూ.228–59 లుకు దరిమిలా వడ్డీతోనూ ఖర్చులతోనూ దావా డిక్రీ ఇవ్వవలసినదిగా వాది ప్రార్థన.

(2) మొదటి ప్రతివాది తన లిఖిత స్టేటుమెంటు కింది విధంగా నొక్కి చెప్పారు :–

దావాపత్రం ఆరోపణలన్నీ నిజాలుకావు, చెల్లేవికావు, ప్రతివాదిని బద్ధుణ్ణి చేసేవి కావు. స్పష్టంగా నిరాకరించకుండా ఉన్న ఆరోపణలను ఈ ప్రతివాది అంగీకరించినట్లుగా భావించకూడదు ; అంతే కాకుండా వ్యవసాయ ఖర్చుల నిమిత్తం ప్రతివాదులు వాది దగ్గరినుంచి రూ.850/–లు అప్పుతీసుకొని దావా ప్రోనోటు రాసి ఇచ్చినట్లూ ప్రతివాదులు సన్నకారు రైతులు కానట్లూ దావా పత్రంలో వేసిన ఆరోపణలు నిజాలు కావు, సమర్థించదగినవీ కావు, చెల్లేవీకావు. అవి ఈ దావా కోసం సృష్టించినవి.

ఈ వాదికీ ప్రతివాదికీ మధ్య ఎన్నడూ ఏ లావాదేవీలు జరగలేదు. ప్రతివాదులు దావా ప్రోనోటు సొమ్మును వాది భర్త దగ్గరినుంచి అప్పుగా తీసుకొన్నారు. వారికి దావా ప్రోనోటుతో ప్రమేయం లేదు. శాసనరీత్యా, ప్రతివాదుల మీద దావా వెయ్యడానికి హక్కులేదు. అందుచేత ఈ దావా కొట్టివేయదగినది. దావా దాఖలు చేసేముందు వాది దావా సొమ్మును ఇమ్మని అడుగుతూ ప్రతివాదులకు నోటీసు ఏదీ ఇవ్వలేదు.

దావాప్రోనోటుకు వెనకవైపున, రెండో ప్రతివాది ఏ చెల్లింపునూ రాసి ఉండలేదు. చెల్లింపు పీటీరాతను వాది సృష్టించి ఉండవచ్చు. దావా ప్రోనోటుమీద సూచించిన చెల్లింపులకు అదనంగా ఈప్రతివాది 1980 జనవరిలో వాది కుమారుడయిన శివబాబుకు, వాది భర్త సమక్షంలో రూ.100/– చెల్లించాడు. దావా క్లైయిమ్‌లోనుంచి సదరు మొత్తాన్ని కూడా మినహాయించవలసి ఉంది. దావా ప్రోనోటు వెనక పీటీని ఉన్న చెల్లింపురాతలు

ప్రతివాదులిద్దరు రాసినవికావు. కాబట్టి ఈ దావా బాకీకి కాలదోషం పట్టినది. ఆ పీటీ రాతలు శాసనరీత్యా చెల్లవు. అందుచేత రెండో ప్రతివాది మీద దావా వెయ్యడానికి వాదికి హక్కు లేదు.

ఈ ప్రతివాదులు సన్నకారు రైతులు 77 నాటి 7వ చట్టంలోని నిబంధనల ప్రకారం ఈ దావా అప్పు తీరిపోయినట్లుగా భావించాలి. ఆ యధార్థాన్ని వాది ఎరిగి ఉండి, ప్రతివాదులకు నష్టం కలిగించాలని తాను శాసనవిరుద్ధంగా లాభం పొందాలనీ, కావాలని ఈ దావా వేసింది. అందువల్ల ఈ దావా కొట్టివేయడానికి తగినది కాబట్టి ప్రతివాదులు ఈ దావాను ఖర్చులతో కొట్టి వేయవలసిందిగా ప్రార్థిస్తున్నారు.

3. మొదటి ప్రతివాది తాలూకు లిఖితపూర్వకమయిన స్టేట్ మెంటును రెండో ప్రతివాది తన మెమో 23–6–83 తేదీవల్ల అనుసరిస్తున్నాడు.

4. తే 1–10–83 దీన ఈ కోర్టు ప్రారంభించడంతో ఈ దావా ఈకోర్టుకు బదిలీ అయింది. దీనికి రిజిస్టరులో ఎస్.సి.1/83 సంఖ్య ఇవ్వడమయింది.

5. వాది తరపు సాక్షులు 1 & 2 లను పరీక్షించడం జరిగింది. వాది తరపున ఎగ్జిబిట్లు ఎ–1 నుంచి ఎ–3 వరకు గుర్తించడమయింది. ప్రతివాది తరఫు సాక్షులను 1 నుంచి 3 వరకు పరీక్షించడం జరిగింది. X.1 X.6 వరకు గుర్తించడమయింది.

6. దావాలో పరిశీలించడానికి ఈ కింది అంశాలు ఉన్నాయి:–(1) దావాప్రోనోటు మీద సంబంధిత ప్రతివాది తన తరఫునా, తన ఏజెంటూ, మరోవాగ్దానకర్త తరఫునా చెల్లింపు నమోదు చేశాడా, లేదా? అవి రుజువయితే దావా సకాలంలో వేశారా?

(2) ప్రతివాదులు సన్నకారురైతులా ? అలా అయితే దావాదాఖలు చేసిన తేదీనాటికి దావా బాకీ మిగిలి ఉందా?

అంశం 1 :– వా.సా. – 1 వాది భర్త. అతడు తన ముఖ్య పరీక్షలో రెండో ప్రతివాది రూ.500/–లు 1976లో చెల్లించాడనీ, దాన్ని ఎగ్జిబిట్ ఎ–1 మీద చెల్లు రాయించాడనీ చెప్పాడు. అంతే కాకుండా మొదటి ప్రతివాదికి తీరికలేని కారణంగా రెండో ప్రతివాది ద్వారా 1977, 1979ల్లో క్రమంగా రూ.100/–లు '; రూ.200/—లు ఎగ్జిబిట్ ఎ–1 కింద బాకీ ఉన్న మొత్తానికి మింజుమల్ చెల్లించి ఆ చెల్లింపులకు ఎగ్జిబిట్ ఎ–3 పై నమోదు చేయించుకున్నాడు అని కూడా వాది భర్త చెప్పాడు. ఎగ్జిబిట్ ఎ–2 సాక్షి ధ్రువీకరణదారు, వా.సా.–2 తన ముఖ్య పరీక్షలో ఆ ఎగ్జిబిట్ ఎ–2 కింద రెండో ప్రతివాది వాదికి ఎంత సొమ్ము చెల్లించిందీ తాను చెప్పలేనని వాఙ్మూలం ఇచ్చాడు. వా.సా–1, 2లు వాళ్ళ క్రాస్‌పరీక్ష సాక్ష్యంలో ఎగ్జిబిట్ ఎ–2 తేదీ సమయం చెప్పలేకపోయారు. అంతేకాదు వా.సా.–2 క్రాస్‌పరీక్ష సాక్ష్యంలో ఇలా చెప్పాడు." తనసమక్షంలో వా.సా.–1 రెండో ప్రతివాదిని దేని గురించీ అడగలేదనీ, ఎగ్జిబిట్ ఎ–2 నమోదు ఎవరు రాసిందీ తనకు జ్ఞాపకం లేదనీ." కాబట్టి వా.సాలు–1,2 సాక్ష్యం ఎగ్జిబిట్

ఎ-2 మీద చెల్లింపు నిజాయితీ గురించి శంకించడానికి అతీతమయింది కాదు". ఇంకా రూ.200/-లు ; రూ.100/-లు వేరు వేరు తేదీల్లో చెల్లించిన మొత్తాలకు ఎగ్జిబిట్ ఎ-3 అసలు తేదీకి ముందే ఎగ్జిబిట్ ఎ-3 బాపతు నమోదు ఉంది. వా.సా.-1 సాక్ష్యంలో తాను ఎగ్జిబిట్ ఎ-3 మీద రాయించలేదనీ, మొదటి ప్రతివాది తన తరఫున, రెండో ప్రతివాది (తన తమ్ముడు) తరఫున ఆ సొమ్ము చెల్లించాడనీ ఉంది. ఎగ్జిబిట్ ఎ-3 వెనుక తేదీతో పుచ్చుకోడమూ, ఎగ్జిబిట్ ఎ-2 దొంగ దస్తావేజు అనే సూచననూ అతడు కాదన్నాడు. అవతలి పక్షం వారు కోరితే సంబంధిత ఖాతాలను దాఖలు చేయడానికి తనకు అభ్యంతరం లేదని తన క్రాసుపరీక్షలో అతడు చెప్పాడు. కానీ దావా క్లెయిమ్‌ను రుజువు చేయవలసిన బాధ్యత తనపై ఉంది. దావా వ్యవహారాలకు సంబంధించిన ఖాతాలను అతడు దాఖలు చేయలేదు. కాబట్టి వా.సాలు.-1,2 ఎగ్జిబిట్ ఎ-3 మీది నమోదు గురించిన సాక్ష్యం సందేహానికి అతీతమయింది కాదు. ప్ర.సా.-2 ఈదావాలో మొదటి ప్రతివాది. అతడు ఎగ్జిబిట్ ఎ-1 అమలు ఒప్పుకున్నాడు. అంతేకాదు దానితో పాటు ఒకసారి రూ. 500/-లు మరోసారి రూ.200/-లు ఇంకోసారి రూ.100/-లు మళ్ళీ మరోసారి రూ.100/-లు చెల్లించడాన్నికూడా ఒప్పుకున్నాడు. చివరిసారి తాము వాదికుమారుడు శివబాబుకు రూ.100/-లు చెల్లించినా దావా ఖాతాలో జమపడలేదు అని ముఖ్య పరీక్షలో అతడు వాఙ్మూలం ఇచ్చాడు. ఎగ్జిబిట్ ఎ-2 నమోదు అతని సోదరుడు చేయలేదనీ, ఎగ్జిబిట్ ఎ-3 కింద అతని తమ్ముడు (డి.2) తరఫున కూడా చెల్లింపు చేసినట్లు, చేసిన సూచనను అతడు కాదన్నాడు అని ముఖ్య పరీక్షలో అతడు వాఙ్మూలం ఇచ్చాడు.

7) వాది న్యాయవాది ఇలా వాదిస్తున్నారు :- వా.సా. -2 వాదిభర్తను ఎగ్జిబిట్ -2 నమోదు సాక్షి ధ్రువీకరణదారుల్లో ఒకర్ని పరీక్షించటం జరిగింది. ప్రతివాది ఏ నమోదు రాయలేదన్న విషయం కాదన్నది లిఖితపూర్వకమైన స్టేట్‌మెంటులో ఎక్కడా లేదన్నారు. కాబట్టి దాన్ని వాళ్ళు ఒప్పుకున్నట్లు రుజువు చేయవలసిన అగత్యం వాదికి లేదు. వా.సా.లు-1,2 నమోదు మేరకు వాఙ్మూలం ఇచ్చారు. ఈదావాల కాలపరిమితి దాటిందనేది ప్రతివాదుల ముఖ్యోద్దేశం. జాగానివారి భూములను ప్రతివాదులిద్దరూ కలసి వ్యవసాయం చేస్తూ, కలసి సంయుక్తంగా అప్పులపాలై, కలిసి వారు తీరుస్తున్నారని వాళ్ళ సాక్ష్యంలో ఉంది. ఆ ఇద్దరు ప్రతివాదులూ ఎగ్జిబిట్ ఎ-3 నమోదు చేశారన్నది సందేహాస్పదం దేవ్ శంకర్ డోలిస్, వాది - వి.ఎమ్.హెచ్. ఫెర్నాండెజ్, మరొకరు - ప్రతివాదులు (ఎ.ఐ.ఆర్ 1964 మద్రాసు)దావా లోని (పుట 238) తీర్పు (నిర్ణయం) మీద వాది తాలూకు న్యాయవాది తన వాదానికి బలంగా ఉండటానికి ఆధారపడ్డాడు. అందులో ఇలా ఉంది:- ఇద్దరు వాగ్దానకర్తలు రాసిన ప్రోనోటు పై పాక్షిక చెల్లింపు నమోదు అందులో ఏ ఒక్కడో రాసినప్పటికీ రెండో వాని తరఫునకూడా చెల్లించినట్లే భావించాలి. అలాంటి సందర్భంలో ఆ వాగ్దానకర్తలు పరస్పరం పుచ్చుకోడానికీ, కట్టుబడటానికీ అధికారం ఇచ్చుకొన్నట్లు కోర్టు అనుమానించవచ్చు. అంతేకాకుండా న్యాయవాది (1981 మద్రాసు పుట 338) ఎల్.ఎమ్.ఎల్.లో వచ్చిన లక్ష్మణ్ చెట్టియార్, అప్పీలుదారు వెర్సెస్ వి.ఎ.ఆర్. అలగప్ప చెట్టియార్, మరికొందరు - ప్రతివాదుల దావాలోని నిర్ణయం మీద కూడా ఆధారపడ్డారు.

అందులో ఇలా ఉంది:– హక్కు లేదా ఆస్తి కోసం అర్జీకి లేదా ఆస్తి కోసం అర్జీకి లేదా దావాకు నిర్ణయించిన కాలపరిమితి ముగియడానికి ముందు చెల్లింపు ఒప్పుకొనే విషయాన్ని లిమిటేషన్ చట్టం సెక్షన్ 18 చర్చిస్తుంది. నిర్ణీత గడువు ముగియడానికి ముందు వ్యక్తులు వీలునామా ఆస్తి తయారు చేసి, బాకీ లేదా వీలునామా ఆస్తి లేదా తమ ఏజంటు ద్వారా ఆ వ్యక్తులు చెల్లించడానికి బాధ్యత వహించి, దానికిగాను సక్రమంగా అధికారం ఇచ్చి, చెల్లింపు చేసిన నాటి నుంచి కొత్త కాలపరిమితి పరిగణించాలని వీలునామా ఆస్తి పైని బాకీలేదా వడ్డీ ఖాతా మీద చెల్లింపు గురించి సెక్షన్ 19 చెబుతుంది. అందువల్ల సెక్షన్ 18 కింద బాధ్యతను ఒప్పుకోడం ఉండాలి. చెల్లింపు నమోదు సెక్షన్ 19 కింద బాధ్యతను ఒప్పుకోడం ఇందులో ఇమిడి ఉండవలసిన అవసరం లేదు. నమోదు సాక్ష్యంవల్ల చెల్లింపు వాస్తవం మాత్రమే కాలపరిమితిని (గడువును) పొడిగించ గలుగుతుంది. రూ.200/–లు 29–4–77 తేదీన, రూ.100/–లు 7–7–79 తేదీన చేసిన రెండు చెల్లింపులు రూ.300/–లు ఏకీకరణ మొత్తానికి ఎగ్జిబిట్ ఎ–3 నమోదు కాబట్టి పై రెండు తీర్పులు ఆధారంగా దావా గడువులోనే వేసినట్లు అతడు వాదిస్తున్నాడు. ఎగ్జిబిట్ ఎ–2 నమోదు మీద సంతకం చెయ్యలేదన్న ప్ర.సా.–2 సాక్ష్యం మీద ఆధారపడిన్నీ; ఎగ్జిబిట్ ఎ–2 కింద పాక్షికమయిన చెల్లింపు మొత్తం, ఎప్పుడు, ఏ రుతువులో, ఏకాలంలో చేసిందీ జ్ఞాపకం లేదన్న దాని మీద ఆధారపడిన్నీ వాది న్యాయవాది వాదాన్ని ప్రతివాదుల న్యాయవాది తిరస్కరించాడు.పి.డబ్ల్యు –2 తన సమక్షంలో ఎగ్జిబిట్ ఎ—2 లో ఉన్న రావాలసిన మొత్తం ఎంతో అతడు చెప్ప లేదనీ, ఎగ్జిబిట్ ఎ–2 పై ఏ కలంతో అతడు సాక్ష్యం ధ్రువీకరించాడో చెప్పలేదనీ, ఎగ్జిబిట్ ఎ–2 నమోదు ఎవరు రాసిందీ జ్ఞాపకం లేదనీ, వా.సా–1 భార్య అక్కడ అప్పుడు హాజరు లేరనీ, ఎగ్జిబిట్ ఎ–2 లో ఎక్కడామొదటి ప్రతివాది తరపున అది చెల్లించినట్లు చెప్పి ఉండలేదనీ 5–8–79వ తేదీన ఎగ్జిబిట్ ఎ–3ని అమలుపరచినప్పటికీ ఆ బాకీ గడువు చెల్లిపోయిందనీ, వాది ఖాతాలు లిమిటేషన్ చట్టం సెక్షన్ 20 కింద తన వాదానికి బలంగా వాది దాఖలు చేయలేదనీ, మొదటి ప్రతివాది తరపున కూడా పాక్షిక చెల్లింపులు చెయ్యడానికి రెండో ప్రతివాదికి అధికారం ఇచ్చినట్లు చూపడానికి సాక్ష్యంలేదనీ వాదిస్తూ, కాబట్టి ఆ దావాకు కాలం గడువు చెల్లిపోయిందని అన్నాడు. ఎగ్జిబిట్ ఎ–3 నమోదు సాక్ష్యధ్రువీకరణదారు పరీక్షించలేదు. ఈ సందర్భంలో రత్నలాల్, మరొకరూ అపీలుదార్ల ది కమర్షియల్ అండ్ ఇండస్ట్రియల్ బ్యాంకు లిమిటెడ్ మేనేజరు, విశ్వనాథరావు ది లుర్సీకర్ మరికొందరు ప్రతివాదులకూ (1965 (1) A.N.W.R. 222) మధ్య జరిగిన దావా తీర్పు మీద ప్రతివాదుల న్యాయవాది ఆధారపడుతున్నారు. ప్రతివాదులు దాఖలు చేసిన ప్రోనోటు దావాలో డిక్రీ మీద అపీలు ఇది. అనేక కారణాలతో ప్రతివాదులు ఈ దావాను ప్రతిఘటించారు. అందులో కాలపరిమితి దావాకు చెల్లిపోయిందనేది కూడా చేరి ఉంది. కొందరికి బదులుగా మొదటి ప్రతివాది చెల్లించిన చెల్లింపూ, బాధ్యత ఒప్పుకోవడమూ చేసినప్పటికీ మిగతా వాళ్ళందరికీ విరుద్ధమై కాలం గడువును రక్షించలేక పోయింది. ఆ నిర్ణయంలో ఇలా ఉంది:– లిమిటేషన్ చట్టం సెక్షన్ 21(2) నుంచి ఇది స్పష్టం. అనేక సంయుక్త కాంట్రాక్టర్లలో ఒకడు; ప్రస్తుత దావాలో మొదటి ప్రతివాదివలె బాకీని బలికించ

జాలదు. మిగిలిన సంయుక్త బాకీదార్లకు ప్రతిగా బాకీని బ్రతికి ఉండేటట్లు చేయలేదు. ఎందుకంటే లిఖితపూర్వకమయిన ఒప్పుకోలుపై సంతకం చెయ్యడం లేదా అతడే స్వయంగా చెల్లింపు చెయ్యడం వల్ల మాత్రమే ఇది సాధ్యం. ఇంకా వాది రుజువు చెయ్యడానికి ఏం కావాలంటే మిగతా ప్రతివాదులకు మొదటి ప్రతివాది ఏజెంటుగా అధికారం సక్రమంగా పొందాడనీ బాధ్యతను ఒప్పుకోవడానికి లేదా బాకీ ఖాతామీద చెల్లించడానికీ, చెల్లింపును ఒప్పుకొని రాతపూర్వకంగా సంతకంచేసి ఇవ్వాలి. రెండో ప్రతివాది రికార్డుల్లో ఎక్కడా మొదటి ప్రతివాదిని తనకు బదులుగా తన ఏజెంటుగా నియమం 3 కింద చెల్లించడానికి అధికారం ఇచ్చినట్లు సాక్ష్యం చూపించలేదు. కాబట్టి దావాకు గడువు చెల్లిపోయిందని ప్రతివాదుల న్యాయవాది వాదిస్తున్నాడు. నిస్సందేహంగా న్యాయవాది ఆధారపడ్డ తీర్పు మేరకు ఒకరు ఇంకొకరికి ఏజంటుగా వ్యవహరించ వలసినప్పుడు తప్పకుండా అధికార పత్రం ఉండవలసిందే. కానీ ప్రతివాదుల న్యాయవాది ఆధారపడిన దావా తీర్పు అక్కడ ప్రతివాదులు సంయుక్త కాంట్రాక్టర్లు, కానీ ప్రస్తుత దావాలో ప్రతివాదులు అన్నదమ్ములు. కాబట్టి నా అభిప్రాయంలో ప్రతివాదుల న్యాయవాది ఆధారపడిన నిర్ణయం ప్రస్తుత దావా వాస్తవాలకు వర్తించదు. కాని 29–4–77, 7–7–79 రెండు ముందు చెల్లింపులకూ ఎగ్జిబిట్ ఎ–3 అని భావించడానికి ఆశ్చర్యంగా ఉంది. వాస్తవానికి ఎగ్జిబిట్ ఎ–3ని తే5–7–79 దీన రాశారు. ఎగ్జిబిట్ ఎ–3లో పేర్కొన్న చెల్లింపులే నిజమయితే, ఎగ్జిబిట్ ఎ–1 కింద ఆ తేదీలకు నమోదులు ఎందుకు తీసుకోలేదో వివరణలేదు. దానికి బదులుగా ఎగ్జిబిట్ ఎ–3 తేదీ 5–8–79అయి ఉంటుంది. మొదటి ప్రతివాది తన తరఫునా, తన సోదరుడే అయినందువల్ల రెండో ప్రతివాది తరఫున ఆ మొత్తాలు తానే చెల్లించానని మొదటి ప్రతివాది చెప్పిన వాస్తవం గురించి మాట్లాడటానికి ఎగ్జిబిట్ ఎ–3 ధ్రువీకరణదారును కూడా పరీక్షించలేదు. పై సంగతుల దృష్ట్యా ఎగ్జిబిట్ ఎ–2, ఎగ్జిబిట్ ఎ–3 నమోదులు రెండూ (గడువు) కాలపరిమితిని రక్షించడానికి మాత్రమే సృష్టించినట్లు నమ్మవలసి వస్తుంది. ఎలాగయితేనేం ప్ర.సా.–1 సాక్ష్యంలో రూ.100/–లు వాది కుమారుడైన శివబాబుకు వారుచేసిన చివరి చెల్లింపు ప్రస్తుత దావా ఖాతాలో జమకట్ట లేదన్నారు. దావా ప్రోనోటు మీద చెల్లు నమోదు రాయించుకోకుండానే బాకీ కింద ప్రతివాదులు చెల్లించే అలవాటు ఉన్నట్లు ప్రతివాదుల ఈ అభిప్రాయాన్ని బలపరుస్తుంది. వాస్తవాల దృష్ట్యా ఎగ్జిబిట్ ఎ–2, ఎ–3 లలో పేర్కొన్న చెల్లింపుల్ని మనం సందేహించజాలం. కాబట్టి ఈ మొదటి అంశం వాదికి అనుకూలంగాను ప్రతివాదులకు వ్యతిరేకంగాను ఉంది.

అంశం. 2 : – వా.సా–1 రెవిన్యూ ఇన్‌స్పెక్టరు, మాదుగుల ఫిర్కా సాక్ష్యం ప్రకారం ప్రతివాదికి సంయుక్తంగా 3 ఎకరాల 40సెంట్లు పల్లం భూమిన్నీ, 2 ఎకరాల 50 సెంట్లు మెట్ట భూమిన్నీ తప్ప మరే ఇతర భూములు లేవు. ప్రతివాదుల కుటుంబసభ్యుల గురించి అతనికి తెలీదు. రెండో ప్రతివాది ప్ర.సా.–3 సాక్ష్యంలో ఇలా ఉంది:– ఎ.1–20 సెంట్లు పల్లంభూమిన్నీ, ఎ.1–30 సెంట్లు మెరక భూమిన్నీ అతని వాటాకు వచ్చింది. అతనికి ఇద్దరు కొడుకులు. అతడు $1\frac{1}{2}$ ఎకరాలు పల్లం భూమిన్నీ 1/2 ఎకరం మెరక భూమిన్నీ "జాగాని" వారిది కౌలుకు తనవాటాకు దున్నుతున్నాడు. ఎగ్జిబిట్ ఎ–1 కింద తమ అవసరాల కోసం వాళ్ళు కలిసి అప్పుతెచ్చారు అని చెప్పగా వా.సా–. 1

తన సాక్ష్యంలో ప్రతివాదులొక్కరూ తమవాటాకు నాలుగు ఎకరాల కంటె ఎక్కువ దున్నుతున్నారని క్రాసుపరీక్షలో చెప్పాడు. అతని ఉద్దేశంలో ప్రతివాదులు ప్రతి ఒక్కరూ నాలుగు ఎకరాల కంటె ఎక్కువ సాగు చేస్తున్నారని వాది నివేదించాడు. ప్ర.సా.–2 తనకు ఎ. 1–25 సెంట్లు పల్లం భూమిన్నీ, ఎ. 1–25 సెంట్లు మెరక భూమిన్నీ ఉందనీ, జాగాని లక్ష్మణరావుగారి మరో ఎకరం పల్లం భూమినీ 1/2 ఎకరం మెరక భూమిన్నీ కౌలుకు సాగుచేస్తునట్లు తన సాక్ష్యంలో చెప్పాడు. అతనికొక కొడుకున్నాడనీ వాళ్ళిద్దరూ ఉమ్మడిగా జీవిస్తున్నామన్నాడు. ప్ర.సా.–3 సాక్ష్యం ప్రకారం అతనికి ఇద్దరు కొడుకులున్నారు. ఎ. 1–20 సెంట్లు పల్లం, ఎ. 1–30 సెంట్లు మెరక పొలము అతని వాటాకు ఉంది. అతని వాటాకు జాగానివారి భూమి $1\frac{1}{2}$ ఎకరాలు పల్లమూ 1/2 ఎకరం మెరక భూమి సాగు చేస్తున్నాడు. వాళ్ళు పేర్కొన్న దాని కంటె ఎక్కువ భూపరిమితి ఉన్నట్లు సాక్ష్యానికి విరుద్ధంగా చూపడానికి ఏమీ లేదు. ప్రతివాదుల ఆస్తులు పూర్వీకులవనిగానీ, ఉమ్మడివనిగానీ ఎక్కడాలేవు. ఆ రుజువు లేనంతమాత్రాన ప్రతివాదుల కొడుకుకు అందులో వాటా లేదనలేం అని ప్రతివాదుల గౌరవనీయ న్యాయవాది వాదిస్తున్నాడు. దానితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ప్రతివాదులు సన్నకారు రైతులనిన్నీ వారు 1977లోని 7 చట్టం సదుపాయాల పరిధిలోకి వస్తారని నేను భావిస్తున్నాను. కాబట్టి 1977 చట్టం 7 సదుపాయాల ద్వారా దావా బాకీ రద్దు అవుతుంది. కాబట్టి ఈఅంశం పైన ప్రతివాదులకు అనుకూలంగానూ వాదికి ప్రతికూలంగానూ తీర్పు చెప్పడమయింది.

9. అంశాలు 1, 2 మీద నా నిర్ణయం ప్రకారం వాది దావా ఖర్చులతో కొట్టి వేయడమయింది.

1985వ సం.రం ఫిబ్రవరి 21వ తేదీన బహిరంగంగా కోర్టులో సంక్షిప్త లేఖకునికి నేను చెప్పినదాన్ని అతడు లిప్యంతరణం చేసిన దాన్ని సరిదిద్ది చదివాను.

(సంతకం)
ఎస్. సూర్యనారాయణరావు
జిల్లా మునసబు, మాడుగుల.

సాక్ష్య అనుబంధం.

పరీక్ష అయిన సాక్షులు

వాది తరపున :

వా.సా.–1 :– మండల రామారావు (వాది భర్త)

వా. సా.–2 :– జాగాని చంద్రపార్థసారధి అప్పారావు
(ఎగ్జిబిట్ ఎ–2 ధ్రువీకరణ దారు)

**ప్రతివాది తరపున :**

ప్ర.సా. –1: – వి.ఎస్. సుబ్రమణ్యం, ఆర్.ఐ. మాడుగుల.

ప్ర.సా. –2 : –బొడ్డేటి సూర్యనారాయణ
(మొదటి ప్రతివాది)

ప్ర.సా. –3 : – బొడ్డేటి అప్పలనాయుడు
(రెండో ప్రతివాది)

**గుర్తింపు పొందిన ఎగ్జిబిట్ల సంఖ్య : –**

**వాది తరపున :**

ఎగ్జిబిట్ ఎ–1 తేదీ 29–7–75 : – వాది పేర డి.1. డి.2 లు రూ.850/–లకు రాసిన ప్రోనోటు.

ఎగ్జిబిట్ : ఎ–2. తేదీ 9–8–76 : – ఎగ్జిబిట్ ఎ–1 వెనుకవైపు రెండో ప్రతివాది చెల్లించిన రూ.500/– లకు చెల్లు నమోదు.

ఎగ్జిబిట్ ఎ–3 : 5–3–79. మొదటి ప్రతివాది చెల్లించిన రూ.100/– లకు ఎగ్జిబిట్ ఎ–1 వెనుక వైపు రాసిన చెల్లు నమోదు

**ప్రతివాదుల తరపున : – ఏమీ లేవు.**

**x వరుసల పరంపర :–**

ఎగ్జిబిటట్ x–1 : – మొదటి ప్రతివాదికి సంబంధించిన 0–85 సెంట్ల పల్లంభూ: చూపుతున్న 1385 ఫసలీ 10–1 అడంగల్ రిజిస్టరులోని ఆరోపం.

ఎగ్జిబిట్ : x–2 : – మొదటి ప్రతివాదికి సంబంధించిన 0–57 సెంట్లు పల్లంభూ: చూపుతున్న 1385 ఫసలీ 10–1 అడంగల్ రిజిస్టరులోని ఆరోపం.

ఎగ్జిబిట్ : x–3 : – మొదటి ప్రతివాదికి సంబంధించిన 1–99 సెంట్లు పల్లంభూ: చూపుతున్న 1385 ఫసలీ 10–1 అడంగల్ రిజిస్టరులోని ఆరోపం.

ఎగ్జిబిట్ : x–4 : – మొదటి ప్రతివాదికి సంబంధించిన ఎ1–08 సెంట్లు భూ: చూపుతున్న 1385 ఫసలీ 10–1 అడంగల్ రిజిస్టరులోని ఆరోపం.

ఎగ్జిబిట్ : x–5 : – మొదటి ప్రతివాదికి సంబంధించిన 0–97 సెంట్లు భూ చూపుతున్న 1385 ఫసలీ 10–1 అడంగల్ రిజిస్టరులోని ఆరోపం.

ఎగ్జిబిట్ : x-6 : - మొదటి ప్రతివాదికి సంబంధించిన 0-46 సెంట్లు భూమి చూపుతున్న 1385 ఫసలీ 10-1 అడంగల్ రిజిస్టరులోని ఆరోపం.

(సంతకం)
ఎన్. సూర్యనారాయణరావు
జిల్లా మునసబు, మాడుగుల.

- సరైన నకలు -

(సంతకం)
మునసబు మేజిస్ట్రేటు, మాడుగుల.

# 11.

# జిల్లా మునసబు కోర్టు, బొబ్బిలి

**జిల్లా మునసబు కోర్టులో**

**హాజరు : టి. డేవిడ్ రాజు. బి.ఏ., బి.ఎల్.,**
జిల్లా మునసబు

సోమవారం, 1983 అక్టోబరు 3వ తేదీ.

ఎస్.సి.నెం. 7/1982.

గంటా శ్రీరాములు నాయుడు..........................................వాదికీ

కర్రి వెంకటస్వామి నాయుడు........................................ప్రతివాదికీ

**మధ్య :**

వాది తరఫున న్యాయవాది ఎ.నరసింహం ; ప్రతివాది తరఫున న్యాయవాది ఎం. సత్యనారాయణ హాజరుకాగా నేటివరకు విచారణలో ఉండి 30-9-1983 వ తేదీన నా ముందుకు తుది తీర్పు కోసం ఈ దావా రాగా కోర్టు ఈ కింది విధంగా తీర్పు చెప్పింది:

**తీర్పు**

వాది పేర ప్రతివాది రూ.250/-లకు 6 శాతం సాలుసరి వడ్డీతో చెల్లించడానికి తే 8-4-1979 న రాయించి ఇచ్చిన ప్రోనోటు అసలు, వడ్డీతో బాటు దరిమిలా వడ్డీ, దావా ఖర్చులతో రూ. 294-35 లు బాకీ వసూలు నిమిత్తం వేసిన దావా.

2. ప్లెయింటులోని సంగతులు సంక్షిప్తంగా ఇలా ఉన్నాయి: - ప్రతివాది తన అవసరాలకు అంటే కుటుంబ ఖర్చుల నిమిత్తం వాది దగ్గర రూ.250/-లు అప్పు తీసుకొని 6 శాతం సాలుసరి వడ్డీతో పాటు అసలు చెల్లించడానికి ఒప్పుకొని తే 8-4-1979 నాడు వాది పేర ప్రోనోటు రాయించి ఇచ్చాడు. కానీ వాది ఎన్నో సార్లు స్వయంగానూ, పెద్దల ద్వారాను అడిగినప్పటికీ బాకీ చెల్లింపు వాయిదా వేస్తూ రావటం కారణంగా దరిమిలా వడ్డీ దావా ఖర్చులతో పాటు దావా సొమ్ము మొత్తం బాకీ వసూలు కోసం దావా వేయడం అయింది.

3. ప్రతివాది ఈ కింది విషయాలతో లిఖితపూర్వక స్టేట్‌మెంటు దాఖలు చేశాడు. వాది పేర ప్రతివాది ధావా ప్రోనోటు రాసి ఇవ్వడం వాస్తవమే. కాని దాని ప్రతిఫలం అందలేదు. వాది వడ్డీ వ్యాపారం చేస్తున్నాడు. 1967 వ సం.రం. నుంచి వాది దగ్గరనుంచి ప్రతివాది సొమ్ము మొత్తాలు తీసుకొని వెళ్తూ ఉండేవాడు. నెల 1కి నూటికి రూ.30/–లు లేదా 30 కుంచాల ధాన్యం రూ.100/– లు వడ్డీ కింద వాదికి చెల్లించేవాడు. అదిపోగా మిగిలిన బాకీకి వాది తిరిగి ప్రోనోట్లు రాయించు కొనేవాడు. 26–2–1975 తేదీ ప్రోనోట్లు ప్రతివాది అలా రాసి ఇచ్చినవే. ఈ ప్రోనోట్లకు ప్రతిఫలం ముట్టలేదు. వాది సంవత్సరానికోసారో 3సం. రాలకు ఒకసారో ఇలా ప్రోనోట్లు రాయించుకొనేవాడు. అలా చివరిసారి 1979లో రూ. 250/–లకు ప్రోనోటు రాయించు కున్నాడు. కాని దానిప్రతిఫలం వాది ప్రతివాదికి ఇవ్వలేదు. దావా ప్రోనోటు 1976 సంవత్సరానికి చెందింది. ప్రతివాదికి కేవలం ఒక్క ఎకరం మెరక భూమి మాత్రమే ఉంది. అదే అతనికి ముఖ్యజీవనోపాధి. 1977 సం.రం. vii చట్టం సదుపాయాలు ప్రతివాదికి వర్తిస్తాయి. కాబట్టి బాకీ తీర్చి వేసినట్లే అవుతుంది. కాబట్టి ఖర్చులతో బాటు దావాను కొట్టి వెయ్యాలి.

4. వాది తరఫున వాదితరఫుసాక్షి 1ని పరీక్షించడం జరిగింది. ఎగ్జిబిట్ ఎ–1ను గుర్తించారు. ప్రతివాదుల తరఫున ప్రతివాదితరఫు సాక్షులు 1, 2 పరీక్షించడం జరిగింది. ఎగ్జిబిట్లు బి–1 నుంచి బి–9 వరకు గుర్తించడమయింది.

5. ఈ దావాలో నిర్ణయించవలసిన అంశం ఎగ్జిబిట్ ఎ–1 దావా ప్రోనోటు అంతకు ముందు రాసిన ప్రోనోటును పునర్జీవనానికి (నవీకరణకు) రాసి ఇచ్చిందా? దానికి ఏ ప్రతిఫలం ముట్టలేదా? అని.

6. వాది దావా ఇది : ప్రతివాది తన కుటుంబ అవసరాల నిమిత్తం రూ.250/–లు అప్పు తీసుకొని దానికి సాలుసరి 6 శాతం వడ్డీతోబాటు అసలు చెల్లించడానికి ఒప్పుకొని దావా ప్రోనోటు ఎగ్జిబిట్ ఎ–1 తేదీ 8–4–1977 న రాసి ఇచ్చాడు. ఎన్నో సార్లు తాను స్వయంగానూ పెద్దల ద్వారానూ ఆ బాకీ చెల్లించమని అడిగినప్పటికీ అతడు చెల్లించలేదు. కాబట్టి ప్రతివాది దగ్గిరి నుంచి దావా మొత్తాన్ని వసూలు చేసుకొనే హక్కు ఉంది.

7. వాది పేర ఎగ్జిబిట్ ఎ–1ను ప్రతివాది రాసి ఇవ్వడాన్ని అంగీకరిస్తున్నాడు. కాని దాని ప్రతిఫలం ముట్టలేదన్నాడు. అది అంతకు ముందు ప్రోనోటు (రెన్యువల్) నవీకరణమే అన్నాడు. నెల1కి నూటికి రూ.30/–లు లేదా 30 కుంచాల ధాన్యం రూ.100/-వడ్డీగా నిర్ణయించడం జరిగిందనీ ఆ ప్రకారం వడ్డీ ప్రతివాది చెల్లించాడనీ అలా చెల్లించగా మిగిలిన బాకీకి ప్రోనోట్లు వాది రాయించుకున్నాడన్నాడు. అలా ప్రతివాది చేత రాయించుకున్న ప్రోనోట్లే తేదీ 2–4–1967, 14–1–1968, 19–2–1970, 1–4–1972, 26–2–1975. ఈ బాకీ 1976 సంవత్సరానికి చెందటం వల్ల 1977 సం vii చట్టం సదుపాయాలు వర్తిస్తాయి. అందువల్ల దావా బాకీ తీర్చివేసినట్లే భావించి దావాను రద్దు పరచడానికి అర్హమయిందిగా చెప్పాలి.

8. వా.సా.-1 గా వాదిని పరీక్షించటం జరిగింది. అతడు ప్లెయింటులో చెప్పిన విషయాలు వాస్తవమని చెప్పాడు. అతని సాక్ష్యంలో ఎగ్జిబిట్ ఎ-1 ప్రోనోటు గుర్తించడమయింది.ఎగ్జిబిట్ ఎ-1 తేదీ 8-4-1979 వా.సా.-1 క్రాస్‌పరీక్షలో ఎగ్జిబిట్‌లు బి-1 నుంచి బి-9 వరకు ఉన్న ప్రోనోట్లను వాదికి చూపించడం జరిగింది. తే12-8-1966 న ప్రతివాదీ అతని సోదరులూ రూ.1250 /- లు అప్పు తీసుకున్నారో లేదో తనకు జ్ఞాపకం లేదని వాది అన్నాడు. 1967 సం.లో వాళ్ళు రూ. 1250/-లు ఎగ్జిబిట్ బి-2 కింద అప్పు తీసుకున్నారనీ, ఆ బాకీ తిరిగి చెల్లించారని ప్రతివాదీ, అతని సోదరులూ ఎగ్జిబిట్ బి-3ని రాసి ఇచ్చారో లేదో తనకు జ్ఞాపకం లేదనీ వాది చెప్పాడు. అయితే వడ్డీ చెల్లించగా మిగిలిన బాకీకి అది నవీకరణం (రెన్యువల్) కాదని వాది చెప్పాడు. అంతేకాకుండా తాను నెల 1కి నూటికి రూ.30/-లు చొ.న వడ్డీ లేదా సంవత్సరానికి నూటికి 30 కుంచాల ధాన్యం రూ.100/-లు వడ్డీగా వసూలు చేయలేదని చెప్పాడు. ప్రతివాది సోదరుడు చిన్నం నాయుడూ, రామానాయుడూ ఎగ్జిబిట్ బి-4, బి-5 లనూ, ప్రతివాదీ అతని సోదరుడూ బి-6 ఎగ్జిబిట్ ప్రోనోటును తనపేర ప్రోనోట్లు రాసిఇవ్వడం తనకు జ్ఞాపకం లేదన్నాడు, కాని ప్రతివాది ఎగ్జిబిట్ బి-8 ప్రోనోటునూ అతని సోదరుడు ఎగ్జిబిట్ బి-7 ప్రోనోటునూ తనపేర రాసి ఇచ్చాడని వాది అంగీకరించాడు. ఇంకా ప్రతివాది తనపేర ఎగ్జిబిట్ బి-9 రాసి ఇచ్చాడో లేదో జ్ఞాపకం లేదని వాది చెప్పాడు. ఎగ్జిబిట్‌లు బి1 నుంచి బి9 వరకు ఉన్న ప్రోనోట్ల మొత్తాల బాకీ నిమిత్తం ఎగ్జిబిట్ ఎ-1 ను ప్రతివాది దగ్గర తాను తీసుకున్నానన్న దాన్ని కాదన్నాడు. అలాగే ప్రతివాదికి దాని ప్రతిఫలం ఇవ్వలేదన్నది కూడా వాది కాదన్నాడు.

9. ప్రతివాది దాఖలు చేసిన లిఖితపూర్వకమైన స్టేట్‌మెంటు లోనే ఎగ్జిబిట్ ఎ-1 ప్రోనోటు తాను రాసి ఇచ్చిందని అంగీకరించాడు. కాని ధాని ప్రతిఫలం ముట్టలేదన్నాడు. ఎగ్జిబిట్ ఎ-1 ప్రోనోటు అంతకుముందు ప్రోనోట్లకు నవీకరణం (రెన్యువల్) అన్నాడు. అంతే కాదు తాను తన సోదరులు వాదిపేర రాసి ఇచ్చిన ప్రోనోట్ల తేదీలు కూడా ఇచ్చి ఉన్నాడు. అతని వాదనను బలపరచడానికి ప్రతివాది ఇద్దరు సాక్షులను పరీక్షించాడు. ప్ర.సా-1 ప్రతివాదే. ప్ర.సా. - 2 ఎగ్జిబిట్లు బి-2, బి-5ల ధ్రువీకరణ దారు ప్ర.సా.-1 సాక్ష్యం లో వడ్డీ రేటు రూ.30/- లు లేదా 30 కుంచాల ధాన్యం రూ. 100/- లకు సం॥రం 1కి అని మొత్తం చెప్పాడు. ప్రతిసంవత్సరం వాళ్ళు ఆమొత్తం చెల్లించే వాళ్ళమని చెప్పాడు. ఏమైనా బాకీ మిగిలితే ఆ బాకీకి వాది పేర కొత్త ప్రోనోట్లు రాసే వాళ్ళమని చెప్పాడు.

ఒక్కొక్కప్పుడు రెండు సంవత్సరాలకోసారి కొత్త ప్రోనోట్లు రాసే వారమని చెప్పాడు. ఎగ్జిబిట్లు బి-1 నుంచి బి-9 వరకూ మాకు తిరిగి ఇచ్చి వేసిన ప్రోనోట్లు అన్నాడు. అందులో కొన్ని ప్రోనోట్లు తానొక్కడే రాసినవి కాగా మరికొన్ని సోదరులతో సంయుక్తంగానూ మరికొన్ని మాత్రం తన సోదరులు వేరుగా రాసినవి. ఎగ్జిబిట్ బి-9 తేదీ 26-2-1975. ఈ ఎగ్జిబిట్ బి-9 తరవాత దావా ప్రోనోటుకు ముందు మరో ప్రోనోటు వాది పేర తాను రాసి ఇచ్చానని కానీ అది నాకు తిరిగి ఇవ్వలేదని ప్రతివాది అన్నాడు. ప్రతివాది

తన సాక్ష్యంలో ప్రత్యేకంగా "వాది పేర ఎగ్జిబిట్ ఎ–1 తాను రాసి ఇచ్చాను. కాని దాని ప్రతిఫలం నాకు ముట్టలేదు. ఎగ్జిబిట్ బి–9 తర్వాత ఎగ్జిబిట్ బి–9 నిలవ బాకీకి మరో ప్రోనోటు రాశాను. ఎగ్జిబిట్ ఎ–1 ఆ ప్రోనోటు నిలవ బాకీకి రాశాను. కాని ఆ ప్రోనోటు నాకు తిరిగి ఇవ్వలేదు" అని చెప్పాడు.

10. ప్ర.సా. – 2 సాక్ష్యంలో వడ్డీరేటు చాలా ఎక్కువ అనీ, ప్రతిఫలం ఇస్తూ ఉండగా ఎప్పుడూ చూడలేదనీ, అయినా ప్రోనోటు రాసిన వాళ్ళు ప్రతిఫలం ముట్టినట్లు ఒప్పుకొనే వాళ్ళనీ; ప్రతివాది సోదరులు కూడా సొమ్ములు వాది దగ్గరి నుంచి అప్పుగా తీసుకొనే వారనీ, ఎగ్జిబిట్‌లు బి–1 నుంచి బి–9 వరకూ ఉన్న ప్రోనోట్ల ప్రతిఫలం ప్రతివాదికీ అతని సోదరులకూ ఇవ్వలేదనీ చెప్పాడు. ఇంకా అతడు ఇలా చెప్పాడు: – "ఎగ్జిబిట్ ఎ–1 ధ్రువీకరణదారు తాను కానని, ఎగ్జిబిట్ బి–5 బాపతు ప్రతిఫలం ముట్టిందనీ, దాన్ని అప్పుతీసుకొన్నవాడు తనముందు ఒప్పుకున్న తరవాతే దాన్ని ధ్రువీకరించాననీ, ఎగ్జిబిట్లు బి–1 నుంచి బి–9 వరకూ ప్రోనోట్ల బాకీలు బాకీ తీసుకున్నవాళ్ళు చెల్లించి వేశారని". కూడా చెప్పాడు.

11. ప్ర.సా.–2 సాక్ష్యం ప్రకారం, ఎగ్జిబిట్ బి–5 బాపతు ప్రతిఫలం ముట్టిందని బాకీదారు చెప్పిన తర్వాతనే అతడు దాన్ని ధ్రువీకరించినట్లు చెప్పాడు. ఇంకా ఎగ్జిబిట్ బి–2 బాపతు వాది దగ్గరనుంచి ప్రతిఫలం ముట్టినట్లు ప్రతివాదీ, అతని సోదరుడూ ఒప్పుకున్న తర్వాత అతడు ధ్రువీకరించాడు. ఎగ్జిబిట్లు బి–1 నుంచి బి–9 వరకు అన్ని ప్రోనోట్ల బాపతు సొమ్మూ బాకీదార్లు చెల్లించారు కాబట్టి వాటన్నింటినీ ప్రతివాదికీ అతని సోదరులకూ తిరిగి ఇచ్చివేయడం అయింది. అన్ని ప్రోనోట్లకూ దస్తూరి ఒక్కనిదే, ధ్రువీకరణదారులు వాది బంధువులే అని వాది అంగీకరించాడు. అన్ని ప్రోనోట్లకూ దస్తూరి ఒక్కడిదే, ధ్రువీకరణదారులు అతని బంధువులే అని వాది కేవలం అంగీకరించినంత మాత్రాన, ప్రతిఫలం చెల్లించకుండానే ప్రతివాది నుంచి ఎగ్జిబిట్ బి– 1 నుంచి బి–9 వరకున్నూ ఎగ్జిబిట్ ఎ–1 లను పొందినట్లు చెప్పడానికి వీలులేదు. వా.సా. – 1 సాక్ష్యంలో ఎగ్జిబిట్ బి–1 నుంచి బి–9 వరకు అన్ని ప్రోనోట్ల బాపతు ప్రతిఫలం తాను చెల్లించానని, మళ్ళీ వాటిని వారు తిరిగి చెల్లించారు కనకనే తానా ప్రోనోట్లను తిరిగి ఇచ్చివేశానని అతడు చెప్పాడు. ఎగ్జిబిట్ ఎ–1 పాత ప్రోనోటుకు నవీకరణం(రెన్యువల్) నిజంగా అయితే, ఎగ్జిబిట్ ఎ–1 దస్తూరీదారునీ, ధ్రువీకరణదార్లనూ ప్రతివాది పరీక్షించి ఉండేవాడు. అలా చెయ్యలేదు. దావా ప్రోనోటు ప్రతివాది తాను రాసి ఇచ్చానని ఒప్పుకున్నాడు. ప్ర.సా.–2 సాక్ష్యంలో ఎగ్జిబిట్‌లు బి–2, బి–5 ల ప్రతిఫలం ముట్టిందనీ, ఎగ్జిబిట్లు బి–1 నుంచి బి–9 వరకు ఉన్న అన్నింటి బాపతు బాకీని బాకీదార్లు అంటే ప్రతివాదీ, అతని సోదరులూ తీర్చివేశారని అతడు చెప్పాడు. ప్రతివాది తన సాక్ష్యంలో ఎగ్జిబిట్ బి–9 తర్వాత ఎగ్జిబిట్ ఎ–1 కు ముందూ వాది తన దగ్గరినుంచి ఒక నవీకరణ ప్రోనోటు తీసుకున్నాడని దాన్ని ఇంకా తిరిగి ఇవ్వలేదని చెప్పాడు. ఆ ప్రోనోటు మొత్తంగానీ, దాని తేదీగానీ, దాని ధ్రువీకరణదారుల్ని గానీ చెప్పలేనన్నాడు. ఎగ్జిబిట్ బి–9కీ ఎగ్జిబిట్ ఎ–1 కీ మధ్య ఉందని చెప్పిన ప్రోనోటు రాసినవాణ్ణీ, ధ్రువీకరణదారుల్ని అతడు పరీక్షించనేలేదు. ఎగ్జిబిట్‌లో బి–1

నుంచి బి–9 వరకు ఉన్న ప్రోనోట్లవల్ల ప్రతివాదీ అతని సోదరులూ 1967 నుంచి వాది దగ్గర అప్పుతీసుకుంటున్నా రనేది వాస్తవమే, కానీ ప్రతివాది ఇంకే విషయాలూ రుజువు చేయకపోవడం వల్లనూ, వాది నుంచి ప్రతివాది తనకు సొమ్ములు అప్పు తీసుకునే అలవాటు ఉందని ఒప్పుకోవడం వల్లనూ ఎగ్జిబిట్లు బి–1 నుంచి బి–9 వరకు ఉన్న ప్రోనోట్ల భాపతు ప్రతిఫలం చెల్లించ లేదన్న ప్రతివాది వాదాన్ని ప్ర.సా.–2 బలపరిచినప్పటికినీ ప్రతివాది బాకీ బాధ్యత తీర్చలేదని నేను అనుకుంటాను. ఎగ్జిబిట్లు బి–2, బి–5 లకు ధ్రువీకరణదారుల్లో ఒకడైన ప్ర.సా.–2 తన సాక్ష్యంలో ప్రతిఫలం ముట్టిందని ఎగ్జిబిట్ లు బి–1 నుంచి బి–9 వరకు ఉన్న ప్రోనోట్ల బాపతు బాకీని బాకీదార్లు తీర్చివేశారనీ చెప్పాడు. నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్స్ యాక్టు తాలూకు 118 సెక్షన్ దృష్ట్యా, పత్రంబాపతు ప్రతిఫలం ముట్టింది. ఎలాగయితేనేం అది ఖండించదగిన పురోభావన. కాని ప్రతివాది తన రుజువుభారాన్ని తీర్చలేక పోయాడు. ప్ర.సా.–2 ను ప్రతివాది పరీక్షించి నప్పటికీ వా.సా.–1 సాక్ష్యాన్ని బలపరచిన ప్ర.సా.–2 సాక్ష్యంవల్ల దావా ప్రోనోటు ప్రతిఫలం ముట్టిందనీ అది పాత ప్రోనోటుకు నవీకరణం కాదనీ నేను నమ్ముతున్నాను.

12. సాలుసరి రూ. 100/– లకు వడ్డీరేటు రూ.30/–లు లేదా 30 కుంచాల ధాన్యంగా ఉందని ప్రతివాది (ఆరోపణ) ఆ ప్రకారం దాన్ని ప్రతి సం. రం. చెల్లిస్తూ మిగిలిన బాకీకి వాది పేరున ప్రోనోటు రాసే అలవాటుందని ప్రతివాది చెప్పాడు. కేవలం నోటిమాటలే ఆ ఆరోపణకు ఆధారం. కానీ దానికి ఎలాంటి ఆధారాలు ప్రతివాది చూపలేకపోయినాడు. కాబట్టి ప్రతివాది ఆరోపణను ఆమోదించడం సాధ్యంకాదు.

13. 1976వ సం. రం. దావా ప్రోనోటు పాత ప్రోనోటుకు నవీకరణమని ప్రతివాది వాదన. కాబట్టి 1977 సం. రం. చట్టం vii సదుపాయాలు తనకు వర్తిస్తాయని అందువల్ల ఆ దావా బాకీ చెల్లించినట్లే భావించాలని ప్రతివాది వాదన. ఇరుపక్షాలూ ఈవిషయంలో సాక్ష్యం ఇచ్చాయి. వా.సా.–1 తన సాక్ష్యంలో తనకు 15 ఎకరాల భూమి ఉందనీ తాను వడ్డీ వ్యాపారం చేస్తున్నాననీ, దానిలో సం. రానికి రూ. 4,000/–లు నుంచి రూ. 5,000/– లు వరకూ వస్తుందనీ, ప్రతివాదికి ఎక. 2–50 ల పల్లం భూమీ, ఒక ఎకరం మెరక భూమి ఉన్నాయనీ చెప్పాడు. ప్ర.సా.–1 తన సాక్ష్యంలో వాదికి 50–00 ఎకరాల భూమి ఉందనీ, రూ. 50,000/–ల మేరకు వడ్డీ వ్యాపారం ఉందనీ చెప్పాడు. ప్ర.సా. –2 కూడా వాదికి వడ్డీ వ్యాపారం ఉందని చెప్పాడు. ప్రతివాది అయిన ప్ర.సా.–1 సాక్ష్యంలో తనకు ఒక్క ఎకరం మెరక భూమి మాత్రమే ఉందనీ తాను వ్యవసాయ కూలీని అనీ చెప్పాడు. 1976 అంతకు ముందూ ఉన్న దావా ప్రోనోటు అయితేనే 1977 సం.రం. చట్టం vii సదుపాయాలు ఈ ప్రోనోట్లకు వర్తిస్తాయి. కనక పై సాక్ష్యం పరిగణన ఉత్పన్నమవుతుంది. ఎగ్జిబిట్ ఎ–1 అంతకు ముందు ప్రోనోటుకు నవీకరణ కాదు. దాని ప్రతిఫలం ముట్టింది. కాబట్టి 1977 సం. రం. చట్టం vii సదుపాయాలు దీనికి వర్తించవని నేను ముందు చెప్పినట్టుగానే భావిస్తున్నాను. కాబట్టి వాది అభ్యర్థన మేరకు దావాక్లెయిమ్‌కు ఖర్చులతో అర్హుడని నేను భావిస్తున్నాను.

14. పర్యవసానంగా ఈ దావా ఖర్చులతో కోరిన విధంగా డిక్రీ ఇవ్వడమయింది.

సంక్షిప్త లేఖకునికి చెప్పి, అతడు లిప్యంతరీకరణం చేసిన తరువాత, దాన్ని నేను సరిదిద్ది బహిరంగంగా కోర్టులో 1983 వ సం. రం. అక్టోబరు 3వ తేదీన ప్రకటించాను.

(సంతకం)
టి. డేవిడ్ రాజు.
జిల్లా మునసబు

**సాక్ష్యం అనుబంధం.**

పరీక్షించిన సాక్షులు.

**వాది :** **ప్రతివాది :**

వా.సా.-1 గంటా శ్రీరాములు నాయుడు. ప్ర.సా.-1 కర్రి వెంకటస్వామి నాయుడు.

ప్ర.సా. - 2. బొచ్చా నీలంనాయుడు.

**మార్కు అయిన పత్రాలు**

**వాది తరపున:**

ఎగ్జిబిట్ ఎ -1/8-4 -1979. వాది పేర ప్రతివాది రాసిన ప్రోనోటు.

**ప్రతివాదుల తరపున :**

ఎగ్జిబిట్ బి-1/12-3-1966, వాది పేర ప్రతివాది రూ. 1250/-లకు రాసి, తీర్చిన ప్రోనోటు.

ఎగ్జిబిట్. బి-2/ 2-4-1967 - డిటో - రూ. 1250/-లకు

ఎగ్జిబిట్ బి-3/14 -4-1968 - డిటో - రూ.2800/-లకు.

ఎగ్జిబిట్ బి-4/19-2-1970. - డిటో - రూ. 1135/ - లకు.

ఎగ్జిబిట్ బి-5/19-2-1970 -డిటో - కర్రి రామనాయుడిచేత రూ. 910/ - లకు.

ఎగ్జిబిట్ బి.6/1-4-1972. - డిటో - ప్రతివాది వగైరాలచే రూ. 4,235/-లకు

ఎగ్జిబిట్ బి-7/1-2-1970. - డిటో - కర్రి సోమనాయుడిచేత రూ. 910/-లకు

ఎగ్జిబిట్ బి -8/19-2-1970 వాది పేర ప్రతివాది బాకీ తీర్చిన ప్రోనోటు.

ఎగ్జిబిట్ బి–9/26–2–1975. –డిటో – రూ. 1100/–లకు.

(సంతకం)
టి.డేవిడ్ రాజు.
జిల్లా మునసబు, విజయనగరం

– సరైన నకలు –

(సంతకం)–
అదనపు జిల్లా న్యాయమూర్తి
ఎఫ్.ఎ.సి. జిల్లా న్యాయమూర్తి
విజయనగరం

# జిల్లా మునసబు కోర్టు, సాలూరు

## జిల్లా మునసబు కోర్టులో

హాజరు: శ్రీ కె. హనుమంతరావు, బి.ఏ., ఎల్.ఎల్.బి;
జిల్లా మునసబు

1984వ సం.రం. ఆగస్టునెల 31వ తేదీ శుక్రవారం
ఎస్.సి.నెం.3/81.

1. పాడిశెట్టి కమలమ్మ.
2. పాడిశెట్టి నరసమ్మ
3. పాడిశెట్టి నారాయణ
4. సొమ్మయాల సింహాచలం..........................................వాదులకూ

1. దాడి అప్పడు
2. దాడి వెంకడు..........................................ప్రతివాదులకూ

మధ్య:

వాదుల తరపున న్యాయవాది శ్రీ కె. భీమారావు, ప్రతివాదుల తరపున న్యాయవాది శ్రీ యల్. బాలాజీరావు హాజరుకాగా తుది తీర్పు నిమిత్తం తే 28–8–1984 దీన నా దగ్గర నేటి వరకు ఉన్నందువల్ల కోర్టు ఈ విధంగా తీర్పు చెప్పింది:–

తీర్పు

(1) మొదటి వాది భర్తా, 2,3,4వాదుల తండ్రి అయిన పాడిశెట్టి సూరయ్య పేర రూ.250/–లకు ప్రతివాదులు 9–5–78 తేదీన సాలుసరి 5½ శాతం చొప్పున వడ్డీ చెల్లించడానికి ఒప్పుకొని రాయించి ఇచ్చిన ప్రోనోటు అసలు వడ్డీలతో అయిన రూ.290/–లూ, దరిమిలా వడ్డీ దావా ఖర్చులు ప్రతివాదుల దగ్గిరి బాకీ వసూలు చేయడానికి చేసిన దావా ఇది.

(2) ప్లెయింటులో ఉటంకించిన అంశాలు ఇలా ఉన్నాయి:– 2, 3 వాదులు మొదటివాది కుమారులు, 4వ వాది కుమార్తె. వాదులు 1నుంచి3 వరకు ఉమ్మడికుటుంబ సభ్యులు. వారు ఉమ్మడికుటుంబంగా జీవిస్తున్నారు. మొదటివాది భర్తా, 2,3,4వాదుల తండ్రి అయిన పాడిశెట్టి సూరయ్య 4 సం.రం ల కిందట చనిపోయాడు. అతడు జీవించిన కాలంలో వాదుల ఉమ్మడి కుటుంబానికి యజమానిగా ఉండేవాడు. సూరయ్య వాదుల దగ్గిరి నుంచి ప్రతివాదులు రూ.250/– లు అప్పుతీసుకొని దానికి సంవత్సరానికి

6శాతం వడ్డీతో అసలు తిరిగి ఆ సూరయ్యకు, లేదా అతని అనుమతిదారుకు చెల్లించడానికి ఒప్పుకొని 9–5–1978వ తేదీన ప్రోనోటు రాయించి ఇచ్చారు. దావా ప్రోనోటుకింద పుచ్చుకున్న సొమ్ము వాదుల ఉమ్మడి కుటుంబానికి చెందుతుంది. కుటుంబయజమానిగా ఉన్నందువల్ల సూరయ్య పేరనే ప్రోనోటు రాసి ఇవ్వడమయింది. సూరయ్యకు వాదులు ప్రథమ శ్రేణి వారసులు కాబట్టి దావా సొమ్ము క్లెయిమ్ చెయ్యడానికి వారు అర్హులు. సూరయ్య చనిపోయిన వాదులు ప్రతివాదుల్ని సొమ్ము అడగడమూ, వారు దావా మొత్తం సొమ్ము క్లెయిమును అంగీకరిస్తూనే ఏదో ఒక నెపంతో చెల్లింపు వాయిదా వేస్తూ ఉండడంవల్లనే ఈ దావా వెయ్యడమయింది.

(3) మొదటి ప్రతివాది లిఖితపూర్వకమయిన స్టేట్‌మెంటు దాఖలు చేశాడు. దాన్నే రెండో ప్రతివాది ఎంపిక చేసుకుంటూ దావా విషయాలను ఖండిస్తూ ఇతర విషయాలతో పాటు ఇలా అన్నారు:– వాదులు పాడిశెట్టి సూరయ్యకు న్యాయసంబంధమైన వారసులు కారు. ఆ సూరయ్యదగ్గిరి నుంచి ప్రతివాదులు ఏ సొమ్మూ తీసుకోడమూ లేదు. ఈ దావా ప్రోనోటు కాని ఏ ప్రోనోటు కానీ రాసి ఇవ్వలేదు. కాబట్టి దావా ప్రోనోటు చెప్పుకోదగిన ఫోర్జరీ (నకిలీ) పత్రం. దావా ప్రోనోటు రాసినవానికీ దాని ధ్రువీకరణదారులకూ మధ్య శత్రుత్వం ఉంది. అందుకే దావా వెయ్యడానికి వాదుల్ని వారు దుష్ప్రేరేపణ చేశారు. ఆ దావా ప్రోనోటు నిజం కాదు. ప్రతిఫలయుక్తమైనదికాదు. అది ప్రతివాదుల్ని బంధించదు. వారసత్వ ధ్రువపత్రం లేనిదే దావా చెల్లదు. కాబట్టి దావాను ఖర్చులతో కొట్టివేయమని ప్రతివాదుల ప్రార్థన.

(4) పై వాదనలు ఆధారంగా, తేల్చిన విచారణాంశం ఏమంటే దావా ప్రతిఫలయుక్తమైనదా? ప్రోనోటు నిజమా? ప్రతివాదుల్ని బంధిస్తుందా?

(5) అంశం:– మొదటి వాది భర్తా, 2నుంచి4వరకు ఉన్న వాదుల తండ్రి రూ.250/–లు ప్రతివాదులకు ఇవ్వగా దానికి దావా ప్రోనోటు అతనిపేర రాసి ఇచ్చారు. ప్రోనోటుదారు అయిన సూరయ్య, మొదటివాది భర్త అయినందున వాళ్ళది ఉమ్మడికుటుంబం. 3సం.ల కిందటనే సూరయ్య చనిపోయాడు కాబట్టి ఇది వాదులకు సంబంధించిన దావా. దీనికి ముందు అతడు వాదులతోనే ఉమ్మడిగా జీవిస్తూ ఉండేవాడు. ఎగ్జిబిట్ ఎ–1 కింద ఉన్న మొత్తాన్ని మొదటివాది భర్త ప్రతివాదులకు ఇచ్చాడు. దానికి సాలుసరి 6శాతం వడ్డీ చెల్లించడానికి వాళ్ళు అంగీకరించారు. ఎగ్జిబిట్ ఎ–1 దావా ప్రోనోటు. మొదటివాది భర్త బతికున్న కాలంలో దావారుణం చెల్లించమని ప్రతివాదుల్ని అడిగాడు. వాళ్ళు ఆ రుణాన్ని అంగీకరిస్తూనే ఏదో నెపంతో కాలయాపన చేశారు.

(6) వారసత్వపు ధ్రువీకరణ పత్రం తీసుకొని దాఖలు చేయకుండానే మొదటివాది భర్తపేర ప్రతివాదులు రాసి ఇచ్చిన దావా ప్రోనోటు కనక ప్రతివాదులపైన ప్రస్తుత వాదులు దావా వేయ వచ్చా? అన్నది విచారణాంశం.

(7) వారసత్వపు ధ్రువీకరణపత్రం వాదులు సంపాదించిన తర్వాతనే ప్రతివాదులపైని

దావా వెయ్యాలి. వారసత్వపు ధ్రువీకరణ పత్రం లేకుండా దావా చెల్లదు.

(8) పై నా చర్చను దృష్టిలో పెట్టుకొని వాదులు వేసిన ఈ దావాను రద్దు పరచాను. ఖర్చులనిమిత్తం ఏ ఆదేశం లేదు.

నేను చెప్పిన ఉక్తలేఖనం టైపు చెయ్యగా, సరిదిద్దాను. బహిరంగంగా కోర్టులో ఈ 31వరోజు అగస్టు 1984 తేదీన నేను చదివి వినిపించాను.

(సంతకం.)
కె. హనుమంతరావు,
31–8–84,
జిల్లా మునసబు, సాలూరు

**సాక్ష్యానుబంధం**
**పరీక్షించిన సాక్షులు**

| **వాదుల తరపున** | **ప్రతివాదుల తరపున** |
|---|---|
| వా.సా.– 1. పి.కమలమ్మ | ఒక్కరూ లేరు |

**మార్కు అయిన పత్రాలు**

**వాదితరపున:**

ఎగ్జిబిట్ ఎ–1/ 9–5–1978 రూ.250/–లనే ప్రతివాది మొదటి వాది భర్తపేర రాసి ఇచ్చిన ప్రోనోటు.

**ప్రతివాదుల తరపున:**

– ఏమి లేవు.

(సంతకం.)
కె. హనుమంతరావు
31–8–84,
జిల్లా మునసబు, సాలూరు

– సరైన నకలు –

(సంతకం.)
అదనపు జిల్లా న్యాయమూర్తి
ఎఫ్.ఎ.సి. జిల్లా న్యాయమూర్తి.
విజయనగరం.

# 13.

# అదనపు జిల్లా మునసబు కోర్టు, విజయనగరం

అదనపు జిల్లా మునసబు కోర్టులో

హాజరు: శ్రీ ఎన్.నరసింహ రాజు, బి.ఏ., ఎల్.ఎల్.బి.,
అదనపు జిల్లా మునసబు.

సోమవారం, 28వ రోజు ఫిబ్రవరి, 1983.
ఎస్. సి.నం. 11/82

శ్రీ మునీర్ జమాల్ హాజి అష్రఫ్......................................వాదికీ

(1). ది యూనియన్ ఆఫ్ ఇండియా, ప్రతినిధి జనరల్ మేనేజరు, సౌత్ ఈస్టర్న్ రైల్వే, కలకత్తా– 700043.

(2) ది యూనియన్ ఆఫ్ ఇండియా ప్రతినిధి జనరల్ మేనేజరు, సెంట్రల్ రైల్వే. బొంబాయి– 400001.

(3)ది యూనియన్ ఆఫ్ ఇండియా ప్రతినిధి జనరల్ మేనేజరు. నార్దర్న్ రైల్వే, న్యూఢిల్లీ.................................................ప్రతివాదులకూ

మధ్య :

ఈ దావా తే 26–2–83 దీన తుది తీర్పు నిమిత్తం నాదగ్గరకు వచ్చింది. వాది తరపున న్యాయవాదులు సర్వశ్రీ శ్రీ జి. రామచంద్రరావు, వి.కేదారినాథ్; బి.నరసింహామూర్తిన్నీ ప్రతివాదుల తరపున న్యాయవాది శ్రీ కె.వి. శాస్త్రి హాజరు కాగా నేటివరకు తీర్పుకోసం నిలిచి ఉన్న ఈ దావా విషయంలో కోర్టు కింది విధంగా తీర్పు చెప్పింది.

తీర్పు

రైల్వేవారి పూర్తి నిర్లక్ష్యం అశ్రద్ధ కారణంగా 39 కిలో గ్రాముల కాయధాన్యం పప్పు (కందిపప్పు) తక్కువ డెలివరీ (బట్వాడా) ఇచ్చారు. దాని ఖరీదు నిమిత్తం రూ.189–40 పైసలు వసూలు నిమిత్తం చేసిన దావా ఇది.

(2) ప్లెయింట్‌లో ఉటంకించిన అంశాలు ఇలా ఉన్నాయి. మెసర్స్ మోతిరామ్ రాధారామ్, ఢిల్లీ నుంచి 245 బస్తాల కాయధాన్యం పప్పును వాది కంపెనీ కొన్నది. దాన్ని ఇన్‌వాయిస్ నెం.9 ఆర్.ఆర్.నెం.137567 లో తే4–5–1981 దీన ఓఖ్లా నుంచి విజయనగరానికి పంపారు. అమ్మకందార్లు బ్యాంకు మీద ఆర్.ఆర్.తో హుండీ తీసుకున్నారు. విజయనగరంలో హుండీని ఆమోదించారు. స్టాక్ విజయనగరంలో డెలివరీ ఇచ్చారు. అందులో తగ్గుదల ఉంది. రైల్వేవారు ఎసెస్‌మెంటు డెలివరీ గ్రాంటుచేసి తగ్గుదల ధ్రువీకరణ పత్రం ఇచ్చారు. అందుకే ఈదావా.

(3) ఈ కిందివిధంగా వాదనలు చేస్తూ ప్రతివాదులు లిఖితపూర్వక స్టేట్‌మెంటు దాఖలు చేశారు:– దావా రవాణా సరుకును సంబాళించడంలోని అశ్రద్ధ, అజాగ్రత్తలవల్ల తగ్గుదల సంభవించలేదు. ప్యాకింగ్ నియమాలను సరిగా పాటించలేదు. అందువల్ల వాది ఏమాత్రం తగ్గుదలను క్లెయిమ్ చేయజాలడు. కేవలం తగ్గుదల ధ్రువీకరణపత్రం ఇచ్చినంత మాత్రాన వాస్తవంగా తగ్గుదలను ఒప్పుకున్నట్లు కాదు. అది కేవలం డెలివరీ పరిమాణానికి సాక్ష్యం మాత్రమే. దానికి గుర్తింపు విలువ లేదు. లాభానికి, వడ్డీకి వాది అర్హుడు కాదు.

(4) వాది అభ్యర్థనమేరకు అర్హుడా, కాదా? అన్నది విచారణాంశం.

(5) వాది గుమాస్తా వాది తరపు సాక్షి–1గా ప్రమాణం చేసి ప్లెయింటులోని ప్రతివాదాలను మాట్లాడాడు. వాది కంపెనీ 245 బస్తాల పప్పుధాన్యం మెసర్స్ మోతీరామ్ రాధారామ్ ఢిల్లీ నుంచి కొన్నారు. దాన్ని ఇన్‌వాయిస్ నెం.9, ఆర్.ఆర్.నెం.137567 తేదీ 4–5–1981 లో ఓఖ్లా నుంచి విజయనగరానికి వారు హుండీతీసి పంపారు. హుండీని ఆమోదించి సరుకును డెలివరీ తీసుకోడమయింది. అందులో సరుకు తగ్గుదల ఉంది. ఆమేరకు రైల్వే అధికారులు తగ్గుదల ధ్రువీకరణపత్రం ఇచ్చారు. రైల్వేవారి అశ్రద్ధవల్ల తగ్గుదల వచ్చిందని, రైల్వేశాఖకు నోటీసు ఇచ్చి క్లెయిమ్‌ను కోరారని అతడు వాఙ్మూలం ఇచ్చాడు. ఎగ్జిబిట్ ఎ–1 కొనుగోలు ఇన్‌వాయిస్ ప్రతి. ఎగ్జిబిట్ ఎ–2 తగ్గుదల ధ్రువీకరణపత్రం ప్రతి ఎగ్జిబిట్ ఎ–3 న్యాయవాది నోటీసు ఆఫీసు నకలు ప్రతి. ఎగ్జిబిట్ ఎ–4 నుంచి ఎ–6వరకు అన్నీ తపాలా శాఖవారి ఎగ్జిబిట్ ఎ–3 అందినట్లున్న తీర్పు రసీదులు. ఈ సాక్ష్యానికి ప్రతిగా ప్రతివాదులు ఏ సాక్ష్యమూ ఎదుట పెట్టలేదు. వాల్యూమ్ 1, భాగం 1 గూడ్స్ టారిఫ్ 177 నియమం ప్రకారం రైల్వే రసీదుపై పప్పులను బుక్ చేస్తారు.రైల్వే అధికారులు ఇచ్చిన తగ్గుదల ధ్రువీకరణపత్రం సరుకు డెలివరీలో కొంతతగ్గుదలను చూపుతుంది. అలాంటి సందర్భంలో రైల్వేవారి అశ్రద్ధ లేదనీ, ప్యాకింగ్ నియమాలను సరిగా అనుసరించలేదనీ చూపవలసిన బాధ్యత ప్రతివాదులపై ఉంది. ప్రతివాదులు ఆ బాధ్యతను నిర్వహించలేదు. రైల్వే రవాణా ఛార్జీల దామాషాతో పాటు కొనుగోలు ఇన్‌వాయిస్ ప్రకారం తగ్గుదల సరుకు ధరనూ, 10శాతం మామూలు లాభాన్ని క్లెయిమ్ చేస్తున్నట్లు క్లెయిమ్ నోటీసు వెల్లడిస్తున్నది. తగ్గుదల ఉచిత ప్రమాణం మార్కెట్ ధర అని సుప్రీమ్‌కోర్టు నిశ్చయించింది. కొనుగోలు ధరకు 10శాతం లాభాన్ని కలిపి మార్కెట్ ధరను నిర్ణయించగలం (చూడండి ఎ.ఐ.ఆర్.1961 పాట్నా 107) కాబట్టి చేసిన క్లెయిమ్ (సముచితమూ) హేతుబద్ధమైనదని నేను భావిస్తున్నాను.

రైల్వేచట్టం ఉద్దేశించినవిధంగా ప్రతివాదులకు నోటీసు ఇవ్వడం జరిగింది. ఎగ్జిబిట్లు ఎ-4 నుంచి ఎ-6వరకు తపాలాశాఖవారి తిరుగు రసీదులు. లిఖితపూర్వకమయిన స్టేట్ మెంటులో లేవనెత్తిన వాదనలు విచారణకు పరిగణించ దగినవి కావు. ప్రార్థన మేరకు ఖర్చులతో పాటు దావా డిక్రీ ఇవ్వడమయింది.

సంక్షిప్త లేఖకుడు నా ఉక్తలేఖనాన్ని టైపు చేయగా, నేను సరిదిద్ది, ఈ 1983వ సం.రం ఫిబ్రవరి నెల 28వ రోజున బహిరంగంగా కోర్టులో నేను వెల్లడించాను.

(సంతకం)
ఎన్. నరసింహా రాజు
అదనపు జిల్లా మునసబు
విజయనగరం.

సాక్ష్యానుబంధం
పరీక్షించిన సాక్షులు

వాది తరపున: ప్రతివాది తరపున:

వా.సా.-1. శ్రీ మజీద్ ఎవరూలేరు

మార్కు అయిన పత్రాలు

వాది తరపున:

ఎగ్జిబిట్ ఎ-1/4-5-81. కొనుగోలు ఇన్‌వాయిస్ ప్రతి.

ఎగ్జిబిట్ ఎ-2/26-5-81. తగ్గుదల ధ్రువీకరణపత్రం ప్రతి.

ఎగ్జిబిట్ ఎ-3/1-6-81. న్యాయవాది నోటీసు ఆఫీసు కాపీనకలు

ఎగ్జిబిట్ ఎ-4/3-6-81. తపాలాశాఖ వారి తిరుగు రసీదులు

" ఎ-5/ "

" ఎ-6/ "

ప్రతివాదుల తరపున:

ఏమిలేవు.

(సంతకం.)
ఎన్.నరసింహా రాజు
అదనపు జిల్లా మునసబు
విజయనగరం.

- సరైన నకలు -

(సంతకం.)
ఎఫ్.ఎ.సి. జిల్లా న్యాయము
విజయనగరం.

# 14.

# జిల్లా మునసబు కోర్టు, మిర్యాలగూడా

## జిల్లా మునసబు కోర్టులో

హాజరు: శ్రీ కె.వెంకట్రామయ్య, బి.ఎ; బి.ఎల్.,
జిల్లా మునసబు

1984వ సంవత్సరం, జూలై నెల 25వ తేదీ, బుధవారం

స్మాల్ కాజ్ దావా నెం7/1983.

గుడిపాటి రామయ్య............................................................వాదికీ

1. బమనాల కృష్ణయ్య

2. గుండా సాయిలు.............................................................ప్రతివాదులకూ

మధ్య :

వాది అడ్వొకేటు అయిన శ్రీ ఎమ్.నరసింహారెడ్డి, మొదటి ప్రతివాది సమక్షంలో రెండో ప్రతివాది ఏకపక్ష నిర్ణయానికి కట్టుబడి ఉండగా విచారణ ఈ రోజు వరకు ఉండి 9–7–1984 తేదీన తీర్పు నిమిత్తం నావద్దకు వచ్చిన ఈ దావాపై కోర్టు ఈ కింది తీర్పు ఇవ్వడమైంది.

తీర్పు

1) వాదితో ప్రతివాదికి ఉన్న వ్యవహారాల దృష్ట్యా, ప్రతివాది దగ్గరి నుంచి రావలసిన రూ.360/–లు ఖర్చులతో రాబట్టుకోడానికి వాది దావా దాఖలు చేశాడు.

2) దావాపత్రంలో సంక్షిప్తంగా ఈ కింది అభియోగాలు ఉన్నాయి:– వాది మూడు రిక్షాలకు యజమాని. కొంతమంది రిక్షాలాగేవాళ్ళకు వాటిని నెలవారి బాడుగకు ఇచ్చేవాడు. మొదటి ప్రతివాది ఆ రిక్షాల్లో ఒక్కదాన్ని బాడుగకు తీసుకొన్నాడు. ఒక సంవత్సరం పాటు నెలనెలా రూ.67/–లు చొప్పున చెల్లించిన తరవాత అది అతని సొంతమవుతుంది. ఈ పద్ధతికి మొదటి ప్రతివాది అంగీకరించి రిక్షాను 1–1–1982 తేదీన తీసుకొన్నాడు. సంవత్సరం దాటిపోయినా అతను తాను అంగీకరించిన మొత్తం డబ్బును

కట్టలేదు. చివరకి 7-3-1983 తేదీన తాను ఇంకా రూ.334/-లు చెల్లించవలసి ఉన్నదని అంగీకరించి, వాది దగ్గరున్న ఖాతాపుస్తకంలో సరిచేసి దానిమీద సంతకం చేశాడు. ఈ వ్యవహారానికి సంబంధించిన నమోదులు ఖాతాపుస్తకం 10, 89వ పుటల్లో ఉన్నాయి. ఖాతా పుస్తకం నకలు ఒకటి పరిశీలనార్థం దాఖలు చేయడమైంది. ఈ పైన చెప్పిన వ్యవహారానికి పూచీదారుగా రెండో ప్రతివాది ఉన్నాడు. ప్రస్తుతం.. ఆ రిక్షాను కాజేయాలనే దురుద్దేశంతో మొదటి ప్రతివాది రిక్షాను మాదిగ వెంకటికి అప్పగించాడు. ఇప్పుడు ఆ రిక్షా శరత్‌బాబు ఆసుపత్రి దగ్గర ఉన్నది., అతను (వెంకటి) సుందర్‌నగర్ లో ఉంటాడు. ఇద్దరు ప్రతివాదులు ఆ రిక్షాని తిరిగి వాదికి అప్పగించవలసి ఉంది లేదా రూ.360/-లు సంవత్సరానికి 12 శాతం వడ్డీతో చెల్లించవలసి ఉంటుంది. మొదటి ప్రతివాది రిక్షాతో సహా ఈ కోర్టు స్థానిక పరిధుల నుంచి వెళ్ళిపోవాలని ప్రయత్నం చేస్తున్నాడు. ఈ విషయాలే మిర్యాలగూడ కోర్టులో దావా దాఖలా చేయటానికి కారణాలయాయి. ప్రతివాది ఈ క్లెయిమ్‌కు జవాబు చెప్పవలసి ఉంది. ఈ దావా రూ.360/- కిమ్మత్తు గలది. దానిమీద ఇంకా ఆం.ప్ర. కోర్టుఫీజు సెక్షన్ 20 దావా కిమ్మత్తుల చట్టం కింద రూ.28-80ల కోర్టు ఫీజు కూడా చెల్లించడమైనది.

3) మొదటి ప్రతివాది ఈ కింది విధంగా లిఖితపూర్వక స్టేట్‌మెంటు దాఖలు చేశాడు. వాఙ్మూలం ఇచ్చాడు:- మొదటి ప్రతివాది రిక్షాను రూ.804/-ల వెలకు వాది దగ్గరి నుంచి కొనుక్కొన్నాడు. ఈ రూ.804/ -లు 12 నెలల్లో తీర్చవలసి ఉంది. ప్రతివాది ఒప్పందపత్రం వాది పేర రాసిన తరవాత రిక్షాను తీసుకున్నాడు. మొదటి ప్రతివాది మొత్తం డబ్బును చెల్లించటం జరిగింది. ఆ తరవాత అతను ఈ రిక్షాను వెంకటయ్య అనే అతనికి రూ.625/-లకు అమ్మాడు. అప్పుడు వాది ఈ విషయాన్ని పోలీసులకు రిపోర్టు చేశాడు. కానీ పోలీసులు రిక్షాని మొదటి ప్రతివాదికే తిరిగి అప్పగించవలసిందిగా వాదిని ఆదేశించారు. ఇప్పుడు వాది దావాపత్రం లో ఉదాహరించిన డబ్బును వసూలు చేసుకోటానికి కోర్టులో దావా వేశాడు. రిక్షాకు సంబంధించి వాది తీసుకొన్న డబ్బును తెలిపే ఖాతా పుస్తకాన్ని ఇందుమూలంగా దాఖలు చేయడమైంది.

4) విచారణలో వాదిని వాదితరపు సాక్షి-1గా విచారించడం జరిగింది. అతను ఎగ్జిబిట్లు ఎ-1 నుంచి ఎ-3వరకు పత్రాలు దాఖలు చేశాడు. మొదటి ప్రతివాది ప్రతివాదితరపు సాక్షి-1 నుంచి 3 వరకు హాజరు పరిచాడు.

5) వాదితరపు సాక్షి-1 చెప్పిందేమిటంటే.. తనే వాదిననీ, తాను ప్రతివాది దగ్గరి నుంచి రూ.370/-లు ఖాతా వ్యవహారాలననుసరించి రాబట్టుకోడానికి ప్రతివాది మీద దావా వేసినట్లు చెప్పాడు. మొదటి ప్రతివాది నెలకు రూ.67/-లు చొప్పున ఒక సంవత్సరం పాటు చెల్లించాలి. అప్పుడే మొదటి ప్రతివాది రిక్షాయజమాని అవుతాడు. మొదటి ప్రతివాది రూ.334/-లు చెల్లించాడు. ఇంకా రూ.334/-లు వాదికి చెల్లించాలి. మొదటి ప్రతివాది 7-3-1983 తేదీన లెక్కలు సరిచూసుకొని ఖాతా పుస్తకంలో సంతకం చేశాడు. ఎగ్జిబిట్ ఎ-1 ఖాతా పుస్తకం. ఎగ్జిబిట్ ఎ-2 అనేది ఎగ్జిబిట్ ఎ-1 లోని పేజీ నెం 89. ఎగ్జిబిట్ ఎ-1 పేజీనెం.10లో మొదటి ప్రతివాది 1-1-1982తేదీన నెలకు

రూ.67/–లు చొప్పున చెల్లించటానికి అంగీకరించాడు. ఎగ్జిబిట్ ఎ–1లోని పేజీనం.10 ఎగ్జిబిట్ ఎ–3. మొదటి ప్రతివాది 7–3–1983 తేదీ తరవాత కొంత కూడా డబ్బు చెల్లించలేదు. వడ్డీకి, ఖర్చులకు గాను రూ.26/–లు చెల్లించాల్సి ఉంది. అందుచేత ఈ మొత్తం డబ్బు మొదటి ప్రతివాది దగ్గరినుంచి రావలసి ఉంది. ఈ వ్యవహారానికి రెండో ప్రతివాది పూచీదారు. మొదటి ప్రతివాది అందజేసిన తరవాత మాదిగ వెంకటి స్వాధీనంలో ఉన్న ఆ రిక్షా ఇప్పుడు కోర్టు తీర్పుకు అధీనమై ఉన్నది.

క్రాసుపరీక్షలో 7–3–1983 తేదీ తరవాత మొదటి ప్రతివాది ఏమీ చెల్లించలేదని సాక్షి తెలిపాడు. మొదటి ప్రతివాది మొత్తం డబ్బు చెల్లించాడనీ, తను తప్పుడు సాక్ష్యం చెప్తున్నాడనీ కోర్టువారు ఆరోపించినప్పుడు ఆ సాక్షి నిరాకరించాడు. దావా డబ్బుకు సంబంధించి మొదటి ప్రతివాది రూ.1000/–లు చెల్లించాడని చెప్పింది కూడా అతను తిరస్కరించాడు.

6) ప్రతివాదితరఫు సాక్షి–1 చెప్పిందేమిటంటే....అతను ఒక రిక్షా కార్మికుడు. సుమారు 2 సంవత్సరాల కిందట వాది రిక్షాను రూ.800/– లకు ప్రతివాదికి అమ్మాడు. వాది, ప్రతివాదులిద్దరూ ఈ రూ.800/–లు మొదటి ప్రతివాదికి ప్రతినెలా రూ.67/–ల చొప్పున వాయిదాల పద్ధతిని చెల్లించేటట్లు అంగీకరించారు. మొదటి ప్రతివాది ఈ రూ.67/–లు ఏ నెల నుంచి మొదటి వాయిదాగా వాదికి చెల్లించాలి అనే విషయం తెలియదు. మొదటి ప్రతివాది రూ.67/–, రూ.67/–లు రెండుసార్లు చెల్లించాడు. ప్రతివాది రూ.67/–లు, రూ.67/–లు ఏ ఏ నెలల్లో చెల్లించాడో తనకు తెలియదని చెప్పాడు.

సాక్షిక్రాసుపరీక్షలో అతను చెప్పిందేమిటంటే––మొదటి ప్రతివాది రూ.67/–లు, రూ.67/– లు చెల్లించినట్లు వాది దగ్గరి నుంచి రసీదు తీసుకోలేదు. కానీ ప్రతివాది నోట్ పుస్తకంలో వాది సంతకం తీసుకొన్నాడు. వాది రిక్షాను ప్రతివాదికి అమ్మినట్లు సాక్ష్యాధారంగా ఉన్న పత్రంపై వాది సంతకం పెట్టాడు. నరసింహం దీన్ని ధ్రువీకరించే అనుబంధ సాక్షి, వాది ఏ రిక్షాను ప్రతివాదికి అమ్మినట్లు, మొదటి ప్రతివాది వాదికి ఎలాంటి డబ్బు చెల్లించనట్లూ కోర్టువారు సూచించగా ఆ సూచనను కాదన్నాడు, ప్రతివాదితరఫు సాక్షి

7) ప్రతివాదితరఫు సాక్షి–2 తను రిక్షా కార్మికుణ్ణని చెప్పకొన్నాడు. అతను చెప్పిందేమిటంటే...మొదటి ప్రతివాది రిక్షాను వాది దగ్గరి నుంచి రూ.804/–లకు ఒక సంవత్సరం కిందట కొనుగోలు చేశాడు. నెలకు రూ. 67/–ల చొప్పున మొదటి ప్రతివాది వాయిదాల పద్ధతి చెల్లించేటట్లు రెండు పార్టీలవారు అంగీకరించారు. ఏ నెల నుంచి రూ.67/–ల నెల చెల్లింపు మొదలయ్యేది అతనికి తెలియదు. మొదటి ప్రతివాది రెండుసార్లు రూ.67/–లు రూ.67/–లు వాదికి చెల్లించాడు. అయితే ఏ,ఏ నెలల్లో పైన చెప్పిన రూ.67/–లు, రూ.67/–లు చెల్లించాడో అతనికి తెలియదు.

సాక్షి క్రాసుపరీక్షలో వాది ప్రతివాదికి రిక్షా అమ్మినట్లు దస్తావేజులు రాసింది

కృష్ణమూర్తి అనే అతను అని చెప్పాడు. ఆ దస్తావేజులో మొదటి ప్రతివాది నెలకు రూ.67/–ల చొప్పున ఒక సంవత్సరం పాటు వాదికి చెల్లించాలి అని రాసి ఉన్నది. ఆ దస్తావేజును ఇతను ధ్రువీకరించాడు. ప్రతివాది రూ.67/–లు వాదికి రెండుసార్లు కడుతుండగా ఇతను చూశాడు. మొదటి ప్రతివాది వాది దగ్గరి నుంచి రూ.67/–లు, రూ.67/–లు, అమ్మకం మొత్తంలో భాగంలో చెల్లించినట్లు రసీదులు తీసుకొన్నాడు. ఎటువంటి రిక్షా అమ్మలేదని, మొదటి ప్రతివాది ప్రేరణమీద అసత్యాలు చెప్తున్నావని ప్రశ్నించినప్పుడు అతను వాటిని నిరాకరించాడు.

8) ప్రతివాదితరపు సాక్షి–3 తన వాఙ్మూలంలో....అతను ఒక చిన్న కిరాణా వ్యాపారి. వాది, ప్రతివాదులు సుమారు 2 సంవత్సరాల కిందట తన దగ్గరికి వచ్చి ఒక పత్రాన్ని రాయవలసిందిగా కోరారు. అ పత్రాన్ని రాసింది తనేనని దాంట్లో వాది మొదటి ప్రతివాదికి ఒక రిక్షాను రూ.804/–లకు అమ్మాడనీ అంతేకాకుండా దాంట్లో మొదటి ప్రతివాది వాదికి నెలకు రూ.50/–లు, లేదా రూ.60/– ల చొప్పున అమ్మకం వెల రూపేణా చెల్లించాలి అని ఉన్నది. ఆ దస్తావేజులపత్రం వాది వద్దనే ఉంది.

క్రాసుపరీక్షలో సాక్షి...తను ఆ దస్తావేజుపత్రాన్ని వాదికి అప్పగించినట్లుగా చెప్పాడు. అది ఇప్పుడు ఎవరి స్వాధీనంలో ఉన్నదీ అతనికి తెలియదు. అతని సమక్షంలో మొదటి ప్రతివాది వాదికి పత్రం రాసేటప్పుడుగాని ఇతరత్ర సమయాల్లోగానీ డబ్బు చెల్లించలేదు. ఆ పత్రానికి సాక్షులు సక్రూ, నరసింహులు. ఈ పత్రం సందర్భంగా ఏవిధమైన చెల్లింపులు జరిగిందీ లేనిదీ అతనికి తెలియదు. మొదటి ప్రతివాది హరిజనవాడలో ఉంటున్నాడు. వాది అతనికి తెలిసి ఉండటంవల్ల పైన ఉదాహరించిన పత్రాన్ని రాశాడు. ఈ పత్రం రాసింది ఇతను కాదనీ, అబద్ధాలు చెప్తున్నాడనీ సూచనచేసినప్పుడు, దానిని అతను నిరాకరించాడు.

9) వాది అభ్యర్థించినట్లు అసలు అతను దావా మొత్తానికి అర్హుడా? కాడా? అనేవిషయం ఇప్పుడు నిర్ణయించవలసి ఉంది.

10) దావా పత్రంలోని అభియోగాల ప్రకారం మొదటి ప్రతివాది రిక్షాను వాది దగ్గర నుంచి బాడుగకు తీసుకొని ప్రతినెలా రూ.67/–చొప్పున ఒక సం॥ పాటు వాయిదా రూపంలో చెల్లించటానికి అంగీకరించాడు. ఆ తరవాతే మొదటి ప్రతివాది రిక్షాకు యజమాని అవుతాడు. మొదటి ప్రతివాది దీనికి అంగీకరించి 1–1–1982 తేదీ నాడు వాది దగ్గరి నుండి రిక్షాను తీసుకొన్నాడు. 7–3–1983 తేదీన మొదటి ప్రతివాది లెక్కలు సరిచూసుకొని 7–3–1983 తేదీనాటికి అతను రూ.334/–లు ఇవ్వవలసి ఉన్నట్లుగా తేల్చారు. మొదటి ప్రతివాది ఖాతా పుస్తకంలోని 10, 89 నెంబరు పేజీల్లో సంతకం చేశాడు.

11) ఇది ఇలా ఉండగా..వాదితరపుసాక్షి–1 చెప్పిందేమిటంటే...మొదటి ప్రతివాది నెలకు రూ.67/–ల చొప్పున ఒక సంవత్సరం పాటు చెల్లించాలి. ఆ తరువాతనే మొదటి ప్రతివాది రిక్షాకు యజమాని అవుతాడు. మొదటి ప్రతివాది లెక్కలు సరిచూసుకొని

అకౌంటు ఖాతా పుస్తకంలో సంతకం చేశాడు. ఖాతాపుస్తకం ఎగ్జిబిట్ ఎ-1లోని 89వ పేజీ నంబరే ఎగ్జిబిట్ ఎ-2. ఎగ్జిబిట్ ఎ-3లోని పేజీనంబరు 10లో మొదటి ప్రతివాది 1-1-1982 తేదీన నెలకు రూ.67/- ల చొప్పున చెల్లించేందుకు అంగీకరించాడు. ఎగ్జిబిట్ ఎ-1లోని 10వ పేజీనంబరే ఎగ్జిబిట్ ఎ-3. 7-3-1983 తేదీ తర్వాత మొదటి ప్రతివాది ఎలాంటి డబ్బూ చెల్లించలేదు. వడ్డీకి, ఖర్చులకు గాను రూ.26/-లు తోడయింది. పైన ఉదహరించిన రిక్షా కోర్టు తీర్పుకు కట్టుబడి ఉంది.

12) వాదితరఫు సాక్షి-1 ఇతర విషయాలతో పాటు చెప్పిందేమిటంటే... ప్రతివాది వాది దగ్గరి నుంచి రూ.800/-లకు రిక్షా కొన్నాడు. వాది మొదటి ప్రతివాదికి నెలసరి వాయిదాలలో రూ.67/-ల చొప్పున రూ.800/-లు చెల్లించాలన్న విషయాన్ని మొదటి ప్రతివాదీ, వాదీ ఒప్పుకున్నారు. రూ.67/-లు చెల్లించే మొదటి నెలసరి వాయిదా ఏ నెల నుంచి మొదటి ప్రతివాది వాదికి చెల్లించాలన్న విషయం అతనికి తెలియదు. మొదటి ప్రతివాది రూ.67/-, రూ.67/- లువాదికి ఏఏ నెలల్లో చెల్లించాడో అతనికి తెలియదు. ఆ విధంగా మొదటి ప్రతివాది వాదికి దావా మొత్తం డబ్బు కట్టినట్లూ, అతను కట్టవలసింది ఇక ఏమీ లేదనే మొదటి ప్రతివాది చెప్పుకొన్న విషయాన్ని ప్రతివాది తరఫుసాక్షి-1 సాక్ష్యం బలపరచడం లేదు.

13) ప్రతివాదితరఫు సాక్షి-2 కూడా చెప్పిందేమిటంటే...సుమారు ఒక సంవత్సరం కిందట మొదటి ప్రతివాది రూ.804/-లకు రిక్షాను వాది వద్దనుంచి కొన్నాడు. రూ.67/-ల చెల్లింపు ఏ తేదీ నుంచి మొదలవ్వాలనేది ఆయనకు తెలియదు. మొదటి ప్రతివాది రూ.67/-లు, రూ.67/-లు రెండుసార్లు వాది చెల్లించాడు.

ఈ సాక్షి ఇచ్చిన సాక్ష్యం కూడా మొదటి ప్రతివాది రాతపూర్వకంగా ఇచ్చిన స్టేట్ మెంట్ తో సరిపోవటం లేదు.

14) ప్రతివాదితరఫు సాక్షి-3 చెప్పిందేమిటంటే... సుమారు రెండు సంవత్సరాల కిందట వాది, ప్రతివాదులిద్దరు ఆయనదగ్గరకు వచ్చి ఒక పత్రాన్ని రాయవలసిందిగా కోరారు. వాది తన రిక్షాను రూ.804/-లకు మొదటి ప్రతివాదికి అమ్మినట్లు రాసిన ఆ దస్తావేజుకు ఆయనే లేఖరి. విక్రయ మొత్తానికి గాను నెలకు రూ.50/-లు లేదా రూ.60/-ల చొప్పున మొదటి ప్రతివాది చెల్లించాల్సిందిగా దాంట్లో రాసి ఉంది. పైన ఉదాహరించిన పత్రం వాది వద్దనే ఉన్నది. తన సమక్షంలో మొదటి ప్రతివాది ఆ రోజునగానీ తర్వాతగానీ వాదికి ఎటువంటి డబ్బు ఇవ్వలేదు. ఈ విక్రయ దస్తావేజు సంబంధించి అసలు ఎలాంటి చెల్లింపు జరిగిందీ లేనిదీ ఆయనకు తెలియదు. ఈ వ్యవహారం జరిగినట్లు ఒక పత్రం ఉన్నట్లు ఈ సాక్షి చెప్తున్నప్పటికీ పై ఉదాహరించిన ఆ పత్రం కనిపించటంలేదు.

15) ఈ విధంగా ప్రతివాదితరఫు సాక్షి-1 నుంచి3 వరకు వారు ఇచ్చిన సాక్ష్యాలు మొదటి ప్రతివాది కేసును ఈ విషయంలో బలపరచటం లేదు. 7-3-1983

తేదీన మొదటి ప్రతివాదీ, వాదీ లెక్కలు సరిచూసుకొని సరిచేసుకొన్నట్లు ఎగ్జిబిట్‌లు ఎ-1 నుంచి ఎ-3 పత్రాలు చూపిస్తున్నాయి. ఇంకా మొదటి ప్రతివాది 7-3-1983 తేదీ నాటికి వాదికి రూ.334/-లు ఇవ్వటానికి అంగీకరించాడు. ఈ విధంగా పై సాక్ష్యాలు దావాపత్రంలో ఆరోపించిన అభియోగాలను సమర్థించేవిగా ఉన్నాయి.

16) పై కారణాల వల్ల వాది తన దావా మొత్తానికి అర్హుడుగా నిరూపించుకొన్నాడని నేను భావిస్తున్నాను. ఈ దావా వేయకముందే మొదటి ప్రతివాది వాదికి మొత్తం డబ్బు చెల్లించానని తన లిఖితపూర్వక స్టేట్‌మెంట్‌లో ఇచ్చిన కారణాలు సరి అయినవి, నమ్మదగినవి కావు. అందుచేత నేను ప్రతివాదికి ప్రతికూలంగా వాదికి అనుకూలంగా అంశాన్ని నిర్ణయిస్తున్నాను.

17) పర్యవసానంగా ఈ దావాను ఖర్చులతో వాది అభ్యర్థించినట్లు డిక్రీ ఇవ్వడమైంది. మొదటి ప్రతివాదికి ఈ దావా మొత్తం చెల్లించడానికి రెండు నెలల వ్యవధి మంజూరు చేయడమైంది.

సంక్షిప్త లేఖకునికి చెప్పగా, అతని చేత లిప్యంతరీకరణ చేయించిన తరవాత దాన్ని సరిచేసి, 1984 సంవత్సరం జూలై నెల 25వ తేదీన బహిరంగ కోర్టులో నేను ప్రకటించడమైంది.

సంతకం/-
25-7-1984
జిల్లా మునసబు, మిర్యాలగూడ

## సాక్ష్యాల అనుబంధం

### పరీక్షింపబడ్డ సాక్షులు

వాది తరపున:

వా.సా.-1 గుడిపాటి రామయ్య

ప్రతివాదుల తరపున:

ప్ర.సా-1 బి.సత్రు
ప్ర.సా-2. బి.నరసింహ
ప్ర.సా-3. పి. కృష్ణమూర్తి

### మార్కు అయిన పత్రాలు

**వాది తరపున:**

ఎగ్జిబిట్ ఎ-1 మొదటి ప్రతివాది ఖాతాకు సంబంధించిన అకౌంటు పుస్తకం.

ఎగ్జిబిట్ ఎ-2 ఇ.ఎక్స్.ఎ-1లోని పేజీనంబరు 89.

ఎగ్జిబిట్ ఎ-3. ఇ.ఎక్స్.ఎ-1లోని పేజీనంబరు 10.

**ప్రతివాదుల తరపున:**

--ఏమీ లేవు-

సంతకం/-
25-7-1984
జిల్లా మునసబు, మిర్యాలగూడ

- సరైన నకలు -

సంతకం/-
మునసబు మేజిస్ట్రేట్,
మిర్యాలగూడ.

# 15.

# చిన్నదావాల కోర్టు, ఆదిలాబాదు

చిన్నదావా కోర్టులో

హాజరు: శ్రీ బి.శ్యామ్‌రావు, బి.ఎ., ఎల్.ఎల్.బి.,
జిల్లా మునసబు

1982వ సంవత్సరం, మార్చినెల 8వ తేదీ, సోమవారం

ఎస్.సి.నెం.1/ 1980

దామోదర్ ............................................................ వాదికీ

ఎస్.రాములు ............................................................ ప్రతివాదికీ

మధ్య:

వాది న్యాయవాది అయిన శ్రీ జి. శ్రీహరి గుండావర్, ప్రతివాది న్యాయవాది అయిన శ్రీ నరేంద్ర గార్ల సమక్షంలో విచారణకు ఈరోజువరకు ఉండి 5-3-1982 తేదీన తుది విచారణ నిమిత్తం నావద్దకు వచ్చిన దావాపై కోర్టు ఈ కింది తీర్పు ఇవ్వడమైంది.

తీర్పు

వాది ప్రతివాది దగ్గరి నుంచి రూ.269-19లు దావా పత్రం దాఖలు చేసిననాటి నుంచి డబ్బువసూలు ఇచ్చేనాటి వరకు 12% వడ్డీతో వసూలు చేసుకోవటానికి ప్రతివాది మీద దావా వేశాడు.

2) వాది ఈ కింది ముఖ్యమైన విషయాలతో దావా దాఖలు చేశాడు:- ప్రతివాది వాది దుకాణం నుంచి 1979 వ సం॥ నుంచి అరువుగా బట్టలు కొని వాయిదాల పద్ధతిమీద డబ్బు తిరిగి చెల్లిస్తూ ఉండేవాడు. 1980 దీపావళీ నాటికి ప్రతివాది రూ.178-97లు బాకీ ఉన్నాడు. దావాపత్రం 6వ పేరాగ్రాఫ్‌లో ఉదహరించినట్లు దీపావళీ పండుగ రోజుల్లో 1980 సం॥ డిసెంబరు నెల నుంచి 1981 సం॥ సెప్టెంబరు 26వ తారీఖు మధ్యకాలంలో ఆయన రూ.430-22ల ఖరీదు గల వస్త్రాలను అనేక దఫాల్లో

కొన్నాడు. వాది ఇచ్చిన రసీదు తేదీల ప్రకారం అనేక తేదీల్లో ప్రతివాది కూడా మొత్తం రూ.340లు చెల్లించాడు. ఆయన 1981 సం॥ అక్టోబరు 1వ తేదీన రూ.50/–లు చెల్లించి రసీదు నెం.98 తీసుకొన్నాడు. తత్ఫలితంగా ప్రతివాది ఇంకా రూ.269–19లు చెల్లించవలసి ఉంది. వాది తన న్యాయవాది ద్వారా 1982 సం.॥ జనవరి మొదటి తారీఖున నోటీసు జారీచేశాడు. కాని ప్రతివాది దానికి జవాబు ఇవ్వడంకానీ, వాదికి డబ్బు చెల్లించటం కానీ చెయ్యలేదు. ఈ కింది లెక్కల ప్రకారం ప్రతివాది రూ.269–19లు చెల్లించవలసి ఉంది.

| జమ | | | ఖర్చు | | |
|---|---|---|---|---|---|
| రూ. | రసీదు. | తేదీ. | రూ. | రసీదు. | తేదీ. |
| 50/– | 424 | 30–11–80 | 178.97 | దీపావళి వరకు రావల్సిన బిల్లులు | |
| 30/– | 481 | 31–12–80 | 25/– | 968 | 6–12–80 |
| 40/– | 1419 | 7–9–81 | 21/– | 288 | 14–2–81 |
| 40/– | 1442 | 2–5–81 | 86.35 | 598 | 5–5–81 |
| 40/– | 1493 | 5–6–81 | 44.75 | 623 | 11–5–81 |
| 40/– | 157 | 30–6–81 | 18.12 | 1293 | 16–8–81 |
| 50/– | 43 | 1–9–81 | 24/– | 1344 | 3–9–81 |
| 50/– | 48 | 1–10–81 | 211/– | 1385 | 26–9–81 |

వాది దుకాణం, వ్యాపారం ఆదిలాబాదులో జరుగుతున్నది. ప్రతివాది ఆదిలాబాదులో అప్పుగా వస్త్రాలు కొన్నాడు.

3) ప్రతివాది ఈ కింది విషయాలతో తన లిఖిత స్టేట్‌మెంట్ దాఖలు చేశాడు:– వాది దావాపత్రం 3వ పేరాలోని విషయాలు సత్యమూ సరిఅయినవి. ప్రతివాది రూ.269–19లు వాదికి ఇంకా బాకీ కింద చెల్లించవలసి ఉంది. దావా పత్రంలోని 5,6 పేరాలు సత్యమైనవిగా అంగీకరించడమైంది. ప్రతివాది ఆదిలాబాదు సివిల్ ఆసుపత్రిలో అటెండర్‌గా పనిచేస్తున్నాడు. ఆయన ఒక్కడే ఆయన కుటుంబానికంతకూ జీవనాధారం. ఆయనకు నెలకు రూ.385/–లు జీతం వస్తుంది. ఆయన తను ఇవ్వవలసిన మొత్తాన్ని వాయిదాలపై నెలకు50/-రూ.ల చొప్పున ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడు. మొదటి వాయిదా మార్చినెల 5వ తారీఖు. ఆయన వాయిదాల పద్ధతిమీద అప్పుతీర్చుకోడానికీ, డిక్రీ ఖర్చులు

లేకుండా ఇవ్వవలసిందిగా కోర్టువారిని ప్రార్థిస్తున్నాడు.

4) ఇరు పార్టీలు దాఖలు చేసిన అభ్యర్థనలను పరిశీలించిన మీదట ఈ కింది వాదాంశాలను విచారణ నిమిత్తం స్థిరపరిచి రూపొందించటం జరిగింది.

1) ప్రతివాది ఆయన అభ్యర్థించినట్లు వాయిదాల పద్ధతిమీద అప్పుతీర్చుకోడానికి అర్హుడా?

2) ఏ పరిహారానికి అర్హుడు?

5) వాదాంశం నెం.1:- ప్రతివాది వాదిదగ్గర నుంచి అనేక దఫాలుగా రూ.430.22 కిమ్మత్తు చేసే వస్త్రాలు కొన్నట్లూ వాది ఖాతాప్రకారం ప్రతివాది రూ.340/-లు, రూ.50/- చెల్లించినట్లూ, పోగా రూ.269/-లు ఇంకా బాకీ ఉన్నట్లు వాది వాదన. ప్రతివాది కేసును అంగీకరించాడు. అయితే తను ఆదిలాబాదు, సివిల్ ఆసుపత్రిలో అటెండర్‌గా పనిచేస్తున్నట్లూ, తన కుటుంబమంతకూ తనొక్కడే జీవనాధారమనీ, తన జీతం నెలకు రూ.385/-లు మాత్రమే ఉండడంవల్ల బాకీ చెల్లింపుకు వాయిదాలను ఇప్పించవలసిందిగా అభ్యర్థించాడు. బాకీ పూర్తిగా తీరేటంతవరకు నెలకు రూ. 50/-ల చొప్పున వాయిదాల రూపంలో చెల్లించే విధంగా డిక్రీ ఇవ్వవలసినదిగా ప్రార్థించాడు. ఈ విషయంలో రుజువు చేసే భారం ప్రతివాది మీదే ఉన్నది. ప్రతివాదితరపు సాక్షి-1 గా ప్రతివాదిని పరిశీలించడమైంది. వాది క్లెయిం చేసిన విషయాన్ని అంగీకరిస్తూ ప్రతివాది లిఖితపూర్వక స్టేట్‌మెంట్ దాఖలు చేసినట్లు చెప్పాడు. తనకువచ్చే జీతం మూలవేతనం నెలకు రూ.385 /-లు. ఆయన తన 5గురు పిల్లలను, భార్యను పోషించవలసి ఉంది. తనకువచ్చే ఈ అతితక్కువ జీతంతో దావా మొత్తం అప్పు ఒకేసారి తీర్చుకోలేనని, నెలకు రూ. 75/-లు చొప్పున వాయిదాల పద్ధతి మీద తీర్చుకొనేటట్లుగా అవకాశం ఇమ్మని కోర్టువారిని కోరాడు. వాదితరపుసాక్షి-1 అయిన వాది ఈ విషయాన్ని నిరాకరించాడు. అయితే అశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ప్రతివాదిని ఈ విషయంలో వాది (కోర్టులో) ఛాలెంజ్ చేయలేదు. ఆయన్ని ఈ విషయంలో ఈ కారణంగా క్రాసుపరీక్ష చేయలేదు. వాది అడ్వొకేటుగారు ప్రతివాదికి నెలకు రూ.75/-లు చెల్లించేవిధంగా వాయిదాలు ఇవ్వటానికి అంగీకరించారు. పైన ఉదహరించిన అంశాల ఆధారంగా ప్రతివాది దావామొత్తం అప్పు తీరేంతవరకు వాదికి నెలకు రూ.75/-ల చొప్పున వాయిదాలపైన చెల్లించవలసిందిగా నేను నిర్ణయిస్తున్నాను. మొదటి వాదాంశం ఈ విధంగానే నిర్ణయించడమైంది.

6) పర్యవసానంగా వాది దావాను ఖర్చులతో డిక్రీ చేయడమైంది. ప్రతివాదిని నెలకు రూ.75/-ల చొప్పున వాయిదాల పద్ధతి మీద రూ.269-19లు చెల్లించటానికి అనుమతించడమైంది. ప్రతివాది ఏ ఒక్కవాయిదా మొత్తం అయినా చెల్లించకపోతే మొత్తం డబ్బును ఒకేసారి రాబట్టుకోడానికి వాదికి హక్కు ఉంది.

ప్రతివాది దావా మొత్తానికి 100కి సం॥నికి రూ.6/-ల చొప్పున దావా తేదీ నుంచి మొత్తం డబ్బు తీరేటంతవరకు భవిష్యత్ వడ్డీ వాదికి చెల్లించవలసి ఉంది.

నేను చెప్పిన దానికి టైపిస్టు టైపు చేయగా, దాన్ని సరిచేసి 1982 సం॥ మార్చి నెల 8వ తేదీన బహిరంగ కోర్టులో తీర్పు ప్రకటించడమైంది.

సంతకం/–
8–3–82
జిల్లా మునసబు
ఆదిలాబాదు.

సాక్ష్యం అనుబంధం
పరీక్షించిన సాక్షులు

వాదితరపున:

వా.సా–1 దామోదర్

ప్రతివాది తరపున:

ప్ర.సా.–1 ఎస్.రాములు

మార్కు అయిన పత్రాలు

వాది తరపున:

ఎగ్జిబిట్ ఎ–1 నోటీసు కాపీ నకలు

ఎగ్జిబిట్ ఎ–2 అందినట్లు రసీదు

ప్రతివాది తరపున:

– ఏమీ లేవు–

సంతకం/–
జిల్లా మునసబు
ఆదిలాబాదు

–సరైన నకలు–

సంతకం/–
మున్సిఫ్ మేజిస్ట్రేట్
ఆదిలాబాదు

# 16.

## జిల్లా మునసబు కోర్టు, ఖమ్మం

### జిల్లా మునసబు కోర్టులో

హాజరు: శ్రీ టి. రామచంద్రారెడ్డి, బి.ఎ., ఎల్.ఎల్.బి.
జిల్లా మునసబు, ఖమ్మం

శుక్రవారం ఆగస్టునెల 7వ తారీఖు 1981
ఎస్.సి.ఎస్.నెం.52/1979

ఎ.నటరాజన్, కమీషనర్, ప్రత్యేక అధికారి ద్వారా ఖమ్మం మున్సిపల్ కౌన్సిల్ ............................వాదికీ

చల్లా వీరయ్యగారి కుమారుడు చల్లా వెంకయ్య, వయస్సు 50 ॥ లు, దర్జీ, కొంకిలల్ల చంద్రశేఖరం బట్టల దుకాణం దగ్గర, కమాన్ బజారు, ఖమ్మం............ ప్రతివాదికీ.

మధ్య:

వాది న్యాయవాది అయిన శ్రీ ఎమ్.వి.వరదాచారీ, ప్రతివాది న్యాయవాది అయిన శ్రీ బి. సుందర్‌లాల్ గార్ల సమక్షంలో 17.7.81 తేదీన నావద్దకు విచారణ నిమిత్తం వచ్చిన ఈ కేసు రికార్డులోని విషయాలను పరిశీలించినమీదట కోర్టు తీర్పు కింది విధంగా చేయడమైంది.

### తీర్పు

రావలసిన ఆస్తిపన్ను రూ.213–09లను రాబట్టడానికి ప్రతివాదిపై ఖమ్మం మునిసిపల్ కౌన్సిల్ దాఖలు చేసిన దావా ఇది. వారి వాదన ప్రకారం ప్రతివాది ఖమ్మంలో 5–1–94 నంబరు ఇంటి యజమానీ స్వాధీనదారు. ఆయన 1976–77, 1977–78, 978–79 సంవత్సరాలకు ఆస్తిపన్ను బకాయి పడ్డారు.ఆయనకు నోటీసుద్వారా 15 రోజుల వ్యవధి ఇచ్చినా కూడా అది (బకాయిడబ్బు) చెల్లించలేదు. వాది నోటీసు ఖర్చులకు గాను రూ.7–50లు రావలసినట్లు కూడా కోరారు.

2) ప్రతివాది తనుదాఖలు చేసిన స్టేట్‌మెంటులో ప్రస్తుతం దావాలో ఉన్న ఇల్లు

చాలా పాతదని అది శిథిలావస్థలో ఉన్నదనీ, వంటింటి కప్పు ఇప్పటికే కూలిపోయిందనీ తెలియజేశారు. లోగడ ఈ ఇంటికి అర్థ సంవత్సరానికి రూ.3/–లు మాత్రమే పన్ను ఉంది. కానీ వాది తన ఇష్టానుసారం పన్ను సంవత్సరానికి విపరీతంగా రూ.41/–ల పైచిలుకుకు పెంచారు. ఈ పెరుగుదల సరిఅయిన విచారణ లేకుండా, చట్టవిరుద్ధంగా చేసింది కాబట్టి తను పాతపన్నును మాత్రమే చెల్లించటానికి సిద్ధంగా ఉన్నాడు.

3) ప్రస్తుతం విచారణ చేయవలసింది వాదికి తనకు రావాల్సిన మొత్తాన్ని రాబట్టకొనేందుకు హక్కు ఉన్నదా అన్నది.

4) వాది తన తరపు సాక్షి (వా.సా–1) అయిన మునిసిపాలిటీ బిల్ కలెక్టర్ షేక్ జానీమియానీ పరీక్షించగా వారు ఖమ్మం మునిసిపాలిటీలో 5వ వార్డులోని 5–1–94 నెంబరు గల ఇంటియజమాని అయిన ప్రతివాది పన్నుబకాయి కింద, నోటీసు ఖర్చుల కిందా మొత్తం రూ. 213–00లు బాకీ ఉన్నట్లు వివరించారు. పైన పేర్కొన్న మొత్తం చెల్లించవలసిందిగా ప్రతివాదికి యథావిధిగా నోటీసు పంపడమైంది. ప్రతివాది నోటీసు ముట్టినట్లుగా తెలిపారు గానీ ఎంతోకొంత పైకం కూడా చెల్లించలేదు.

5) ప్రతివాది సాక్షి (ప్ర.సా.–1) తెలిపినట్లు ప్రతివాది తన ఇల్లు వందసంవత్సరాల పురాతనమైదనీ, అది శిథిలావస్థలో ఉన్నదనీ, తనకు ఎటువంటి నోటీసు ముందుగా ఇవ్వకుండానే పన్ను పెంచారనీ వివరించారు.

6) ఈ దావాలో ప్రతివాది పన్ను పెంపుదలను గురించి వివాదం చేయగూడదని వాది తరపు న్యాయవాది వాదించారు. ప్రతివాది మునిసిపాలిటీని అభ్యర్థిస్తూ విజ్ఞాపన పంపుకోడం లేదా పన్ను తగ్గించుకోడానికి సరి అయిన కోర్టులో సివిల్ దావా వేయడం మాత్రమే చేయవలసిన పని.

7) ప్రతివాది తన క్రాసుపరీక్షలో తనను దావా పైకం చెల్లించవలసిందిగా వాది జారీచేసిన నోటీసు తనకు ముట్టినట్లు అంగీకరించారు. పన్ను తగ్గించే నిమిత్తం మునిసిపాలిటీకి దరఖాస్తు పెట్టకొన్నట్లూ కానీ దాని ఫలితం తెలియనట్లు కూడా ఆయన అంగీకరించాడు. ప్రతివాది పన్ను పెంపుదలకు వ్యతిరేకంగా తత్సంబంధిత అధికారి ముందు దరఖాస్తు పెట్టుకోవలసి ఉంది. కానీ పెరుగుదల అన్యాయమనో లేదా ఇష్టానుసార చర్యఅనో దావాను అతను విరోధించలేదు. నోటీసు ఇచ్చినా కూడా ప్రతివాది బకాయిపైకం చెల్లించలేదని, డిమాండు నోటీసుకు వ్యతిరేకంగా అభ్యర్థనగానీ దావా కానీ పెట్టుకోలేదనీ రూఢిగా తెలుస్తున్నది. దావా ఇంటిపై పన్ను విధింపు నిర్ధారణ విషయమై చర్చించటానికి ఈ దావాలో అవకాశంలేదు. అందుచేత ఈ వాదాంశం వాదికి అనుకూలంగా నిర్ణయిస్తున్నాము.

8) తత్ఫలితంగా పర్యవసానంగా వాది దావా ఖర్చులతో డిక్రీ ఇవ్వడమైంది.

షార్ట్‌హాండ్ లేఖకునికి చెప్పి రాయించడమైంది. అతను లిప్యంతరణం చేయగా బహిరంగంగా న్యాయస్థానంలో 1981వ సంవత్సరం ఆగస్టు నెల 7వ తేదీన ప్రకటించడమైంది.

సంతకం/–
జిల్లా మునసబు
ఖమ్మం

సాక్ష్యం అనుబంధం
పరీక్షించిన సాక్షులు

వాది తరపున:

వా.సా–1 షేక్ జానీమియా

ప్రతివాది తరపున:

ప్ర.సా.–1 చల్లా వెంకయ్య

మార్కు అయిన పత్రాలు

ఏమీ లేవు.

సంతకం/–
జిల్లా మునసబు,
ఖమ్మం.

–సరైన నకలు–

సంతకం/–
మున్సిఫ్ మేజిస్ట్రేటు,
ఖమ్మం.

# ప్రధాన జిల్లా మునసబు కోర్టు, కడప

ప్రధాన జిల్లా మునసబు కోర్టులో

హాజరు : శ్రీ ఆర్.ఎన్. నిరంజన్ దేశాయ్, ఎం.ఎ., ఎల్.ఎల్.బి.
ప్రధాన జిల్లా మునసబు.

1984వ సంవత్సరం, అక్టోబర్ నెల 25వ తేదీ గురువారం.

చిన్నదావా నెం.1/82

కాసుల నారాయణ ................................................ వాదికీ

బి. రమేష్ కుమార్ ................................................ ప్రతివాదికీ

మధ్యః

వాది ఈరోజువరకు పరిశీలనలో ఉండి 22.10.84 తేదీన న్యాయవాది అయిన శ్రీ.పి.తిరుపాల్ చెట్టి, ప్రతివాది న్యాయవాది అయిన శ్రీ పి. సీతారామయ్యగార్ల సమక్షంలో తుది విచారణకు నావద్దకు వచ్చిన దావాపై కోర్టు కింది తీర్పు ఇవ్వడమైంది.

తీర్పు

వాది కింది ఆరోపణలతో దావా దాఖలు చేశారు. ముఖ్యంగా చేసినది ఏమిటంటేః– ప్రతివాది 9–1–80 తేదీ నుంచి 22.6.80 తేదీ వరకు ఇంటి.నం. 13/44 తన ఇంట్లో నెలకు రూ.80/–ల చొప్పున అద్దె చెల్లించే పద్ధతి మీద ఉంటున్నాడు. కరెంటు ఛార్జీలు కూడా చెల్లించటానికి ప్రతివాది అంగీకరించాడు. ప్రతివాది ఇల్లు ఖాళీచేసేనాటికి 621 యూనిట్ల కరెంటు వినియోగించుకొన్నాడు. యూనిట్ ఒక్కంటికి 0.48పైసల చొప్పున 621 యూనిట్లకు రూ.298.08 లు, మీటర్ ఛార్జీలు రూ.12.00 మొత్తం కలపి రూ 310.09 చెల్లించాల్సి ఉంది. వాది ప్రతివాదికి ఈ సొమ్ము చెల్లించవలసిందిగా 31.1.81 తేదీనాడు నోటీసు జారీ చేశాడు. కాని ప్రతివాది సొమ్ము చెల్లించలేదు. ప్రతివాది సన్నకారు రైతుకాదు, వ్యాపారస్తుడు మాత్రమే. అందువల్లనే ఈ దావా దాఖలు చేయడమైంది.

2) ప్రతివాది లిఖితపూర్వక స్టేటుమెంటు దాఖలా చేశాడు. దాంట్లో ఆయన

చెప్పిందేమిటంటే, వాది దావాపత్రంలో ఆరోపించినట్లు ప్రతివాది వాది ఇంట్లో కిరాయి దారుగా ఇంటి తాళంచెవులు 22.6.80 తేదీన వాదికి అప్పగించినా, ప్రతివాది 1980 ఏప్రిల్ నెలలోనే మోపెడ్ల స్టాకును వేరే భవనంలోకి మార్చటం జరిగింది. అందువల్ల 1980సం. మే, జూన్ మాసాలకు కరెంటు వినియోగమే లేదు. అదీగాక 22.6.80 తేదీన వాదికి ఇల్లు అప్పగించేటప్పుడు ప్రతివాది రూ.1000/–లు అడ్వాన్సును వాదికి ఏప్రిల్ నెలవరకు కరెంటుఛార్జీలు, బల్బుల నిమిత్తం చెల్లించగా, ఈ ఖర్చులను లెక్క చూసుకొని తిరిగి ప్రతివాదికి రూ.557–62లు వాది చెల్లించడం జరిగింది. ఆ సమయంలో వాది 1980 సం. ఏప్రిల్ నెల కరెంటు బిల్లు చెల్లించినట్లుగా ప్రతివాదికి రసీదు కూడా ఇచ్చాడు. అటు తర్వాత వాది 1980 మే, జూన్ నెలల కరెంటు ఛార్జీలు చెల్లించి ప్రతివాది దగ్గరి నుంచి ఆ సొమ్మును కూడా పొందాడు. వాది ఈ రెండు రసీదులూ ప్రతివాదికి ఇచ్చాడు., కానీ ప్రతివాది 1980 మే నెల రసీదు పోగొట్టుకొన్నాడు. 1980 జూలై నెలలో ఉపయోగించిన కరెంటుకు ప్రతివాది ఎలా బాధ్యుడో అర్థం కావటం లేదు. అలాగే తరవాత నెలల్లో వసూలు అయిన కరెంటు ఛార్జీలు ముందునెలల్లో వసూలు కాకుండా ఉండడం ఎలా జరుగుతుందో కూడా అర్థంకావడం లేదు.

ప్రతివాది రాజస్థాన్‌లోని తన స్వగ్రామానికి ప్రయాణం అవబోతుండగా కోర్టు నోటీసు రావటంవల్ల జవాబు ఇవ్వలేకపోయినా ప్రతివాది తిరిగి వచ్చిన తరువాత వాదిని కలుసుకొని రసీదులు చూపించటం జరిగింది. వాది సంతృప్తి పడ్డాడు. అందుచేత ఈ ప్రతివాదికి ప్రతికూలమైన ఏ నిర్ణయం చేయకూడదు. కనుక ఈ దావాను ఖర్చులతో కొట్టివేయాలి.

4) ఇప్పుడు నిర్ణయించవలసిన వాదాంశం ఏమిటంటే–వాది దావా మొత్తానికి అర్హుడా; అయితే ఏ పరిహారానికి అని. ప్రతివాది దగ్గరి నుంచి రూ.300/–లు వసూలు చేసుకోవడానికి వేసిన దావా ఇది. దావాపత్రంలో ముఖ్యంగా చెబుతున్నదేమిటంటే, 621 యూనిట్ల కరెంటు ఉపయోగించుకొన్నందుకు ప్రతివాది వాదికి రూ 298.08లు చెల్లించాల్సి ఉంది., అలాగే రూ.12/– మీటర్ ఛార్జీలు కలుపుకొని మొత్తం రూ.310–08లు అవుతుంది. వాది ఈ రూ.300/– వరకు అభ్యర్థిస్తున్నాడు. ఇది చిన్నదావా కాబట్టి పై అంశాన్ని నిర్ణయించడానికి విపులంగా చర్చించవలసిన అవసరం లేదు. పై 4వ పేరాగ్రాఫులో వాది 1979 డిసెంబరు నెల నుంచి 1980 జూలై నెలవరకు మీటర్ లెక్కలకు సంబంధించి తెలిపినప్పటికీ ఈ అంశాన్ని పట్టించుకోనక్కరలేదు. ఎందుకంటే దావాపత్రం 3వ పేరాగ్రాఫులో 9.1.80 నుంచి 22.6.80 వరకు ప్రతివాది వాది ఇంటి కిరాయిదారుగా ఉన్నట్లు తెలిపాడు. ప్రతివాది కూడా తన లిఖితపూర్వక స్టేటుమెంటులో ఈ విషయాన్ని కాదనలేదు.

5) ఈ కేసు దావాపత్రంలో ఉదహరించినంత కాలం ప్రతివాది వాది ఇంటి కిరాయిదారుగా ఉన్న విషయం ప్రతివాది నిరాకరించలేదు. పైగా వాది చెప్పిన యూనిట్ కు 0.48 పై. ఛార్జి అన్న విషయం కూడా ప్రతివాది అభ్యంతరం చెప్పలేదు. ఈ పరిస్థితిలో అద్దెచీటి అయిన ఎగ్జిబిట్. ఎ4 పత్రం గురించి అంతగా చర్చించవలసిన అవసరంలేదు.

6) ఈ కేసులో వాది తరపున ప్రతివాదితరపు సాక్షి ప్ర.సా–1నుంచి3 వరకు పరీక్షించడం జరిగింది. వా.సా–3 వాదితరపు సాక్షి–3 వాదే అయినందున ఆయన దాఖలుచేసిన ఎగ్జిబిట్ ఎ1 నుంచి ఎ6 పత్రాలవరకు గుర్తించడమయింది. అలాగే ప్రతివాది తరపున ప్రతివాదినే ప్ర.సా–1గా పరీక్షించడం జరిగింది. ఆయన దాఖలు చేసిన ఎగ్జిబిట్–బి1 నుంచి బి3 పత్రాలు గుర్తించడమైంది.

7) వా.సా–1 ఎలెక్ట్రిసిటీ రెవిన్యూ కార్యాలయంలో సహాయ గణాంక అధికారి ఈయన వద్దనుంచి ఆవర్జా సారాంశం అయిన ఎగ్జిబిట్ 1 ప్రతి గుర్తించడమయింది. వా.సా–2 కడపలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఎలక్ట్రిసిటీ బోర్డులో పనిచేస్తున్న అదనపు సహాయ ఇంజినీర్. వీరి వద్దనుంచి కరెంటు వినియోగపు విషయాలకు సంబంధించి కార్యాలయ కరెంట్ రీడింగ్ రిజిస్టర్ ఆధారంగా హెచ్.ఎస్.సి.నెం.11675 పై గుర్తించడమయింది. ఎగ్జిబిట్ ఎ1–సర్వీస్ కనెక్షన్ నెం.11675 వినియోగించుకొన్న కరెంటుకొలమానం (యూనిట్లలో), చెల్లింపుల విషయాలు చూపుతుంది. దాంట్లో 1979 డిసెంబరు నెల నుంచి 1980 జూలై నెల వరకు ఉన్నాయి. 1979 డిసెంబరు, 1980 జనవరి, ఫిబ్రవరి, మే నెలల్లో వినియోగించుకొన్న కరెంటు వివరాలు మాత్రమే ఉన్నాయి. 1980 మార్చినెలకు కరెంటు కొలత దాంట్లో లేదు. అలాగే 1980మే, జూన్, జూలై నెలల్లో ఇంటికి తాళం వేసినట్లు రాసి ఉంది. ఇక సొమ్ము చెల్లించే విషయానికి వస్తే, 1979 డిసెంబరు నెలకు రూ.28–65, 1980 జనవరికి రూ.10–75, ఫిబ్రవరికి రూ.11–90, మార్చికి రూ.7/–లు, ఏప్రిల్ నెలకు రూ 59–05పై. మే నెలకు రూ.7–00 జూన్ నెలకు రూ 7–00, జూలైనెలకు రూ8–50 కట్టినట్లు చూపిస్తున్నది. ఎగ్జిబిట్ ఎ2 1979 డిసెంబరు నెల నుంచి 1980 జూలై నెలవరకు వాడిన కరెంటును సూచిస్తుంది. దీంట్లో 1979 డిసెంబరు నెలకు 62 యూనిట్లు, 1980 జనవరి నెలకు 18యూనిట్లు, ఫిబ్రవరికి 23యూనిట్లు, మార్చినెలకు సమాచారం లేదు., అలాగే ఏప్రిల్ నెలకు 142 యూనిట్లు, మేనెలకు 200 యూనిట్లు, జూన్ నెలకు 215 యూనిట్లు, జూలై నెలకు 206 యూనిట్లు వాడినట్లు సూచించింది. ప్రతివాది కరెంటు ఉపయోగించినట్లు, డబ్బు చెల్లించినట్లు చూపించే, కోర్టులో హాజరు పరిచిన ఈ రెండు పత్రాలూ ఎగ్జిబిట్ ఎ1, ఎ2లు చాలా ముఖ్యమైనవి. వాది తరపు వాదించే న్యాయవాది ఈ పై పత్రాలను ఆధారంగా చూపిస్తూ వాదన చేసినదేమిటంటే...ఎగ్జిబిట్–ఎ1 ద్వారా 1980మే, జూన్ నెలల్లో ఇంటికి తాళం వేసినట్లుగా రాసి ఉంది., అయితే ఎగ్జిబిట్ ఎ2లో మే నెలకు 200 యూనిట్లు, జూన్ నెలకు 215యూనిట్లు వాడినట్లు ఉంది. అంటే దానివల్ల ఏం తెలుస్తున్నదంటే కరెంటు కార్యాలయ ఉద్యోగుల్ని ఏదోవిధంగా మంచి చేసుకొని, వాళ్ళ సహాయంతో ఆయా నెలలకు 'తాళం వేసి ఉంది' అని ఎగ్జిబిట్ ఎ1లో ఉన్నట్లు రాయించి, ప్రతివాది తాను వాడిన కరెంటుకు కరెంటు కార్యాలయానికి డబ్బు చెల్లించలేదు. ఆ విధంగా వాడిన కరెంటుకు డబ్బు చెల్లించకుండా మోసం చేశాడు. అందువల్ల వాది తన దావాపత్రంలో చెప్పినట్లు ప్రతివాది తను వాడుకొన్న కరెంటుకు సొమ్ము చెల్లించలేదనేది నమ్మవలసి ఉంటుంది. కానీ ఈ పరిస్థితిలో నేను చెప్పదలచుకొన్నదేమిటంటే ఎగ్జిబిట్ ఎ1, ఎ2 పత్రాలలో "1979 డిసెంబరు నెలనుంచి 1980 జూలై నెలాఖరు వరకు" అనిరాసి ఉన్నప్పటికీ 1979

డిసెంబరు నెలా, 1980 జూలై నెలలను పరిశీలనలోకి తీసుకోవాల్సిన అవసరం లేదు. ఎందుకంటే వాది తన దావాపత్రంలోనే ప్రతివాది 1980 జనవరి నుంచి 1980జూన్ వరకు తన ఇంట్లో కిరాయిదారుగా ఉన్నట్లు రాశాడు కాబట్టి. అందుచేత వాది ఇంట్లో ప్రతివాది కిరాయిదారుగా ఉన్నకాలానికి మాత్రమే వాది అభ్యర్థనను పరిశీలనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. ప్రతివాది 22.6.80 తేదీనాడే ఇంటి తాళాలను వాదికి అప్పజెప్పినట్లూ కాని నిజానికి 1980 ఏప్రిల్ నెల నాటికే తాను మోపెడ్‌స్టాకు మొత్తాన్ని ఆ ఇంటి ఆవరణ నుంచి తరలించినట్లూ చెప్తున్నప్పటికీ దాన్ని నమ్మేందుకు ప్రతివాది దాఖలు చేసిన సాక్ష్యం ఏదీలేదు కాబట్టి ఆ తరవాత నుంచి కరెంటు వాడకం జరగలేదనే ప్రతివాది వాదనను నమ్మటానికి వీలులేదు.

8) ఈ కేసులో వాది ఇచ్చిన నోటీసును., దానికి ప్రతివాది జవాబు ఇవ్వక పోవటం., ఇతర పరిస్థితులు, తర్వాత ఎగ్జిబిట్.ఎ1 నుచి ఎ3 పత్రాలు ఆధారంగా చూపటం., ఇవ్వన్నీ ఇప్పుడున్న పరిస్థితిలో ప్రతివాది ఎంతవరకు సమర్థించుకోగలడో చూడవలసి ఉంది. ఈ కేసులో వాది ఎగ్జిబిట్ ఎ5 నోటీసును జారీ చేసినట్లు అంగీకరించడమైంది. దీనికి సంబంధించిన ఎగ్జిబిట్ ఎ6 అయిన తపాలా రసీదును గురించి చర్చించడం అనవసరం. దావా మొత్తం డబ్బుకోసం ఇచ్చిన ఎగ్జిబిట్.ఎ1 నోటీసుకు ప్రతివాది జవాబు ఇవ్వని మాట నిజం. ఇంకా ఈ కేసుకు సంబంధించి...ప్రతివాది దావా ఇంటి ఆవరణను వదిలి వెళ్లిన తరవాత రతన్‌చంద్ అనే అతను వచ్చి ఆ ఇంట్లోకి చేరాడు. ఆయన కరెంటుకు గాను రూ.309/–లు చెల్లించి రసీదు ఎగ్జిబిట్ ఎ3 ఇవ్వడమైంది. ఈ సందర్భంలో ఎగ్జిబిట్.ఎ3 కి సంబంధించి చెప్పవలసి ఉంటుంది.

9) ఈ ఎగ్జిబిట్ ఎ3ని రతన్‌చంద్ అనే అతను ఈ వాదికి ఇచ్చాడు. ఈ కేసులో రతన్‌చంద్‌ను సాక్షిగా విచారించలేదు. అందుచేత ఈ ఎగ్జిబిట్ ఒక పత్రంగా మాత్రమే ఉండిపోయింది.. ఇది వాది నమ్మించటానికి చేసిన ఎగ్జిబిట్ ప్రయత్నంగా చెప్పుకోవచ్చు. అందుచేత ఈ ఎగ్జిబిట్ ఎ3కు ఎటువంటి విలువ ఇవ్వనక్కరలేదు. అలాగే ఎగ్జిబిట్ నుంచి బి3ల పత్రాల ప్రాముఖ్యాన్ని గురించికూడా ఇక్కడే చర్చించవలసి ఉంది. ఇవి ప్ర.సా–1 ద్వారా గుర్తింపు చేసినవి. 1980 ఏప్రిల్ నెలలో రూ.59–05పైలు కరెంటు బిల్లు చెల్లించినట్లు తెలిపే రసీదు ఎగ్జిబిట్ బి1; అలాగే 1980 జూన్ నెలలో రూ.7/–లు చెల్లించినట్లు తెలిపేది ఎగ్జిబిట్ బి2., అలాగే ఎగ్జిబిట్ బి1 కి వెనకవైపున ఏవో కొన్ని లెక్కలువేసి వానిమీద ధ్రువీకరించినట్లు తెలిపేది ఎగ్జిబిట్ బి3. ప్రతివాది ఎగ్జిబిట్ బి1 నుంచి బి3 వరకు ఉన్న పత్రాలను ఇక్కడ అనుసంధించి వాటిని తన వాదబలానికి ఉపయోగించుకొంటున్నట్లు చెప్పటం అవసరం. ప్రతివాది తన లిఖితపూర్వక స్టేటుమెంటు చెప్పిందేమిటంటే,–ప్రతివాది వాదికి రూ.1000/–అడ్వాన్సుగా ఇచ్చాడు. ప్రతివాది ఇల్లు ఖాళీచేసి 26–6–80 తేదీన ఇంటిని వాదికి అప్పగించేటప్పుడు వాళ్లు లెక్కలు చూసుకొన్నారు. అప్పుడు ఆ సమయంలో వాది బల్బులకు, తర్వాత 1980 ఏప్రిల్ నెలవరకు కరెంటు ఛార్జీలు అన్నీ లెక్క చూసుకుని ఆయనే ఎగ్జిబిట్ బి1 రసీదు ప్రతివాదికి ఇచ్చాడు. తదనంతరం కూడా ప్రతివాది మే, జూన్ నెలలకు కూడా

చెల్లించాడు., అయితే జూన్ నెల రసీదు ఉన్నది కానీ 1980 మే నెల రసీదు మాత్రం తాను (ప్రతివాది) పోగొట్టుకొన్నాడు. ఇప్పుడు ఈ సందర్భంలో ఎగ్జిబిట్ బి3 పత్రం ప్రాముఖ్యాన్ని గమనించవలసి ఉంటుంది. ఎగ్జిబిట్ బి1 రసీదుకు వెనుకవైపున వేసిన ఏవోకొన్ని లెక్కలను చూపించేది ఎగ్జిబిట్ బి3, రసీదు పత్రం. కానీ ఎగ్జిబిట్ బి3 రసీదు చూసినతర్వాత ప్రతివాది చెల్లించవలసిన కరెంటు ఛార్జీడబ్బు మినహాయించుకొన్నట్లు లేదు. పై ఎగ్జిబిట్ బి3 పై రాసిన లెక్కలు తన బావమరది రాసినవేనని ప్రతివాది ప్ర.సా.-1 క్రాసుపరీక్షలో స్పష్టంగా అంగీకరించాడు. ఇంకా వాది సాక్షిబోనులోకి వచ్చినప్పుడు ప్రతివాది ఎగ్జిబిట్ బి3 గురించి వాదిని తన న్యాయవాది ద్వారా క్రాసుపరీక్ష చేయించలేక పోయానని కూడా ప్రతివాది ఒప్పుకొన్నాడు. పై పరిస్థితులు ఆధారంగా ఈ ఎగ్జిబిట్ బి3కి ఎటువంటి విలువ ఇవ్వనవసరంలేదని వాది తరపు న్యాయవాది వాదించారు. వీటి ఆధారంగా ఆ వాదనలో చాలా బలమున్నది. తరవాత ఈ కేసులో ఎగ్జిబిట్-ఎ1 పత్రంలో రాసినట్లు, 'ఇల్లు తాళం వేసి ఉన్నది' అన్న విషయం గురించి ప్రతివాది సరిఅయిన ఆధారాన్ని చూపించలేకపోయాడు. (దీని గురించి అవసరమైనచోట చర్చించటమైంది) గుర్తింపు చేసిఉన్న ఎగ్జిబిట్ బి1, బి2లు ప్రతివాది కేసును మెరుగుపరచలేక పోతున్నాయి.

10) 1979 డిసెంబరునెల, 1980జూలై నెలల పరామర్శ ఈ కేసు సాక్ష్యాల ఆధారంగా వచ్చినప్పటికీ ఈ కాలంలో ప్రతివాది వాది ఇంట్లో ఉన్నకాలంలో భాగంలేదు గనుక దీన్ని గురించి చర్చించటం అనవసరం.

11) ముఖ్యంగా ఎగ్జిబిట్ ఎ1, ఎగ్జిబిట్-ఎ2 పత్రాలమీదే ఆధారపడవచ్చునని నేను అనుకొంటున్నాను. వాటి ఆధారంగా ప్రతివాది కరెంటు ఉపయోగించిన కాలం, వాడుకొన్న కరెంట్ యూనిట్లు, అతను ఎంతవరకు కరెంటు ఛార్జీలు చెల్లించాడు అనే విషయాలన్నీ లెక్కలు కట్టవచ్చు. తరవాత విషయమేమిటంటే ఎగ్జిబిట్ ఎ1 పత్రం ద్వారా వాది ప్రతివాది దగ్గరి నుంచి ఎంత సొమ్ముకు అర్హుడై ఉన్నాడో కూడా తెలుసుకోవచ్చు. 1980 మే నెలలో తలుపుకు తాళం వేసి ఉన్నట్లు దాంట్లో స్పష్టంగా రాసి ఉంది. అలాగే 1980 జూన్ నెలలోకూడా తలుపుకు తాళం వేసి ఉన్నట్లూ, పై రెండు నెలలకూ నెలకు రూ.7/-లు చొప్పున రూ.14/-లు మొత్తం కరెంటు బిల్లు చెల్లించినట్లూ ఉంది. కానీ ఎగ్జిబిట్ ఎ2 పత్రం ఆధారంగా చూస్తే 1980 మే నెలలో ప్రతివాది 200 యూనిట్లను వినియోగించుకొన్నట్లు స్పష్టంగా ఉంది. అలాగే 1980 జూన్ నెలలో ప్రతివాది 215 యూనిట్ల కరెంటు వాడుకొన్నాడు. నిజంగా ప్రతివాది కరెంటును వినియోగించుకోకుండా ఉన్నట్లయితే మొత్తం 415 యూనిట్లు వాడుకొన్నట్లు నమోదు అయ్యే అవకాశమే ఉండేదికాదు. అందువల్ల ప్రతివాది తను ఈకాలంలో కరెంటును ఉపయోగించుకోలేదని చెప్పిన దాన్ని నేను విశ్వసించటం లేదు. ఇక మిగిలిన అంశం ఏమిటంటే..ప్రతివాది ఎన్ని ఇతరనెలలకు కరెంటు బిల్లు బాకీ ఉన్నాడూ అన్న విషయం. 1980 సం.జనవరి నెలకు చూపిన కరెంటు వినియోగం 18 యూనిట్లు, అలాగే 1980 సం.ఫిబ్రవరి నెలకు చూపిన కరెంటు వినియోగం 23 యూనిట్లు అలాగే ఏప్రిల్ నెలకు చూపిన కరెంటు వినియోగం 142 యూనిట్లు, మొత్తం కలిపి 183 యూనిట్లు అయ్యాయి. ఈ 183

యూనిట్లను 415 యూనిట్లకు కలిపితే మొత్తం 598యూనిట్లు అవుతాయి.

దావా పత్రంలో ప్రతివాది బాకీ ఉన్నది 621 యూనిట్లుగా చూపించినప్పటికీ, ఈ ఎగ్జిబిట్ ఎ2ను కూడా తీసుకొన్నట్లయితే కరెంటు వినియోగం 866 యూనిట్ల దాకా పోతుంది. నేను లోగడ చెప్పినట్లుగా దావాపత్రంలో ఉదహరించినట్లు ప్రతివాది ఉండని 1979 సం. డిసెంబరు నెల, 1980 సం. జూలై నెలను చర్చలో నుంచి తొలగించి వాది క్లెయించేసిన దానికి మాత్రమే పరిమితం చేస్తున్నాను. ఆవిధంగా ఎగ్జిబిట్ ఎ1, ఎ2 పత్రాలలో వినియోగించుకొన్నట్లు చూపిస్తున్న కరెంటు యూనిట్లు, చేసిన డబ్బు చెల్లింపులను బట్టి 598 యూనిట్ల దాకా కరెంటు వినియోగించుకొన్నట్లు తెలుస్తుంది. ఒక్కో యూనిట్‌కు కరెంటు ఛార్జి ఎంతచెల్లించాలి అనే విషయంలో ప్రతివాదివైపు నుంచి ఎటువంటి అభ్యంతరం లేనందువల్ల ఒక్కో యూనిట్‌కు 0.48 పై. చొప్పున మొత్తం అలాగే లెక్కవేయవలసి ఉంటుంది. ఈ విధంగా లెక్కచేస్తే యూనిట్ ఒక్కంటికి 0.48పై. చొప్పున 598 యూనిట్లుకు రూ.287.04 పై. అవుతుంది. తరవాత దీనికి సంబంధించి ప్రతివాది మీటర్ ఛార్జీలు నెలకు రూ.2/–లుచొప్పున చెల్లించాలన్న విషయం కూడా ప్రతివాది నిరాకరించలేదు. 1980 సం. జనవరినెల నుంచి 1980 సం.జూన్ నెలవరకు ఇది లెక్కకడితే 1980 రూ.12/– లు అవుతుంది. ఈ 12 రూపాయలను 287–04రూపాయలకు కలిపితే 299–04 రూపాయలు అవుతుంది. కానీ ఈ కేసులో ఎగ్జిబిట్.ఎ1 పత్రం, వినియోగించుకొన్న కరెంటుకు చేసిన చెల్లింపుల గురించి స్పష్టంగా చూపుతుంది. చెల్లించిన పైకం అనే వరసలో ఇది చూపుతుంది. దీంట్లో చూపుతున్న వాటిని లెక్కగట్టి మొత్తం తేల్చాలి. 1980 సం. జనవరి నెలకు చెల్లించిన పైకం రూ.10–75, ఫిబ్రవరికి చెల్లించినది రూ.11–90, మార్చికి చెల్లించినది రూ.7/–, ఏప్రిల్ నెలకు చెల్లించిన పైకం రూ.59.05, మే నెలకు రూ.7/–, జూన్ నెలకు రూ.7/—, ఈ మొత్తాలన్నింటిని కలిపితే రూ.102.70 అవుతుంది. నిస్సందేహంగా ఈ కరెంటు ఛార్జీలు శాఖవారికి చెల్లించటం జరిగింది. ఈ సందర్భంలో ప్రతివాది తన లిఖితపూర్వక స్టేట్‌మెంటులో ప్రస్తావించిన అభ్యర్థనను గమనించవలసి ఉంది. నిజంగానే ప్రతివాది 1980 సం. ఏప్రిల్ నెలకు ముందు నెలలు కరెంటు ఛార్జీలు కట్టకపోయినట్లయితే కరెంటు శాఖవారు అవి కట్టించుకోకుండా తర్వాత 3నెలల కరెంటు ఛార్జీలు ఎలా కట్టించుకొని ఉంటారు అని ప్రతివాది అన్నారు. కానీ వా.సా–1 క్రాసుపరీక్షలోని సాక్ష్యమే దీనికి సమాధానం అవుతుంది. కరెంటు బకాయీలు ఏమైనా ఉన్నాకూడా వాటిని పరిశీలించకుండా వినియోగదారులు చెల్లించే కరెంటు ఛార్జీలు చెల్లింపులను మొదలకుండా ఆమోదిస్తామని వా.సా.1 చెప్పారు. అందువల్ల ఈ సాక్ష్యాధారంవల్ల ప్రతివాది లేవనెత్తిన వాదనను సమర్థించలేం. వాది కోర్టుకు సమర్పించిన సాక్ష్యాధారాలను గమనించినట్లయితే.. ప్రతివాది వాది అభ్యర్థనను నిరోధించడానికి ప్రయత్నించి, కరెంటు కార్యాలయానికి చెల్లింపుల విషయంలో ఒక పంథా అవలంబించలేకపోవడంవల్ల ఈ కేసులో ప్రతివాది వాదనను తగినస్థాయిలో సమర్థించడానికి వీలులేదు. ఎగ్జిబిట్ ఎ పత్రాలు 1,2 పరిశీలించినా కూడా ప్రతివాది కరెంటు కార్యాలయం వారికి కరెంటు ఛార్జీలు చెల్లించవలసింది రూ.287–04 పై. కాగా, అతను చెల్లించింది రూ.102–70పై. మాత్రమే అయింది.

ఈసందర్భంలో 1980 సం. మార్చినెల కరెంటు రీడింగ్ గురించి నేను చెప్పవలసి ఉంది. ఎగ్జిబిట్ ఎ-2 పత్రంలో 1980 సం. మార్చి నెల రీడింగ్ ఇవ్వలేదు. కానీ ఎగ్జిబిట్.ఎ1 పత్రంలో 1980 సం. మార్చినెలలో రూ.7/-లు చెల్లించినట్లు చూపిస్తున్నది. ఈ నెలకు ఇంతే అయిందని భావించాల్సి ఉంటుంది. ప్రతివాది చెల్లించవలసిన డబ్బు రూ.7/-లు మాత్రమే అయిందని అనుకోవాలి. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొనే పైవిధంగా లెక్కలు కట్టారు. ఆవిధంగా రికార్డులో ఉన్న సాక్ష్యాన్ని అనుసరించి చూస్తే ప్రతివాది రూ.102.70 పై.లు మాత్రమే చెల్లించాడు. నా లెక్కలో ప్రతివాది ఈ విషయంలో రూ.299.04 లు మాత్రమే వాదికి ఇవ్వవలసి ఉన్నాడు. ప్రతివాది వాదికి లోగడ చెల్లించిన పైకాన్ని మినహాయిచుకొని మిగతాదాన్ని వాదికి చెల్లించవలసి ఉంటుంది. ఆవిధంగా రూ.299.04 నుంచి రూ.102.70లు మినహాయించుకొని మిగతా డబ్బు రూ.196-34 మాత్రమే ప్రతివాది వాదికి చెల్లించాలి. కాబట్టి ఈ కేసులో వాదికి ప్రతివాది దగ్గిరి నుంచి రూ.196-34లు మాత్రమే రాబట్టుకొనే హక్కు ఉంటుంది.

12) పర్యవసానంగా ఈ దావాలో రూ.196-34(అక్షరాలా నూట తొంభై ఆరు రూపాయల ముప్పైనాలుగు నయాపైసలు) మాత్రమే వాదికి డిక్రీ ఇవ్వటమైంది. తరవాత ప్రతివాది వాదికి దామాషా ఖర్చులు మాత్రమే ఇవ్వవలసిందిగా ఆదేశించడమైనది.

1984వ సంవత్సరం, అక్టోబరు నెల 25వ తేదీన సంక్షిప్త లేఖకునికిచెప్పి రాయించి లిప్యంతరణం చేసిన తరవాత నేను సరిచేసి ఈ బహిరంగ న్యాయస్థానంలో ఈ తీర్పు ప్రకటించటమైంది.

సంతకం/-
ఆర్.ఎన్.నిరంజన్ దేశాయ్
ప్రధాన జిల్లా మునసబు,
కడప.

సాక్ష్యం అనుబంధం

పరీక్ష జరిగిన సాక్షులు.

వాది తరఫున:

వా.సా1:-జె.వెంకటరమణ
వా.సా.2:- రామచంద్రా రెడ్డి
వా.సా3:- నారాయణ

ప్రతివాది తరఫున:

ప్ర.సా 1: బి.రమేశ్ కుమార్

## మార్కు అయిన పత్రాలు

**వాదితరపున :**

ఎగ్జిబిట్.ఎ1:– కడపలోని ఎస్.సి.నెం.11675లో కరెంటు వినియోగపు, డబ్బుచెల్లింపులు తెలిపే అవర్జా సారాంశం.

ఎగ్జిబిట్ ఎ2:– హెచ్.ఎస్.సి.నెం.11675 కరెంటు వినియోగ విషయాలు తెలిపే రీడింగ్ రిజిస్టర్ సారాంశం.

ఎగ్జిబిట్.ఎ3/ 29.2.81 రతన్‌చంద్ జారీచేసిన రూ.309/–ల స్టాంపు వేసిన రసీదు.

ఎగ్జిబిట్ ఎ4./9.1.81 వాది ప్రతివాదులు రాసుకొన్న రిజిస్టర్డ్ అద్దెచీటీ పత్రం.

ఎగ్జిబిట్ ఎ5/17.1.81 వాది న్యాయవాది ప్రతివాదికి జారీ చేసిన నోటీసు కార్యాలయ ప్రతి.

ఎగ్జిబిట్ ఎ6/2.2.81 తపాలా శాఖవారి తిరుగు రసీదు.

## గుర్తించబడిన పత్రాలు

**వాదితరపున :**

ఎగ్జిబిట్ బి1/16.6.80 1980 సం. ఏప్రిల్ నెలకు 59.05 రూపాయలు చెల్లించినట్లు 13241 నెంబరు గల కరెంటు బిల్లు రసీదు.

ఎగ్జిబిట్ బి2/11.8.80. 1980 సం.జూన్ నెలకు రూ.7–00– చెల్లించినట్లు 7106 నెంబరుగల కరెంటు బిల్లు రసీదు.

ఎగ్జిబిట్.బి3./తేదీలేదు. ఎగ్జిబిట్ బి:1 వెనకవైపున వేసిన కొన్ని లెక్కలపైన చేసిన ధ్రువీకరణ.

సంతకం/–
ఆర్.ఎన్.ఎన్.దేశాయ్
ప్రధాన జిల్లా మునసబు

–సరైన నకలు–

సంతకం
ప్రధాన జిల్లా మునసబు, కడప.

# జిల్లా మునసబు కోర్టు, యెల్లారెడ్డి

## జిల్లా మునసబు కోర్టులో

హాజరు: శ్రీ.కె. దేవీ ప్రసాద్, బి.ఎస్.సి., ఎల్.ఎల్.బి.,
జిల్లా మునసబు, యెల్లారెడ్డి.

1985 సం. జనవరి నెల 30వ తేదీ
ఒ.ఎస్.నెం. 94/1980

రామచంద్రగౌడ్ కుమారుడు సందూరి మధుసూదన్ గౌడ్, హిందువు, వయస్సు 19సం. వృత్తి: వ్యవసాయం, యెల్లారెడ్డి తాలూకాలోని మాల్తుమ్మెద గ్రామం....................వాదికీ

రాసయ్య కుమారుడైన గూడల హనుమంతు, హిందువు, వయస్సు 45సం.లు వృత్తి: వ్యవసాయం యెల్లారెడ్డి తాలూకాలోని మాల్తుమ్మెద గ్రామం......................... ప్రతివాదికీ

మధ్య :

వాది న్యాయవాది అయిన శ్రీ.కె.మురళీధరరావు, ప్రతివాది న్యాయవాది శ్రీ ఎల్ లక్ష్మయ్య గార్ల సమక్షంలో ఈ రోజున నావద్దకు అంతిమ నిర్ణయం నిమిత్తం వచ్చిన ఈ దావాను విచారించిన మీదట కోర్టు ఈ కింది విధంగా తీర్పు ఇవ్వడమైంది.

తీర్పు

1) ప్రతివాది దగ్గిరి నుంచి రూ.2500/–ల నష్టపరిహారం వసూలు చేసుకొనే నిమిత్తం వాది వేసిన పరిహార దావా ఇది. వాది చెప్పుకొన్నవిషయాలు ఈ కింది విధంగా ఉన్నాయి.

సర్వేనం.429లోని 3 ఎకరాల 39గుంటల విస్తీర్ణంగల మెట్టపొలమూ, వాది నిర్మించిన మత్తడి వాది స్వాధీనహక్కు భుక్తాలలోవి. 11.3.80 తేదీనాడు రూ.2400/–లకు రంగమ్మ రిజిస్టర్ చేసిన విక్రయదస్తావేజు మూలంగా వాది దావా భూమిని కొనుగోలు చేశాడు. ఆ దావా భూమిని కొన్ననాటి నుంచి అది వాది స్వాధీనంలోనే ఉంది. విక్రయ దస్తావేజు ఒ.ఎస్.నెం.63/80 దాఖలయి కోర్టు పరిశీలనలో ఉన్నది. దావా భూమిని వాది స్వాధీన పరచుకొంటున్నప్పుడు ప్రతివాది అడ్డగించి మత్తడిని నాశనం చేయటంవల్ల ఈ దావా

వేయడమైంది. దావా భూమికి తూర్పున చివరగా బోయినవానివాగు ఉన్నది. వర్షాకాలంలో వృథాగా నీరు పారుతుంది. దావా భూమిని అభివృద్ధి పరచటానికి వాది సిమెంటు, రాళ్ళతో 13 అడుగుల పొడవు $11\frac{1}{2}$ అడుగుల వెడల్పు, భూమికి $4\frac{1}{2}$అడుగుల ఎత్తున ఒక మత్తడిని నిర్మించాడు. మత్తడి నుంచి నీళ్ళు పారటానికి వీలుగా ఒక అలుగు కూడా కట్టాడు. దాని నుంచి వాది దావా భూమికి నీళ్లు అవసరమైనప్పుడు వినియోగిస్తున్నాడు. ఆవిధంగా వాది మత్తడిని కట్టి తన భూమిని సేద్యం చేయటానికి నీళ్లు మళ్ళిస్తున్నాడు. ఈ సర్వేనంబర్‌లోని సుమారు $2\frac{1}{2}$ఎకరాల భూమిలోని 15 మళ్ళల్లో వరి పంటా, పడమర పొలం చిట్టచివర్లో కొంత భాగంలో తోగరి (పప్పు) పంట వేసి మిగతా 5 గుంటల భూమిని వ్యవసాయానికి పనికి రానందున సేద్యంలేకుండా బీడుగా వదిలివేశాడు. వాది మత్తడి ద్వారా 15మళ్ళకు నీరుపెట్టుకొంటూ వరి పంటవేశాడు. దావాభూమితో గానీ మత్తడితోగాని ఎలాంటి స్వాధీన, హక్కులూ సంబంధాలు లేని ప్రతివాది అన్యాయంగా వాదిని నష్టపరచాలనే దురుద్దేశంతో మత్తడిని కూల్చి నాశనంచేసి దావా భూమి సరిహద్దు గట్లు తొలగించి మత్తడిని నామరూపాలు లేకుండా చేయడంవల్ల వాదికి నష్టం వాటిల్లింది. దీనివల్ల దావాభూమికి పడమరవైపున్న 15 మళ్ళల్లోని 10 మళ్ళకి నీటిపారుదల తగ్గి వరిపంట దెబ్బతిని వాదికి రూ.2500/– వరకు నష్టం కలిగింది. దావా భూమిని స్వయంగా తనిఖీ చేసే నిమిత్తం ఒక కమీషన్‌ను వేస్తూ, ఈ కమీషన్ 10మళ్ళల్లో ఎండిపోయి నిలిచిన వరిపంటను తెలియజేస్తూ సరిఅయిన దావా భూమి రూపచిత్రణ మానచిత్రం(Sketchmap) వేసి ప్రతివాది అన్యాయంగా మత్తడిని సర్వనాశనం చేయటంవల్ల కలిగిన నష్టాన్ని అంచనా వేయాల్సిందిగా కోరుతూ వాది అభ్యర్థన కూడా దాఖలు చేశారు. అందువల్లనే ఈ దావా వేయటం జరిగింది.

ప్రతివాది ఈ కింది లిఖితపూర్వక స్టేట్‌మెంట్ దాఖలు చేశాడు. దావా భూమి తాలూకు స్వాధీన హక్కుదారు వాదేనని అంగీకరించటమైంది. కానీ మత్తడి దావా భూమిలో ఉన్నదనీ, దాన్ని వాది నిర్మించాడనీ నిరాకరించడమైంది. వాది దాఖలు చేసిన రూపచిత్రణ మానచిత్రం ప్రకారం మత్తడి వాగులో ఉన్నట్లు స్పష్టం. దానిమీద వాదికి గానీ ప్రతివాదికి గానీ ఎటువంటి హక్కులేదు. అందుచేత ఈ దావా నిర్వహించజాలదు. వాది రిజిస్టర్డ్ విక్రయదస్తావేజుల ద్వారా దావా భూమిని కొన్నట్లు అంగీకరించటమైంది. కాని భూమిని వాది శాంతియుతంగా స్వాధీనం చేసుకొనేటప్పుడు ప్రతివాది అడ్డగించాడని, మత్తడిని నాశనం చేశాడని ఉటంకించిన సంగతులు తిరస్కరించడమైంది. దావా భూమికి తూర్పుదిక్కున బోయినవానివాగు అనే వాగు ఉన్నమాట నిజం. కానీ వాది తన భూమిని అభివృద్ధి చేసుకోవటానికి వాగులో మత్తడిని నిర్మించాడనే సంగతిని తిరస్కరించడమైంది. నీటిపారుదల చట్టం వ్యతిరేకంగా ఏ మత్తడిని కట్టడానికి వాదికి ఎలాంటి హక్కులేదు. ఒకవేళ మత్తడిని కట్టినట్లయితే సరిఅయిన అధికారి దగ్గరి నుంచి అనుమతి తీసుకొని ఉండాల్సింది. మత్తడిని నిర్మించటానికి అటువంటి అనుమతి ఏదీ వాది తీసుకోలేదు. వాగులో సహజంగా పారే నీటిప్రవాహాన్ని ఆపి వాది మత్తడిని నిర్మించగూడదు, అలా చేయటంవల్ల కిందివైపు న్న సేద్యపు భూముల రైతుల నీటిహక్కులకు భంగం ఏర్పడుతుంది. దావా భూమిలో వాది వరిపంట వేయడం వాస్తవమే. దావా భూమిని వాది

స్వాధీనం చేసుకొనేటప్పుడు ప్రతివాది అడ్డగించాడనీ, సరిహద్దురాళ్ళు తొలగించాడనీ వాది ఆరోపించిన సంగతి అసత్యం. రూ.2500/–లు వాది నష్టపోవటం కూడా అసత్యం. తన చర్యకు చూపించిన కారణం అభూతకల్పన. వాది ఆరోపించిన నష్టం నిర్ధారించడానికి ప్రతివాదికి ఎలాంటి నోటీసూ ఇవ్వకుండానే నియమించిన కమీషన్‌కు ప్రతివాది బద్ధుడు కాదు. అందుచేత ఈ కేసు కొట్టివేయవలసిందిగా ప్రార్థించాడు.

పై అభ్యర్థనలననుసరించి ఈ కింది వాదాంశాలను రూపొందించడమైంది.

1) వాది కోరినట్లు నష్టపరిహారానికి అతను హక్కుదారుడా?

2) వాదికి ఏ పరిహారం ఇవ్వవచ్చు?

2) వాదాంశం నెం.1:– వాది తరఫున వా.సా. 1 నుంచి 4 వరకు పరీక్షించి ఎగ్జిబిట్–ఎ1 నుంచి ఎ–5 వరకు పత్రాలను వాది గుర్తింపు చేయించాడు. వాది మధుసూదన్‌గౌడ్ తన తండ్రి రామచందర్‌గౌడ్ పేరిట రాసి ఇచ్చిన రిజిస్టర్డ్ పవర్‌పట్టా–ఎగ్జిబిట్ ఎ–1. సర్వేనెంబరు 429కి సంబంధించి కోర్టువారు నియమించిన కమీషనర్ చేసిన పంచనామా, సర్వేనంబర్ 429లో వరిపంట ఎండిపోవటంవల్ల వాదికి కలిగిన కచ్చితమైన నష్టం గురించిన నిర్ధారిత నివేదిక– ఎగ్జిబిట్ ఎ–2. కమీషనర్ గారి తనిఖీ అనంతరం ఆయన సమర్పించిన దావా భూమిరూప చిత్రణ మానచిత్రం (Sketch map) ఎగ్జిబిట్.ఎ.3. కమీషనర్ గారి నివేదిక ఎగ్జిబిట్.ఎ–4. కమీషనర్ గారికి కోర్టు జారీచేసిన వారంటు ఎగ్జిబిట్.ఎ–5. ప్రతివాది పక్షాన ఉన్న మొదటిసాక్షిని, రెండోసాక్షిని పరీక్షించడం జరిగింది. ఎగ్జిబిట్.బి–1లను గుర్తించడం జరిగింది. వాది ఒ.ఎస్.63/80లో దాఖలు చేసిన మానచిత్రం ఎగ్జిబిట్ బి–1.

3) వా.సా.1. ఇచ్చిన సాక్ష్యం ఏమిటంటే, వాది తన భూమిని అభివృద్ధి పరచుకోటానికి తన సొంతభూమిలో 13 అడుగుల పొడవు, $1\frac{1}{2}$ అడుగు వెడల్పు, $4\frac{1}{2}$ అడుగులు భూమి నుంచి ఎత్తుగల ఒక మత్తడిని సిమెంటు, రాళ్ళతో నిర్మించాడు. పొలానికి నీరు అవసరమైనప్పుడు నీరు మళ్ళించటానికి అతను పైన చెప్పిన మత్తడికి ఒక చిన్న అలుగు కూడా ఏర్పాటు చేశాడు. 1980వ సంవత్సరంలో వాది మత్తడిని నిర్మించి ఆ మత్తడి నుంచి నీళ్ళు తీసుకొని సర్వేనెం. 429 భూమిలో $2\frac{1}{2}$ ఎకరాల వరిపంట వేశాడు. ఎటువంటి హక్కూలేని ప్రతివాది 1980 సం. సెప్టెంబరు 19వ తేదీన మత్తడిని కూలగొట్టి పూర్తిగా నాశనం చేశాడు. అలా నాశనం చేయటంవల్ల వరిపంట వేసిన 15 మళ్ళల్లోని 10 మళ్ళకు నీరు అందక పంట పూర్తిగా ఎండిపోయింది. మిగతా 5 మళ్ళల్లోని వరిపంట పాక్షికంగా దెబ్బతిన్నది. ఆవిధంగా $1\frac{1}{2}$ ఎకరంలోని వరిపంట పూర్తిగానూ, 1 ఎకరంలోని పంట పాక్షికంగానూ ఎండిపోయింది. దీనిమూలంగా వాదికి రూ.2500/–లు నష్టం కలిగింది. అందుచేత వాది నష్టపరిహారం నిమిత్తం ప్రతివాది మీద దావా వేయటం జరిగింది. వాది తనకు కలిగిన నష్టాన్ని నిర్ధారించటానికి ఒక కమీషనర్‌ని నియమించమని కూడా ఒక అర్జీని దాఖలు చేసినట్లు వా.సా–1 తెలియజేశారు. కోర్టువారు ఒక న్యాయవాదిని కమీషనర్‌గా నియమించగా వారు ఆ వివాదస్థలాన్ని తనిఖీచేసి ఐదుగురు పెద్దమనుషులతో పంచనామా జరిపించారు. 25 క్వింటాళ్ళ వరిపంట నాశనం కావటంవల్ల రూ.2375/–లు

నష్టం కలిగిందని కమీషనర్ గారు అభిప్రాయపడ్డారు. వాదివైపు సాక్షి అయిన వా.సా.-2 చెప్పిందేమిటంటే, కోర్టువారు నియమించిన కమీషనర్‌గారు వాళ్ళ ఊరికి వచ్చి నాలుగు సంవత్సరాల కిందట తనను పిలిపించినప్పుడు తను, చంద్రగౌడ్, మాణిక్‌రెడ్డి, గ్రామ మునసబు, గ్రామ మచ్కూరీలు చంద్రగౌడ్ పొలానికి వెళ్ళారు. వాళ్ళు కూలిపోయిన స్థితిలో ఉన్న మత్తడిని చూశారు. మత్తడి పక్కన ఉన్న పొలంలో ఎండిపోయిన పాలఅక్కుళ్ళు రకం వరిపంట ఉంది. సుమారు 1ఎకరం 25 గుంటల పొలంలో ఎండిపోయిన పంటనూ 30 గుంటల్లో పాక్షికంగా దెబ్బతిన్న పంటనూ చూశారు. మత్తడిని నాశనం చేయటంలో నీరు రాకపోవటం వల్ల 25 క్వింటాళ్ళ వరిపంట నాశనం అయింది. కమీషనర్‌గారు చేసిన పంచనామాను ఇతను ధ్రువీకరించాడు. అదే ఎగ్జిబిట్ ఎ2 పత్రంగా గుర్తించడమైనది. మాణిక్‌రెడ్డి, చంద్రగౌడ్ కూడా సంతకాలు చేశారు. కమీషనర్‌గారు పంచనామాను అతనికి చదివి విశదీకరించారు. కోర్టువారు నియమించిన కమీషనర్ వా.సా.3 చెప్పిందేమిటంటే కోర్టునుంచి ఐ.ఎ.549/80లో కమీషనర్ వారంటు పుచ్చుకొన్న తరవాత ఆయన 16.11.80 తేదీన దావా సర్వేనం.429 భూమిగల మాల్తుమ్మెద గ్రామం వెళ్ళటం జరిగింది. వెళ్ళిన తరవాత అక్కడ గ్రామాధికారులను, వాదిని, ప్రతివాదిని పిలిపించటం జరిగింది. వాది, అతని తండ్రి ఉన్నారు కానీ ప్రతివాదిలేడు. మునసబు, కరణాలు కూడా ఉన్నారు. మాణిక్‌రెడ్డి, పెద్దోళ్ళ చంద్రగౌడ్, ఆసుల గౌరయ్య ఉన్నారు. వీళ్ళే పంచనామాకు పెద్ద మనుషులు. వీళ్ళంతా గ్రామ చావిడి నుంచి బయలుదేరి దావాభూమి అయిన సర్వేనం. 429లోని 15మళ్ళల్లో ఉన్న వరిపంటను గమనించారు. 15మళ్ళల్లోని 10మళ్ళ వరిపంట ఎండిపోగా 5మళ్ళల్లోని వరిపంట పాక్షికంగా పాడయి ఉంది. కమీషనర్‌గారు కూలిపోయి ఉన్న ఒక మత్తడిని చూశారు (సిమెంటు, రాళ్ళతో కట్టినది). దావా భూమి సర్వేనెం.429 దాని సరిహద్దు ఇంతకుముందే నాశనమైన మత్తడిని ఆనుకొని ఉంది. మత్తడిలో నిలవచేసుకొన్న నీటితోనే దావా భూమిని సాగుచేస్తున్నారు. ఈ దావాభూమిని సాగుచేయటానికి మరి ఎలాంటి సాగునీటి వసతీలేదు. మత్తడిలోపల నీళ్ళు నిలవలేవు. మత్తడి నాశనం అవటంవల్ల పంటకు నీళ్ళురాక ఒక ఎకరం 25గుంటల్లో పంట పూర్తిగాను, 30గుంటల్లో పంట పాక్షికంగాను ఎండిపోయినవి. వరిపంట పాలఅక్కుళ్ళు రకానిది. సుమారు 25 క్వింటాళ్ళ వరి పంట పాడైపోయింది. వాది రూ.2375/-ల వరకు నష్టపడినట్లు ఆయన తన నివేదికలో అభిప్రాయపడ్డారు. ఆయన పంచనామా జరిపి చెప్పినది బి.మాణిక్‌రెడ్డి (ఎగ్జిబిట్ ఎ-2) రాశాడు. ఆయన పంచనామా ఆ ఐదుగురికి చదివి, విశదీకరించాడు. దానిమీద ఆ గ్రామమునసబు, కరణాల సంతకాలు ఉన్నాయి. ఆయన రూప చిత్రణ మానచిత్రం కూడా వేయగా, దానికి ఎగ్జిబిట్ఎ-5గా గుర్తింపు చేయడమైంది. ఎగ్జిబిట్ఎ-4 గా గుర్తించిన నివేదిక దాఖలు చేశారు. ఎగ్జిబిట్ ఎ2 నుంచి ఎ-4లతో పాటు ఎగ్జిబిట్ఎ-5గా గుర్తించి కోర్టు ద్వారా జారీ అయిన వారంటుతో సహా వాపసు చేశారు. పంచనామా చావిడిలో చేసినట్లు చెప్పేసూచనను ఆయన నిరాకరించారు. మరోసాక్షి వా.సా-4 వాది తండ్రి వా.సా.-1 అని తెలిపారు. రంగమ్మ అనే ఒకావిడ దగ్గరి నుంచి నాలుగు సంవత్సరాల కిందట రిజిస్టర్డ్ విక్రయ దస్తావేజు ద్వారా దావాభూమిని వాది కొన్నాడు. వాది కొన్నప్పుడు అది మెట్టపొలం. వాది భూమికి తూర్పు వైపున

అనుకొని బోయినవానివాగు అనే ఒకచిన్న నీటి కాలవ ఉన్నది. వాది 3 గజాల పొడవు, భూమి నుంచి $1\frac{1}{2}$ గజం ఎత్తు, $1\frac{1}{2}$అడుగు వెడల్పుగల మత్తడిని నిర్మించాడు. మత్తడి నుంచి నీళ్ళు తన పొలానికి పారడానికి వాది ఒక అలుగు ఏర్పాటు చేశాడు. మూడు నాలుగేండ్ల కిందట వాదిపైన చెప్పిన మత్తడి నుంచి నీళ్ళు తీసుకొని వరిపంట వేశాడు. వాది నిర్మించిన మత్తడిని ప్రతివాది నాలుగేండ్ల క్రితం కూల్చివేశాడు. అతనికి వాది పొలం దగ్గర పొలం ఉన్నది. ప్రతివాది మత్తడిని కూలుస్తుండంగా చంద్రమౌళి స్వయంగా చూశాడు. వా.సా–1 మళ్ళీ మత్తడిని పోయిన సంవత్సరం బాగుచేసుకొన్నాడు.

4) ప్ర.సా–1 అయిన ప్రతివాది తనకుతానే చెప్పినదేమంటే బికనూర్ గ్రామానికి చెందిన రంగమ్మ దగ్గిరి నుంచి తాను వాదిపొలానికి తూర్పువైపున ఉన్న పొలంకొన్నాడు. అతను నాలుగేండ్లకు పూర్వం నుంచే తన పొలాన్ని సేద్యం చేస్తున్నాడు. పోచారం నీటి కాలవ నీళ్ళ ద్వారానే అతని పొలం, వాది పొలం సాగుచేసుకోటం జరిగింది. తనపొలానికీ, వాది పొలానికీ తూర్పువైపున బోయినవానివాగు అనే వాగు ఉంది. బోయినవానివాగుకు తూర్పువైపున వాదికి చెందిన భూమి ఏమీ లేదు. వాగులోని నీరు ఊటనీరు., అది ఉత్తరం నుంచి దక్షిణంవైపు పారుతుంది. వాది పొలం దగ్గర గంగయ్యకు పొలం లేదు. వాదిపొలానికి 200 గజాల దూరంలో బోయిన ఆశయ్యకు పొలం ఉంది. కోర్టువారు నియమించిన కమీషనర్ దావాభూమిని తనిఖీ చేసే సమయంలో తనను పిలవటంగానీ లేదా తనను ఉండాల్సిందిగా నోటీసుకానీ చేయడంకాని చేయలేదు. తను మత్తడిని నాశనం చేయటంకానీ, నీళ్ళురాక వరిపంట దెబ్బతిని పంట నష్టం కలగటంగానీ, అందువల్ల రూ.2500/– నష్టం రావటం కానీ నిజం కాదు. దావాభూమిని కొత్తగా బాగుచేయటం వల్లనే వాదిపంట ఎండిపోయింది. మత్తడిని నాశనం చేయటం వల్లనే నీళ్ళు పొలానికి వాది అందించలేకపోయారనీ, నీళ్ళు అందించక పోవటంవల్లనే పంట ఎండిపోయిందనే సూచనలను కూడా నిరాకరించడమైంది. తనకూ వా.సా.–1 కీ మధ్య శత్రుత్వం ఉండటం వల్లనే వాది దావా వేశాడు. ప్ర.సా–2 చెప్పినదేమంటే బోయినవానివాగు దగ్గర అతనికి 2 ఎకరాల పొలం ఉందనీ., పోచారం నీటికాలవ 7వ నంబరు పంటకాలవ నీటినుంచి తనపొలం సేద్యం చేసుకొంటున్నాడు. తనపొలమూ వాది పొలమూ, ప్రతివాది పొలాలు పోచారం నీటికాలవ నీటితోనే సేద్యం అవుతున్నాయి. తనపొలానికి తూర్పువైపున బోయినవానివాగు ఉన్నది. పైచెప్పిన బోయినవానివాగు ప్రభుత్వభూమిగుండా పారుతున్నది. పై తట్టు ప్రాంతాల నుంచి ఊరుతున్న నీరే ఈ వాగులోని నీరు. ఆ నీరు ప్రభుత్వంవారి కొండ ప్రాంతానిది. ప్రతివాది పొలం చాకలి చిన్నయ్య పొలం నుంచి వేరుచేసి ఉంది. వాది వాగుకు అడ్డంగా మత్తడిని నిర్మించాడు. మత్తడిని వాది తప్ప మరెవ్వరూ నిర్మించలేదు. మత్తడి నుంచి వచ్చే నీళ్ళ ద్వారానే వాది పొలం సేద్యం అవుతున్నదన్న విషయం నిరాకరించడమైంది. నిజానికి నీటికాలవ నుంచి వచ్చే నీరు కూడా వాది పొలాన్ని తడుపుతున్నది. నాలుగు సంవత్సరాల కిందట మత్తడిని నాశనం చేయటంవల్లనే వాది పంట ఎండిపోయిందనేది ఒప్పుకోలేని విషయం.

5) వాదికేసు విషయం ఏమిటంటే.. 1980 సంవత్సరంలో తన పొలం సర్వేనం.429లో

తను కట్టిన మత్తడిని ప్రతివాది నాశనం చేయటంవల్ల వేసిన 'పాలక్కుళ్ళు' రకం వరిపంటకు నీళ్ళు అందించలేక పోయాడు. ఆ కారణంవల్ల అతను వేసిన వరిపంట ఎండిపోయి రూ.2500/- లు నష్టపోయాడు. అవతలివైపు, ప్రతివాది అంటున్నది ఏమిటంటే, తను మత్తడిని నాశనం చేయలేదని, వాది తత్సంబంధిత అధికారుల దగ్గిరి నుంచి అనుమతి లేకుండానే మత్తడిని నిర్మించాడనీ వాదికి కలిగిన నష్టానికి తన ప్రమేయం ఎంతమాత్రం లేదనీ అన్నాడు. దావా భూమి అయిన సర్వేనం.429లో వాది తనపొలం సాగుచేయటానికి మత్తడిని నిర్మించుకొన్నాడని పైమొత్తం సాక్ష్యులవల్ల స్పష్టమవుతున్నది.

6) ఈ కోర్టు ద్వారా నియమితుడయి వా.సా-1 అయిన ముఖ్యమైన సాక్షి కమీషనర్. కమీషనర్ ప్రాక్టీసు చేస్తున్న న్యాయవాది. కమీషనర్‌గా వారంటు ఎగ్జిబిట్ ఎ-5 అందుకొన్న తరవాత అయన మాల్తుమ్మెద గ్రామానికి వెళ్ళారు. చావిడిలోకి మునసబును, కరణాన్ని ఐదుగురు పెద్దమనుషులను పిలిపించి వాది ప్రతివాదులకు కబురు చేశారు. వాది, వాది తండ్రి ఉన్నారు., ప్రతివాది లేడు. కమీషనర్ పంచనామా చేసి ఆ పెద్ద మనుష్యుల సమక్షంలో పొలం తనిఖీచేసి దావా భూమీ, మత్తడుల రూపచిత్రణ చేశారు. వా.సా-1 చెప్పిందేమిటంటే, రంగమ్మ దగ్గిరినుంచి పొలం కొన్న తరవాత వాది తన పొలంలో మత్తడిని నిర్మించి దావా భూమి అయిన సర్వేనెంబరు 429కి నీరు అందటానికి దానికి అలుగు పెట్టాడు. వా.సా-4. ప్రతివాది మత్తడిని నాశనం చేస్తుండగా చూసిన సాక్షి, ఆయన కూడా చెప్పిందేమిటంటే, వాది రంగమ్మ దగ్గిరినుంచి పొలం కొన్నాడు. కొన్న తరవాత 3గజాల పొడవు, భూమికి $1\frac{1}{2}$గజాల ఎత్తున, $1\frac{1}{2}$అడుగుల వెడల్పున ఒక మత్తడిని నిర్మించాడు. మత్తడి నుంచి పొలానికి నీళ్ళు పోవటానికి వాది మత్తడికి ఒక అలుగు కూడా ఏర్పాటు చేశాడు. వా.సా-1 సాక్ష్యం ఆధారంగా మత్తడి కొలతలకు సంబంధించి 13 అడుగుల పొడవు, $1\frac{1}{2}$ అడుగుల వెడల్పు, $4\frac{1}{2}$అడుగుల ఎత్తు ఉన్నది. మత్తడి నిర్మాణం విషయంలోనూ, దాని కొలతల విషయంలోనూ, రంగమ్మ దగ్గిరినుంచి పొలం కొన్న విషయంలోనూ వా.సా.-1 ఇచ్చిన సాక్ష్యంలో వా.సా-2, 4లు ఏకీభవిస్తున్నారు. అదీగాక ప్ర.సా-1 గా పరీక్ష జరిగిన ప్రతివాది అంగీకరించింది ఏమిటంటే,----బోయినవానివాగులో కట్టిన మత్తడి ద్వారా వాది నీరు తీసుకొని తన పొలాన్ని మాగాణిలాగా సేద్యం చేశాడు. ప్రతివాది ఇంకా అంగీకరించింది ఏమిటంటే వాది సుమారు4 సంవత్సరాల క్రితం పాలక్కుళ్ళ రకం వరిపంట వేశాడు. వాది మత్తడి ద్వారా బోయినవానివాగు నుంచి నీళ్ళు తీసుకొంటున్నట్లు ప్రతివాది తిరిగి అంగీకరించాడు. వాది మినహా మరే ఇతర వ్యవసాయదారూ ఎలాంటి మత్తడి నుంచి నీరు తీసుకోలేదు. వాదే మత్తడిని నిర్మించాడు. వాది పొలం కొన్న సంవత్సరం తరవాత మత్తడిని కట్టి అప్పటినుంచి పొలం సాగుచేసుకొంటున్నట్లు ప్రతివాది మళ్ళీ అంగీకరించాడు. ప్రతివాది లోగడ రాసిఇచ్చిన స్టేట్‌మెంట్ వాది మత్తడిని నిర్మించలేదని రాసింది నిజంకాదని ప్రతివాది తిరిగి చెప్పాడు. ప్రతివాది తరఫున ప్ర.సా-2 పరీక్ష జరిగిన కూడా చెప్పిందేమిటంటే సుమారు 4 సంవత్సరాలక్రితమే దావా భూమిని మాగాణిగా అభివృద్ధి చేశాడు. మత్తడిని నిర్మించిన తరవాతే వాది బోయినవానివాగులోని నీరు మత్తడి ద్వారా తీసుకొని సదరు దావా భూమిని మాగాణిగా మార్చాడు. ఆవిధంగా ప్రతివాది తరఫు సాక్ష్యం గూడా వాది మత్తడిని నిర్మించి బోయినవానివాగు ద్వారా నీటిని తీసుకొని

429 నెంబరుగల తన భూమిని సాగుచేసుకొంటున్నట్లు తెలుపుతుంది. వాది మత్తడిని నిర్మించుకొని బోయినవాని వాగునుంచి నీరుతీసుకొని భూమి సాగుచేసుకొంటున్నట్లు చూపించటానికి ఇంతకంటే రుజువు, సాక్ష్యం మరి ఇంక ఏం కావాలి? అందుచేత వాది మత్తడిని నిర్మించి బోయినవాని వాగు నీటి వసతి ద్వారా మెట్టభూమిని - మాగాణిగా మార్చి తన భూమిని సాగుచేసుకొన్నట్లు నిర్ధారించటానికి ఏలాంటి సందేహం లేదు.

7) వాది మత్తడిని నిర్మించటానికి అనుమతి పొందిఉన్నాడా, లేక వాది సమర్థ తత్సంబంధిత అధికారి దగ్గరి నుంచి అనుమతి పొందకుండానే నిర్మించాడా, అందువల్ల సమర్థ అధికారులు వాదిమీద చర్య ప్రారంభించారా అనేవాటి విషయంతో ఈ కోర్టుకు సంబంధం లేదు. ఇప్పుడు కోర్టు ఈ విషయాలన్నింటి జోలికి వెళ్ళలేదు. సర్వేనెంబరు 429 భూమికి నీళ్ళు తీసుకురావటానికి వాది పొలంలోగానీ, వాగులోకానీ వాది మత్తడి నిర్మించినట్లు ప్రతివాది రెవిన్యూ, లేదా నీటిపారుదల అధికారులకు అర్జీ పెట్టుకొన్నట్లు ఈ కోర్టువద్ద ఎటువంటి రికార్డు లేదు. సర్వేనం.429 దావా భూమిని సాగు చేయటానికిగాను వాది నిర్మించిన మత్తడిని నాశనం చేసి ప్రతివాది వాదికి నష్టం కలిగించాడా లేదా అనే విషయం మాత్రమే కోర్టు నిర్ణయించవలసి ఉంది. కమీషనర్ చేసిన పంచనామా ఎగ్జిబిట్ ఎ-2గా గుర్తించబడి కోర్టులో ఉంది. వా.సా3 అయిన కమీషనర్ చెప్పిందేమిటంటే, ఆయన వాదిని, ప్రతివాదిని పిలిపించగా వాది, వాది తండ్రి వచ్చారు కానీ ప్రతివాది రాలేదు.కమీషనర్ దావాభూమిని తనిఖీ చేసే సమయంలో తనను పిలిపించినట్లు చెప్పిన విషయం చీఫ్ పరీక్షలో ప్రతివాది నిరాకరించాడు. కోర్టువారు నియమించిన కమీషనర్ దావాభూమిని తనిఖీ చేసే సమయంలో తనను పిలిపించటంగానీ హాజరు కావాల్సిందిగా నోటీసు జారీ చేయటంగానీ చేయలేదని ప్రతివాది చెప్పాడు. పా.సా.3 అయిన కమీషనర్ తన క్రాసుపరీక్షలో గ్రామ మచ్కూరీలను తాను వాది ప్రతివాదులదగ్గరకు పంపించినట్లు తెలిపారు. కక్షిదారులను దావాభూమికి తీసుకరావటానికి వెళ్ళిన గ్రామమచ్కూరీల పేర్లు కమీషనర్ గార్కి గుర్తులేవు. కమీషనర్‌గారు లిఖితపూర్వకంగా ప్రతివాదికిగాని, ప్రతివాది న్యాయవాదికి గానీ వివాద స్థలవారంటును అమలు పరచబోయేముందు నోటీసు జారీ చేయటం జరిగిందా అని కమీషనర్ గార్ని ప్రశ్నించటం జరిగింది. ఈ కోర్టువారు తనకు ఇచ్చిన వారంటులో దావా కక్షిదారులకు తాను నోటీసు ఇవ్వాల్సిన అవసరంలేదని కమీషనర్ గారు సమాధానం ఇచ్చారు. ఆయన ఇద్దరు కక్షిదారులకూ నోటీసు జారీచేయలేదు., కానీ గ్రామానికి చేరిన తరవాత కక్షిదారులను తీసుకరావటానికి మచ్కూరీలను పంపారు. కక్షిదారులను పిలిపించటానికి మచ్కూరీలను పంపినట్లు తను ఇచ్చిన రిపోర్టులో లేదని వా.సా-3 తిరిగి తెలియజేశారు. కమీషనర్‌గారు నోటీసు ఇవ్వకుండా ప్రతివాదికి తెలియకుండా ఆర్డర్ 26 రూల్18 సి.పి.సి.కి వ్యతిరేకంగా ఏకపక్షంగా చర్యలు తీసుకొన్నారని అందువల్ల కమీషనర్‌గారి నివేదిక పరిశీలించదగనిదని ప్రతివాది తరఫు న్యాయవాది ఈకోర్టులో వాదించారు. 1970సం.ఎ.ఐ.ఆర్ ఢిల్లీ, పేజీనం. 205., అలాగే 1962సం.కలకత్తా పేజి నంబర్ 84 కేసుల్లో న్యాయమూర్తులు ఇచ్చిన ఆర్డరు 26 రూల్18 సి.పి.సి. కింద కమీషనర్ ముందు హాజరయే కక్షిదారులకు కోర్టు నోటీసు ఇచ్చి తీరాలనే ఆదేశాలను కూడా న్యాయవాది ఉదహరించారు. ఇది ఆదేశక నిబంధన అయినప్పటికీ

కమీషనర్‌గారు ప్రస్తుత కేసులో పాటించలేదు. కమీషనర్‌గారి నివేదిక విలువలేనిదనీ, పై న్యాయమూర్తుల ఆదేశాలననుబంధంగా కమీషనర్‌గారి నివేదిక చెల్లగూడదనీ ప్రతివాది న్యాయవాదిగారు ఉటంకించారు.

8) ఆర్డర్ 26 రూల్18 కింద కోర్టువారు కమీషనర్‌గారి తనిఖీ సంబంధించి దావా కక్షిదారులకు నోటీసు ఇచ్చి వారిని కమీషనర్ గారి ముందు స్వయంగా గానీ వారి తరపున ఏజెంట్లుగానీ, న్యాయవాదులుగానీ హాజరు కావాల్సిందిగా తాఖీదు ఇవ్వాలని ప్రతివాది తరపు న్యాయవాది గారి వాదన. వారు 1970 సం. ఢిల్లీ ఎ.ఐ.ఆర్, పేజీనెం.205లోని ఆదేశాలను ఉదహరించారు. దానిలోని ఆరో పేరాగ్రాఫ్‌లో న్యాయమూర్తులు ఒక కేసు గురించి చర్చిస్తూ దాంట్లో 1962 సం. కలకత్తా, ఎ. ఐ.ఆర్. పేజీనం.84ని ఉదహరించారు. దాంట్లో.. ఒకవేళ 18 నియమంలోని ఆదేశిక నిబంధనను అనుసరించి కమీషనర్‌ను నియమించినట్లయితే వారు ఇచ్చే తనిఖీ నివేదిక సాక్ష్యంగా పరిగణనకురాదు. ఆ న్యాయమూర్తులు "మాకూ అదే అభిప్రాయముంది" అని తెలియజేశారు. మనముందు ఉన్న ఈ కేసులో నియమం 18(1) కింద అవసరమైన ఎలాంటి నోటీసు కూడా కోర్టు ఇవ్వలేదు. ఈ పరిస్థితుల్లో నియమం 10(2) అనువర్తించటం వల్ల కమీషనర్‌గారి నివేదిక ఎగ్జిబిట్ ఎ-1, ఎ-2లు ఇతరత్రా సంబంధం లేకుండా సాక్ష్యంగా ఉండలేవు. అందుచేత ఈ కేసులో కూడా కమీషనర్‌గారు కక్షిదారులకు లిఖితపూర్వకంగా ఎలాంటి నోటీసు ఇవ్వలేదు. అలాగే కోర్టుకూడా కమీషనర్‌గారు భూమి తనిఖీ నిమిత్తం నిర్ణయించిన తేదీనాడు కమీషన్ ఎదుట హాజరు కావాల్సిందిగా కక్షిదారులకు ఎలాంటి నోటీసు ఇవ్వలేదు.

న్యాయవాది 1962 ఆం.ప్ర., పేజీ నెం.84 కేసును గూడా ఉదాహరించారు. దాంట్లోని న్యాయమూర్తులు అభిప్రాయపడిందేమిటంటే "ఆర్డర్26 రూల్9 కింద కోర్టు ప్రాంతీయ స్థల దర్యాప్తు నిమిత్తం కమీషనర్‌ని నియమించక ముందు ప్రతివాదికి నోటీసు విధిగా ఇవ్వవలసిన పనిలేదు., అయినప్పటికీ ఆర్డరు 26 రూల్ 18 ప్రకారం ఆదేశక నిబంధన కావటంవల్ల కోర్టు, కమీషనర్ నియమించిన తరవాత దానిముందు కక్షిదారులను హాజరు కావాల్సిందిగా కోరవలసిఉంది. కమీషనర్ ఇచ్చిన నోటీసు 18వ నియమానికి సరిపడేంతగా లేదు. ప్రాంతీయ దర్యాప్తు ప్రతివాదికి తెలియకుండా జరిగినందున కమీషనర్‌గారు ఇచ్చిన నివేదికను విశ్వసించవలసిన పనిలేదు."

అంతేకాకుండా ఆ న్యాయమూర్తులు ఆ కేసు తీర్పులో ఎ.ఐ.ఆర్,1934 మద్రాసు, పేజీనం.548ని ప్రస్తావిస్తూ దీంట్లో "26వ ఆర్డర్ 18వ రూల్‌లో ఉన్న వివిధ ప్రోసీడింగులు ఆదేశక నిబంధనలు అవటంవల్ల కక్షిదారులకు కమీషనర్ నియామకం గురించి తెలియజేయాల్సి ఉంది. అలాగేవారు (కక్షిదారులు) దర్యాప్తుకు హాజరు కావలసి ఉంది. ఏకపక్ష కమీషనర్‌వేసే అధికారం ఈ కోర్టుకు లేదు., నియమం18ని అతిక్రమించటానికి అత్యవసర పరిస్థితి అయినా కూడా కోర్టుకు వీలుపడదు."

ప్రతివాది అడ్వొకేటు వాదనను విరుద్ధంగా వాది అడ్వొకేట్ ఎ.ఐ.ఆర్, 1975, కలకత్తా, పేజీనెం. 303 కేసును ఉదాహరించారు. దాంట్లో "కోర్టుకు కమీషన్‌ర్‌ని నియమించి

ఏకపక్ష ఉత్తరువు ఇచ్చే అధికారం ఉంది. ఆ రకంగా కోర్టువారు కమీషన్ నియమించి ఏకపక్ష ఉత్తరువు తీసుకోవటం అన్యాయం కాదు., ఎందుకంటే ఈ చర్య 26వ ఆర్డరు 12వ రూల్ ఉల్లంఘించదు కాబట్టి".

పైన చెప్పిన మూడు తీర్పుల నిశిత పరిశీలన సారాంశం ఏమిటంటే, ఆర్డరు 26 రూల్ 9 సి.పి.సి కింద కమీషన్ నియమించే ముందు ప్రతివాదికి నోటీసు ఇవ్వవలసిన అవసరం లేదు. అయితే ఉత్తరువు26 నియమం18 కింద కమీషన్ చర్య ప్రారంభించే ముందు కక్షిదారులకు గానీ వారి న్యాయవాదులకు గానీ తప్పనిసరిగా నోటీసు జారీ చేయాలనే ఆదేశక నిబంధన ఉంది. అందుచేత ప్రస్తుతం ఈ కేసులో కోర్టుగానీ కమీషనర్‌గానీ కక్షిదారులకుగానీ వారి న్యాయవాదులకు గానీ కమీషనర్ ముందు తనిఖీ తేదీనాడు హాజరు కావలసిందిగా లిఖితపూర్వకంగా ఏలాంటి నోటీసు జారీచేయలేదు. ఆవిధంగా కమీషనర్ గారి నివేదిక ఉత్తరువు26 నియమం18 సి.పి.సి కింద ఆదేశక నిబంధనకు విరుద్ధంగా ఉంది. కమీషనర్‌గారు చెప్పిందేమిటంటే తను కక్షిదారులను దావాభూమి వద్దకు పిలిపించటానికి మచ్కూరీలను పంపాడు. వాదీ వారి తండ్రీ హాజరయ్యారు., ప్రతివాది హాజరుకాలేదు. ప్రతివాదికి తను ఏలాంటి లిఖితపూర్వక నోటీసూ ఇవ్వలేదని కమీషనర్‌గారు అంగీకరించారు. పై పేరాగ్రాఫులో ఉన్నట్లు ఆర్డర్ 26 రూల్18 సి.పి.సి కింద కక్షిదారులకు కోర్టు నోటీసు ఇవ్వనందువల్ల, కమీషనర్ గారి నివేదిక చెల్లనిదయింది. అందుచేత ఆదేశక నిబంధన అయిన ఆర్డర్26 రూల్18 సి.పి.సి.ను అమలు పరచనందువల్ల కమీషనర్‌గారి నివేదికను తోసివేయవచ్చు.

9) ప్రతివాది తన క్రాసుపరీక్షలో కమీషనర్‌గారు తనకు సమన్లు పంపిన రోజునే వాది భూమిదగ్గరకు వెళ్ళాడా, లేదా అన్నది తనకు తెలియదని చెప్పాడు. 16.11.80 తేదీనాడు కోర్టునుంచి తనకు సమన్లు అందినట్లు అతను అంగీకరించాడు. సమన్లు తనకు జారీచేసేటప్పుడు పోలీస్ పటేల్ అయిన లక్ష్మీకాంతంగారు అక్కడే ఉన్నట్లు తనకు జారీ చేసిన సమన్లకు వెనకవైపున తాను చేవ్రాలు కూడా చేసినట్లు ఒప్పుకొన్నాడు. సమన్ల వెనకవైపున సంతకం చేసిన సాక్షులందరూ తను ఉన్నప్పుడు చేసినవి కావని కూడా ఆయన అన్నారు. ప్రతివాదికి 16.11.1980 తేదీన సమన్లు జారీచేస్తున్నప్పుడు లక్ష్మీకాంతం పటేలు అక్కడ ఉన్నట్లు ప్రతివాది అంగీకరించినందువల్ల లక్ష్మీకాంతం ప్రతివాదికి 16–11–80 తేదీన సమన్లు జారీ చేస్తున్నప్పుడు ఉన్నట్లురుజువైంది. 16.11.80 తేదీన సాక్షుల సమక్షంలో ప్రతివాదికి జారీచేసే గుమాస్తా సమన్లు జారీచేసినట్లు అతని చేవ్రాలు ఉన్నది. లక్ష్మీకాంతం, దేవయ్య, కిష్టయ్య, పోలీస్‌పటేలు అక్కడే ఉండి చూశారు. వా.సా– 3 చెప్పిందేమిటంటే, మాణిక్ రెడ్డి, చంద్రగౌడ్, ఆసుల గౌరయ్య, పట్వారి, పోలీసు పటేల్–వీరందరి సమక్షంలో తను పంచనామాను జరిపారు. లక్ష్మీకాంతం పోలీస్ పటేలు అక్కడ ఉండటమనేది రుజువయింది గనుక ప్రతివాది ఊళ్ళోకి కమీషనర్ రాకను పసికట్టి కావాలనే పిలిచినప్పుడు గైరుహాజరు అయ్యాడని అనుకోవచ్చు. మాల్తుమ్మెద ఒక పల్లెటూరు. కమీషనర్ గారు ఊళ్ళోకి వచ్చిందీ ప్రతివాదికి అదేరోజు తెలియబరచింది తెలియకపోవటానికి అదేం పట్టణంగానీ నగరం గానీ కాదు. లక్ష్మీకాంతం పటేల్

సమక్షంలోనే సమన్లు జారీ అయ్యాయి. పంచనామా జరిపేటప్పుడు ఉన్నాడన్న వ్యక్తి ప్రత్యేకంగా ఆ విషయాన్ని ప్రతివాదే ఒప్పుకొన్నప్పుడు, కమీషనర్‌గారి రాకమాత్రం ప్రతివాదికి తెలియదని చెప్పటం నమ్మశక్యం కానిది. అందుచేత ఈ కోర్టు ఆదేశాల మేరకు కమీషనర్‌గారు వాళ్ళ ఊళ్లోని దావా భూమిని తనిఖీ చేయటానికి వచ్చిన విషయం ప్రతివాదికి తెలుసు.

10) ప్రతివాది న్యాయవాది వాదన ఏమిటంటే, వాది తను దావాభూమికి యజమానినీ ఆవిధంగా అతను ఆ పొలంలో పంట వేశాడనీ మత్తడిని కూల్చివేయడం జరిగిందనీ దానివల్ల మత్తడి నుంచి దావాభూమికి నీళ్ళు పెట్టలేక పోయాడనీ., దాని ఫలితంగా పైరు ఎండిపోయిందనీ చూపించే పత్రమేదీ కోర్టులో దాఖలు చేయలేదు. వాదే దావాభూమికి యజమాని అని సూచించే ఏలాంటి పత్రం వాది దాఖలు చేయనట్లు వా.సా–1 అంగీకరించాడు. కానీ ప్రతివాది తను ఇచ్చిన లిఖితపూర్వక స్టేట్‌మెంటులో వాదే ఆ దావా భూమికి యజమాని అని స్పష్టంగా అంగీకరించాడు. లిఖితపూర్వక స్టేట్‌మెంట్‌లో అంగీకరించటమే కాకుండా ప్రతివాది తన ఛీఫ్ పరీక్షలో, తనపొలం వాది పొలానికి ఉత్తరంవైపున ఉన్నదని చెప్పాడు., ప్రతివాది తన క్రాసుపరీక్షలో యజమానురాలు రంగమ్మ దగ్గిర నుంచి వాది రిజిస్టర్డ్ విక్రయదస్తావేజు ద్వారా పొలం కొన్న సంవత్సరం తరవాత పైన చెప్పిన మత్తడిని నిర్మించి, దాని ద్వారా నీరు పెట్టుకొని ఆ పొలంలో పాలక్కుళ్ళ రకం వరిపైరు వేసినట్లు అంగీకరించాడు. ప్రతివాది తన లిఖితపూర్వక స్టేట్‌మెంటులో వాది తన పొలం అభివృద్ధి చేసుకోటానికి వాగులో మత్తడిని నిర్మించినట్లు నిరాకరించాడు. ఈవిధంగా లిఖితపూర్వక స్టేట్‌మెంటులో నిరాకరించటం అతను ఇచ్చిన లిఖితపూర్వక స్టేట్‌మెంటు తప్పుడు అభ్యర్థనని తెలియజేస్తుంది. ఎందుకంటే వాది దావాభూమికి 5సంవత్సరాల క్రిందట రంగమ్మవద్ద నుంచి కొన్నట్లు, తర్వాత మత్తడిని 4 సంవత్సరాల కింద సేద్యం నిమిత్తం నిర్మించినట్లూ, వాది మాత్రమే ఆ మత్తడినుంచి నీరు తీసుకొని సేద్యం చేసుకొంటున్నట్లూ ప్రతివాది కోర్టులో అంగీకరించాడు. అందుచేత ప్రతివాది ఈ కేసుకు సంబంధించి సత్యాలు కోర్టులో చెప్పటం లేదు. ప్రతివాది నష్టాన్ని భరించవలసి రాకుండా తప్పించుకోడానికి అసత్యం చెబుతున్నాడని ఇటువంటి పరిస్థితుల్లో చెప్పవచ్చు. తనకూ వా.సా–1కీ మధ్య ఉన్న వైరం వల్ల అతను నష్టపరిహారానికి ఈ దావా వేసినట్లు ప్రతివాది అన్నాడు. ప్రతివాది తన క్రాసుపరీక్ష మొదటి ప్రశ్నకు సమాధానంగా...తను వాదితో భాగస్వామిని కాననీ, తనకూ వాదికీ మధ్య ఎటువంటి ఆర్థికపరంగా గానీ మరే విధంగాగానీ సంబంధాలు లేవని చెప్పుకొన్నాడు. పైగా వాది మత్తడిని నిర్మించటంవల్ల తన 20గుంటల భూమి నీటిలో మునిగిపోయిందని ప్రతివాది చెప్పాడు. ఈనష్టాన్ని అధిగమించటానికి వాది తాలూకు మత్తడిని కూల్చినాశనం చేసినట్లు అతను అంగీకరించలేదు. అంతేకాకుండా వాది సోదరునికి తనకూ మధ్య నీటిలో మునిగిపోయిన తన పొలాన్ని గురించి వాగ్వివాదం జరిగిందని ప్రతివాది చెప్పాడు. కానీ ప్రతివాది తరపు సాక్షిగా పరీక్షజరిగిన ప్ర.సా–2 మత్తడిని గురించి వాది అయిన మధుసూదన్‌గౌడ్‌కు ప్రతివాదికీ మధ్య తగాదాలు జరిగినవని అంగీకరించాడు. ఆవిధంగా వాది ప్రతివాదుల మధ్య తగాదా ఉన్నదని ప్ర.సా–2 సాక్ష్యం, ప్ర.సా–1 సాక్ష్యాన్ని ప్రతిస్థాపిస్తున్నది. ప్రతివాది మత్తడిని నాశనం చేయలేదని

తను చెప్పిన విషయం అబద్ధం అని అన్నదాన్ని ప్ర.సా-2 నిరాకరించాడు. ప్ర.సా-2 తన క్రాస్‌పరీక్షలో ప్రతివాది మత్తడిని కూల్చివేయలేదనిగానీ, నాశనం చేయలేదని గానీ శత్రుత్వం కారణంగానే వాది దావావేశాడని గానీ చెప్పలేదు. వాది దావా భూమినికొత్తగా అభివృద్ధి చేయటం వల్ల దానిలోని పైరు ఎండిపోయిందని గూడా ప్ర.సా.-2 చెప్పలేదు. అందుచేత కొత్తగా వాదిపొలం అభివృద్ధి చేయటంవల్ల వరిపైరు దావాభూమిలో ఎండిపోయిందనే ప్ర.సా-1 సాక్ష్యాన్ని ప్ర.సా.-2 బలపరచలేదు. ప్రతివాది తన క్రాసుపరీక్షలో, వాది పొలం అభివృద్ధి చేయటంవల్ల 10గుంటల్లోని వరిపైరు దెబ్బతిన్నదని తన లిఖితపూర్వక వాఙ్మూలంలో ప్రకటించలేదని అంగీకరించాడు. తను ఇచ్చిన లిఖితపూర్వక స్టేట్ మెంట్ లో వాది మత్తడిని నిర్మించలేదని రాసింది నిజం కాదని ప్రతివాది కూడా చెప్పాడు. దీన్ని బట్టి ప్రతివాది నిజం చెప్పటంలేదని, అబద్ధం చెపుతున్నాడనీ తెలుస్తోంది. ప్రతివాది తన లిఖిత పూర్వక స్టేట్ మెంట్ లో తన ఎండిపోయిన పైరు గురించిగానీ, లేక తనపై దావావేయడానికి గలకారణాల గురించిగానీ ఎటువంటి అభ్యర్థనా చేయలేదు. వరిపైరు ఎండిపోవటానికి కారణం వాది పొలాన్ని కొత్తగా అభివృద్ధి చేయటమేననీ, తనకు వాదికీ మధ్య ఉన్న శత్రుత్వం వల్లనే తనమీద దావా వేయటం జరిగిందనీ ప్రతివాది కోర్టులో చెప్పాడు. వాదికీ ప్రతివాదికీ మధ్య ఉన్న శత్రుత్వానికి కారణాలు ఏమిటో, ఈ దావా ఎందుకు వేయటం జరిగిందో ప్రతివాదే కారణాలు చూపించాల్సి ఉంది. ఇది ముఖ్యమైన విషయం. ఎందుకంటే ప్రతివాది మత్తడిని పగలగొట్టి నాశనంచేశాడని, తను నిర్మించిన ఆ మత్తడి ద్వారానే నెం.429 దావాభూమిని సేద్యం చేసుకొంటున్నానని వాది ఆరోపించాడు. మత్తడిని వాది కట్టటం వల్లనే ప్రతివాది 20గుంటల పొలం నీటిలో మునిగిపోయిందని ప్రతివాది అంగీకరించాడు. ప్రతివాది సాక్ష్యాన్ని సునిశితంగా పరిశీలించినట్లయితే అసలు వాదికీ ప్రతివాదికీ మధ్య మత్తడి గురించి తగాదాయే లేదనీ ప్రతివాది అసత్యం చెప్తున్నాడనీ సందేహం కలుగుతుంది. ప్ర.సా.-2 సాక్ష్యం వాది మధుసూదన్‌గౌడ్‌కు ప్రతివాదికి మత్తడికి సంబంధించి తగాదా అయినట్లు స్పష్టంగా రుజువుచేస్తుంది. ప్రతివాది మత్తడిని కూలుస్తుండగా తను, తనతోపాటు చంద్రమౌళి చూశామని చెప్పిన వా.సా-4 చాలా ముఖ్యమైన సాక్షి. వా.సా-4 తన క్రాసుపరీక్షలో తన సొంతపొలం దావాభూమికి దక్షిణం వైపుగా ఉన్నట్లు చెప్పాడు. బోయినవానివాగు ఉత్తరం నుంచి దక్షిణంవైపు ప్రవహిస్తూంటుంది. ఈ వాగు వాది పొలం మీదుగా పోతుంది. దావా భూమికి తూర్పువైపున వాది మత్తడిని నిర్మించాడు. ప్రతివాది తన చీఫ్ పరీక్షలో వాదిపొలానికి సుమారు 200గజాల దూరంలో బోయిన ఆశయ్యకు పొలం ఉన్నట్లు తెలిపాడు. అందుచేత వా.సా.-4 చెప్పినట్లు ప్రతివాది మత్తడిని కూలగొడుతున్న సంఘటన ఆయన చూసిన విషయం నిజం అని భావించవచ్చు. వా.సా-4ని ఈ సంఘటన చూడనట్లు ప్రశ్నించడమైంది. అయితే వా.సా-4 ని ఈ సలహాని తిరస్కరించాడు. మత్తడిని ఎందుకు పగలగొడుతున్నావని ప్రతివాదిని వా.సా-4గానీ చంద్రగౌడ్‌గానీ అడగనట్లు వా.సా-4 చెప్పినమాట వాస్తవం. వా.సా-4, చంద్రగౌడ్ ప్రతివాదిని మత్తడిని ఎందుకు పగలగొడుతున్నావని అడగనంతమాత్రాన ప్రతివాది మత్తడిని పగలగొడుతూండగా చూసినట్లు వా.సా-4 చెప్పిన సాక్ష్యం తిరస్కరించడానికి ఆధారం లేదు. కొన్ని అవకతవకలున్నప్పటికీ ప్రతివాది తను మత్తడిని పగలగొట్టలేదని విన్నవించడాన్ని

అవి బలపరచలేవు. పై పెచ్చు ప్రతివాది మత్తడిని కూలగొట్టినట్లు చాలినంత సాక్ష్యం రికార్డులో ఉంది.

11) కమీషనర్ గారి నివేదిక ప్రకారం వారి అంచనా ప్రకారం వాది రూ.2375/-లు నష్టపడ్డాడు. పై పేరాగ్రాఫుల్లో ఉన్నట్లు ఆర్డర్ 26 రూల్ 18 సి.పి.సి నిబంధనలనుసరించి కమీషనర్‌గారి నివేదిక తొలగించడమైంది. అందుచేత అది పరిగణించడానికి వీలులేనిది కాబట్టి మత్తడిని కూల్చటంవల్ల జరిగిన నష్టం, పైరుకు నీరు పెట్టలేకపోవటం వల్ల కలిగిన నష్టం అంచనా వేయడానికి వా.సా-1 కోర్టులో ఇచ్చిన సాక్ష్యం మాత్రమే ఉంది. వా.సా-1 రూ.2500/- లు నష్టం కలిగిందని చెప్పాడు., కమీషనర్‌గారి పరిగణించని పంచనామా రూ.2,375/-లు నష్టం చూపించింది. అంటే వాది మత్తడిని నాశనం చేయటం వల్లా, పైరు ఎండిపోవటంవల్లా కలిగిన నష్టం దాదాపు రూ.2500/-లుగా భావించవచ్చు. ఈవిధంగా ప్రతివాది నిరూపించారు. అందుచేత ఈ వాదాంశం వాది పక్షాన నిర్ణయించడమైంది.

12) పర్యవసానంగా, వాది దావానూ నష్టపరిహారంగా రూ.2500/-లకు ఖర్చులతో డిక్రీ ఇవ్వటమైంది.

సంతకం/-
జిల్లా మునసబు, యెల్లారెడ్డి.

## సాక్ష్యం అనుబంధం

పరీక్షింపబడ్డ సాక్షులు

వాదితరపున:

వా.సా1. రామచందర్ గౌడ్
వా.సా2. ఆసుల గౌరయ్య
వా.సా3. బి.నరసింహులు
వా.సా4. బోయిన ఆశయ్య

ప్రతివాది తరపున:

ప్ర.సా.1 గూడల హనుమంతు
ప్ర.సా.2 పోచయ్య

## మార్కు అయిన పత్రాలు

వాది తరపున:

ఎగ్జిబిట్ ఎ.1 విక్రయదస్తావేజు (పవర్‌పట్టా)

ఎగ్జిబిట్ ఎ.2 కమీషనర్ గారు చేసిన పంచనామా

జిల్లా మునసబు కోర్టు, యెల్లారెడ్డి

ఎగ్జిబిట్ ఎ.3 దావాభూమి రూపచిత్రణ మానచిత్రం

ఎగ్జిబిట్ ఎ.4 కమీషనర్ గారి నివేదిక

ఎగ్జిబిట్ ఎ.5 ప్రాంతీయ దర్యాప్తుకు కమీషన్

ప్రతివాది తరఫున:

ఎగ్జిబిట్ బి.1 మానచిత్రంతో సహా తాత్కాలిక నిషేధాజ్ఞ.

సంతకం./-
జిల్లా మునసబు, యెల్లారెడ్డి.

- సరైన నకలు-

సంతకం/-
జిల్లా మునసబు.

# 19.

# జిల్లా మునసబు కోర్టు, సత్తెనపల్లి

జిల్లా మునసబు కోర్టులో

హాజరు : శ్రీ ఇ.శివకోటి, బి.కాం., ఎల్.ఎల్.ఎం.
ప్రధాన జిల్లా మునసబు

1984వ సం.సెప్టెంబరు 17వ తేదీ సోమవారం.
ఎస్.సి.నెం.10/82

శ్రీ కోదండ రామస్వామి ఆలయం, బెల్లంకొండ
ప్రతినిధిగా దాని మేనేజర్..............................................వాదికీ

కుందూరి వెంకటేశ్వర్లు..............................................ప్రతివాదికీ

మధ్య:

వాది న్యాయవాదులు అయిన శ్రీయుతులు ఎస్.ఎస్.ఎస్ సోమయాజులు, సి.హరనాధ్ బాబు, ప్రతివాది న్యాయవాది అయిన శ్రీ ఎన్.ఆదినారాయణమూర్తి గార్ల సమక్షంలో పరిశీలనలో ఇప్పటివరకు ఉండి నా వద్దకు 5.9.1984 తేదీన తుది విచారణ నిమిత్తం వచ్చిన దావాపై కోర్టు ఈ కింది తీర్పు ఇవ్వడమైంది.

తీర్పు

1) పొలం మక్తాకు సంబంధించి ఇవ్వవలసిన అసలు, వడ్డీ రూ.168/–లు రాబట్టుకోటానికి వేసిన దావా ఇది.

2) ఈ దావాపత్రంలోని ముఖ్యమైన విషయం ఏమిటంటే ప్రతివాది 16–6–76న చౌటుప్పలపాలెంలో డి.నెం. 322 బి లోని 2 ఎకరాల విస్తీర్ణం గల ఆలయ కౌలుదారీ ఆస్తిహక్కుల వేలం పాటలో పాల్గొన్నాడు. అతను సంవత్సరానికి రూ.300/–లు చెల్లించే అత్యధిక వేలంపాటదారు అయ్యాడు. అతను పొలం స్వాధీనం చేసుకొని 1980సం. ఏప్రిల్ లో తిరిగి అప్పగించే వరకు వ్యవసాయం చేసుకొన్నాడు. 1978–79సంవత్సరం వరకు ఇవ్వవలసిన మక్తా డబ్బు ఇచ్చేశాడు. అతను 1979–80 సం.పు మక్తా ఇవ్వవలసి ఉంది. మొదటినుంచీ అతను రూ.150/–లు మక్తా ఇస్తూ ఉండేవాడు.. ఎందుకంటే మిగతా సగం పొలం

ముదిగొండ శంకరశర్మ అనే వ్యక్తి, వ్యవసాయం చేసుకొని అంగీకరించిన మక్తాలోని సగం మక్తా చెల్లించేటట్లు అతను అనుమతించాడు. శంకరశర్మ 1979–80సంవత్సరానికి కూడా రూ.150/–లు చెల్లించాడు. వాది రూ.150/–లు ప్రతివాది దగ్గరి నుంచి పొందాల్సిఉంది. ప్రతివాది కౌలు డబ్బు వాదికి ఇచ్చినప్పుడు వాది రూ.100/–లకు తాత్కాలిక రసీదు ఇచ్చి తరవాత అదే మొత్తానికి పక్కా రసీదు మళ్ళీ ఇచ్చాడు. ప్రతివాది ఇప్పుడు దాన్ని ప్రయోజనంగా తీసుకొంటున్నాడు. కాని నిజానికి ఆరెండు రసీదులూ అదే ఒక మొత్తానికి సంబంధించినవి. ప్రతి సంవత్సరం మార్చినెల 31వ తేదీ గడువు. అందుచేత రావాల్సిన మక్తా మొత్తం రాబట్టుకోడానికి ఈ దావా దాఖలు చేయడమైంది.

3) దావాపత్రంలో ఉదాహరించిన విషయాలు సరిఅయినవి కావని, అసత్యాలని ప్రతివాది లిఖితపూర్వక స్టేట్ మెంట్ దాఖలు చేశాడు. ప్రతివాది ముదిగొండ శంకరశర్మను కౌలులో ఉన్న భూమిని 3సంవత్సరాల పాటు వ్యవసాయం చేసుకోడానికి అనుమతించగా ఆయన మూడు సంవత్సారాల వ్యవసాయం చేసుకొన్నాడు. నాలుగో సంవత్సరం ఆయన వ్యవసాయం చేయలేదు. ఆయన తన కౌలు వదులుకొన్నాడు. ఆలయ మేనేజరు కింద ఉదాహరించిన విధంగా డబ్బు వసూలు చేశాడు.

| తేదీ. | రసీదు నెం. | పైకం మొత్తం. రూపాయలలో.. |
|---|---|---|
| 22.4.77 | 42 | 100/– |
| 28.7.77 | 59 | 150/– |
| 19.12.78 | 86 | 150/– |
| 13.5.79 | 6 | 150/– |
| 1.11.79 | 36 | 150/– |
| 17.4.80 | 6 | 100/– |
| 9.9.80 | 57 | 150/– |
| 8.9.80 | 55 | 150/– |
| డిపాజిట్ నిమిత్తం చెల్లించవలసిన మొత్తం | | 50/– |
| | మొత్తం రూ. | 1150/– |

వాది తన ఖాతాపుస్తకాలను కోర్టులో దాఖలుచేసినట్లయితే తను చెల్లించవలసిన అసలు పైకం తెలుస్తుంది. ప్రతివాది ఏమాత్రం బాకీ లేదు, ఆయన వాది ఆలయానికి చెల్లించవలసినది ఏమీలేదు. అందుచేత ఈ దావాను ఖర్చులతో కొట్టివెయ్యాలి.

4) ఇప్పుడు పరిశీలించవలసిన వాదాంశం:-

ప్రతివాది వాదికి ఏమైనా పైకం ఇవ్వవలసి ఉందా, లేదా?

5) వాది ఆలయం తరపు కార్యనిర్వహణాధికారి జె.నాగేశ్వరరావును వా.సా-1గా పరీక్షించడమైంది. అలాగే ప్రతివాది తరపున ప్రతివాదినే ప్ర.సా-1గా పరీక్షించడమైంది. ఇరుపక్షాలా ఏ దస్తావేజులను గుర్తింపుచేయలేదు.

6) ప్ర.సా-1 తన వాఙ్మూలంలో తను ఈ దావాలో ప్రతివాది అయినట్లూ పొలాన్ని తాను 1976సం. నుంచి 1979సం.వరకు కౌలుకు తీసుకొన్నట్లు వివరించాడు. పొలం మక్తా కింద అతను సంవత్సరానికి రూ.300/-లు చొప్పున చెల్లించాల్సి ఉంది. మూడో సంవత్సరాంతంలో కార్యనిర్వహణాధికారికి అతను పొలం అప్పజెప్పాడు. కార్యనిర్వహణాధికారి అందుకు అంగీకరించకుండా నాలుగో సంవత్సరానికి కూడా మక్తా పైకం అడిగాడు. అతను నాలుగో సంవత్సరానికి కూడా రూ.300/-లు చెల్లించాడు. మొట్టమొదట్లో వేలంపాట సమయంలో అతను రూ.50/-లు డిపాజిట్‌గా చెల్లించాడు. కౌలు కాలం 6సంవత్సరాలు. మక్తా పైకం కింది విధంగా చెల్లించాడు.

| తేదీ. | పైకం మొత్తం. రూపాయలలో | రసీదు నెం. |
|---|---|---|
| 22.4.77 | 100/- | 42 |
| 28.7.77 | 150/- | 59 |
| 19.12.78 | 150/- | 86 |
| 13.8.79 | 150/- | 6 |
| 1.11.79 | 150/- | 36 |
| 17.4.80 | 100/- | 6 |
| 9.9.80 | 150/- | 57 |
| 8.9.80 | 150/- | 55 |
| డిపాజిట్ | 50/- | |
| మొత్తం | రూ.1150/-లు. | |

ప్ర.సా-1 చెప్పేదేమిటంటే 9.9.80తేదీన తను రూ.150/-లు చెల్లించినా రూ.100/-లకు మాత్రమే తనకు రసీదు ఇవ్వటం జరిగింది. అలానే 17.4.80తేదీన చెల్లించిన రూ.100/-లకు ఎలాంటి రసీదు ఇవ్వలేదు.

7) ఈ సాక్ష్యానికి విరుద్ధంగా వా.సా–1 వాది ఆలయం కార్యనిర్వహణాధికారి నాగేశ్వర్రావు వాఙ్మూలం ఇచ్చిందేమిటంటే, ప్రతివాది 2ఎకరాల ఆలయ భూమిని కౌలుకు తీసుకొన్నాడు. అతను మక్తా పైకం సంవత్సరానికి రూ.300/–ల చొప్పున చెల్లించాలి. అతను దాన్ని మళ్ళీ ఉపకౌలుకిచ్చాడు. అప్పటినుంచి సంవత్సరానికి రూ.150/–లు చొప్పున చెల్లించవలసి ఉంది. ప్రతివాది 1979–80సంవత్సరానికి రూ.150లు వడ్డీ కట్టవలసి ఉంది. ప్రతివాది చెల్లించినట్లు అతని ఖాతాపుస్తకంలో నమోదు కాలేదు. ప్రతివాది వడ్డీతో సహామొత్తం బాకీ ఉన్నాడు. వాది తన క్రాసుపరీక్షలో, ఖాతాపుస్తకాల్లో 17.4.80తేదీ, 6వ నెంబరు రసీదు రూ.100/–ల చెల్లింపు నమోదు కాలేదని చెప్పాడు. ప్రతివాది భూమిని వదులు కొన్నాడు. అప్పుడు అతను రూ.150/–లు డిపాజిట్ చేశాడు. ఈ మొత్తాన్ని తిరిగి ఇవ్వవలసి ఉంది. అతను రూ.150/–లు డిపాజిట్‌గాను, రూ.50/–లు మక్తా చెల్లించవలసి ఉంది. ప్ర.సా–1 తన క్రాసుపరీక్షలో మౌఖిక కౌలు రూ.300/–లకు అనీ మక్తా పైకం చెల్లించినట్లు రుజువుగా రసీదులు దాఖలు చేసినట్లుగా చెప్పాడు. రసీదుల ప్రకారం అతను రూ. 1150/–లు చెల్లించాడు. చెల్లించిన డబ్బుకు తీసుకొన్న రసీదులు కొన్ని అగ్నిప్రమాదంలో కాలిపోయాయి. డబ్బు చెల్లించిన పదిహేను రోజులకు రసీదు ఇవ్వవలసిందిగా అతను కోరాడు. ముద్రిత రసీదు కోసం ప్రతివాది ఎటువంటి రిజిస్టర్ నోటీసు వాదికి జారీ చేయలేదు.

8) ప్ర.సా–1 చెప్పిందేమిటంటే 17.4.80తేదీ, 6వ నెంబరు రసీదులో తాను రూ.100/– లు వాదికి చెల్లించాడు. ఆ రసీదు అగ్నిప్రమాదంలో కాలిపోయింది. ఆ పైన చెప్పిన సంవత్సరానికి డబ్బు చెల్లించినట్లు నకలు రసీదు వాదిని కోరుతూ తాను రిజిస్టర్ నోటీసు జారీ చేయలేదు. వా. సా–1 వాఙ్మూలంలో వాదివద్ద ఉన్న ఖాతా ప్ర.సా–1 చెప్పినట్లు 17.4.80 తేదీన రసీదు నెం.6లో రూ.100/–లు చెల్లింపు జరిగినట్లు చూపించడం చెప్పాడు. ప్రతివాది 17.4.80 తేదీన 1979–80 సంవత్సరానికి గాను మక్తా పైకం కింద రూ.150/–లు చెల్లించినట్లు అతని మౌఖిక సాక్ష్యం తప్ప మరే ఇతర రుజువూ లేదు. ప్రతివాదికి వాది ఇచ్చిన రసీదు అగ్ని ప్రమాదంలో కాలిపోవటంవల్ల తాను వాదికి సొమ్ము చెల్లించినట్లు సాక్ష్యం చూపించలేకపోతున్నట్లు చెప్పాడు. వాదికి చెల్లించవలసిన పైకం ప్రతివాది నిజంగానే చెల్లించినట్లయితే, వాది ఆ చెల్లింపును తన ఖాతాలో నమోదు చేసి ఉండేవాడు. దీనికి సంబంధించినంత వరకు తమ ఖాతాపుస్తకాల్లో అటువంటి నమోదు లేదని వా.సా–1 తన వాఙ్మూలంలో చెప్పాడు. వాది ఖాతాపుస్తకాల్లో దీనికి సంబంధించి ఎటువంటి నమోదు లేనందువల్లనూ ప్ర.సా–1 వాదనని బలపరచటానికి మరే సాక్ష్యం లేనందువల్లా ఈ సందర్భంలో ప్ర.సా–1 ఇచ్చిన ఒకే ఒక మూజువాణి సాక్ష్యం మీద మాత్రమే నమ్మకం ఉంచటం కష్టం. అందుచేత ప్రతివాది ఈ దావాలో వాదికోరినట్లు వాదికి చెల్లించవలసిన పైకం చెల్లించినట్లు తన కథనాన్ని రుజువు చేసుకోలేకపోయాడని నేను భావిస్తున్నాను.

9) పర్యవసానంగా ఈ దావా రూ.168/–లకు ఖర్చులతో, డిక్రీ ఇచ్చిన నాటి నుంచి డబ్బు ఇచ్చే నాటివరకు సంవత్సరానికి 6% చొప్పున వడ్డీతో డిక్రీ ఇవ్వటమైనది.

1984వ సంవత్సరం, సెప్టెంబరు నెల 17వ తేదీన సంక్షిప్త లేఖకునికి చెప్పి రాయించి లిప్యంతరణం చేసిన తరవాత నేను దాన్ని సరిచేసి న్యాయస్థానంలో బహిరంగంగా ఈ తీర్పు ప్రకటించడమైంది.

సంతకం/–
**ఇ. శివకోటి**
ప్రధాన జిల్లా మునసబు

**సాక్ష్యాల అనుబంధం**

పరీక్షించబడిన సాక్షులు

వాది తరఫున:

జై. నాగేశ్వరావు, వాది ఆలయపు
కార్యనిర్వహణ అధికారి.

ప్రతివాది తరఫున:

కుందూరి వెంకటేశ్వర్లు
ప్రతివాది.

ఎవరి పక్షానా ఏ దస్తావేజూ గుర్తింపు కాలేదు.

సంతకం/–
ఇ.శివకోటి
ప్రధాన జిల్లామునసబు

–సరైన నకలు –

# 20.

# ప్రధాన జిల్లా మునసబు కోర్టు, వరంగల్లు

ప్రధాన జిల్లా మునసబు కోర్టులో

శనివారం, 1983సం. డిసెంబరు నెల 31వ తారీఖు

హాజరు: శ్రీ టి. ఆంజనేయులు, బి.ఎస్.సి., ఎల్.ఎల్.బి.
ప్రధాన జిల్లా మునసబు, వరంగల్లు

చిన్నదావా నెం.17/82

మార్గదర్శి చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్ వరంగల్లు..................వాదికీ

1) సయ్యద్ యూసఫ్
2) సయ్యద్ మొయినుద్దీన్
3) ఎస్. రాజశేఖరం..................ప్రతివాదులకూ

మధ్య:

వాది న్యాయవాది అయిన శ్రీ పూర్ణచంద్రరావు, మొదటి ఇద్దరు ప్రతివాదుల న్యాయవాది అయిన శ్రీ వి. బాలకిషన్ రావు సమక్షంలో మూడో ప్రతివాది ఏకపక్ష నిర్ణయానికి కట్టుబడి గైరుహాజరు కాగా 30.12.1983 తేదీన నావద్దకు తుది విచారణ నిమిత్తం వచ్చిన ఈ చిన్నదావాకు సంబంధించి న్యాయవాదుల వాదాలను విన్న మీదట కోర్టు ఈకింది తీర్పు ఇవ్వడమైంది.

తీర్పు

ప్రతివాది దగ్గరినుంచి రూ.137/–లు రాబట్టుకోడానికి వాదికంపెనీవారు వేసిన దావా ఇది.

1) హైదరాబాదులో తన రిజిస్టర్డ్ కార్యాలయం ద్వారా చిట్ ఫండ్ వ్యాపారం చేస్తూ భారత కంపెనీ చట్టం కింద నమోదయిన ఒక సంస్థఇది. మొదటి ప్రతివాది అక్టోబరు 1.10.1977 తేదీన వాదికంపెనీకి చెందిన చిట్ ఫండ్ స్కీములో ఒక సభ్యుడిగా చేరాడు. అతనికి చిట్ నం. ఎల్ టి54 డి.డబ్ల్యు–16 ఇవ్వడమైంది. అతను

ప్రతినెలా రూ.100/–ల చొప్పున సొమ్ము చెల్లించటానికి అంగీకరించాడు. చిట్ విలువ రూ.5,000/–లు. అతను10.9.1980 తేదీన చిట్ ఒప్పందం మీద సంతకం చేశాడు. మొదటి ప్రతివాది 28.9.80 తేదీన జరిగిన చిట్ వేలంపాటలో పాల్గొనగా కృతకృత్యుడైన వేలం పాటదారుగా ప్రకటించబడి రూ.570/–లు వదులుకోవడానికి అంగీకరించాడు. మొదటి ప్రతివాది వాయిదాల పద్ధతిలో రూ.3700/–లు బహుమాన మొత్తం చెల్లింపు తేదీ వరకు చెల్లించాడు. అతనిపై రూ.1300/–లు భావి చెల్లింపుబాధ్యత ఉన్నది. 1–10–80తేదీన వాది హామీదారులు రాసి ఇచ్చిన హామీపత్రాన్ని మొదటి ప్రతివాది వాదికంపెనీ వారికి సమర్పించాడు. పైన చెప్పిన రెండో ప్రతివాది, మూడో ప్రతివాదులే ఈ హామీదార్లు. వాళ్ళు విడివిడిగాను, సమష్టిగాను ఈ రూ.1300/–ల చెల్లింపుకు బాధ్యులు. వాళ్ళు11–10–1980తేదీన అదనపు హామీగా రూ.1300/–లకు ఒక రుణపత్రం రాసి ఇచ్చారు. మొదటి ప్రతివాది రూ.4291–40చెల్లించారు. అటుతరవాత మొదటి ప్రతివాది వాయిదాలను కట్టే విషయంలో ఉపేక్ష వహించారు. హామీపత్రాన్ని అనుసరించి ప్రతివాదులను చెల్లింపు విషయమై వాది అభ్యర్థించారు. కానీ వారు కోరిన ప్రకారం చేయలేదు. చివరికి 9.1.1982తేదీన వాది లీగల్ నోటీసు ద్వారా ప్రతివాదులను సొమ్ము చెల్లించవలసిందిగా డిమాండ్ చేశారు. అయినా ప్రయోజనం లేకపోయింది. అందువల్ల వాది వడ్డీ, సంబంధిత ఇతర ఖర్చులు కలుపుకొని రూ.137/–లు రాబట్టుకోటానికి తప్పనిసరి అయి ఈ దావా వేయవలసి వచ్చింది. అందుచేతనే ఈ దావా.

2) రెండో ప్రతివాది స్వయంగా హాజరు కాగా, మూడో ప్రతివాది ఏకపక్ష నిర్ణయానికి కట్టుబడి గైరుహాజరయ్యారు. మొదటి ప్రతివాది ఈ కింది ఆరోపణలతో లిఖితపూర్వక స్టేట్ మెంట్ దాఖలు చేశారు.

మొదటి ప్రతివాది 1977 సం.అక్టోబరు నెలలో వరంగల్లులోని మార్గదర్శి చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్‌లో 50నెలలపాటు ప్రతినెలా రూ.100/–ల చొప్పున చెల్లించే రూ.5000/–ల విలువగల నం.ఎల్ టి 542 డి. డబ్ల్యు–16 చిట్‌లో చందాదారుగా చేరారు. క్రమం తప్పకుండా ప్రతివాది నిర్ణీత గడువులోగా డబ్బు చెల్లిస్తూ ఉండేవాడు. ఎప్పుడైనా గడువుతేదీ లోపల చెల్లించకపోయినప్పుడు కంపెనీవారు జరిమానా వసూలు చేసేవారు. 28–9–80తేదీన జరిగిన వేలం పాటలో మొదటి ప్రతివాది పాల్గొని ఆ వేలం పాటలో రూ.570/–లు వదులుకోడానికి అంగీకరించి..చివరికి అతని పక్షంగా చిట్ రావడంవల్ల కంపెనీవారు అతనికి 27.10.80 తేదీ 94026 నెంబరు గల రూ.4,430/–ల చెక్కు జారీచేశారు. ఆయన 13.11.1981 తేదీ వరకు 49 వాయిదాలు క్రమం తప్పకుండా చెల్లించారు. వాదికంపెనీవారు చివరి వాయిదా రూ.100/–లు చెల్లించవలసిందిగా 9.1.1982 తేదీన నోటీసు జారీ చేశారు. నోటీసు అందిన తరవాత మొదటి ప్రతివాది హనుమకొండ, దేవర్ హౌజర్ సూన్ పోస్టు ఆఫీసు నుంచి తే.12.2.1982, డి.డి.నెం. బి.డి/1 830150 నెంబరు గల రూ.110/–ల బ్యాంకు డ్రాఫ్టు మార్గదర్శి చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్, వరంగల్లు పేరిట తీసుకొని 13.2.1982 తేదీన 1236 నెంబరుగల తిరుగురసీదుతో రిజిస్టర్డ్ పోస్టు ద్వారా పంపాడు. 1982 సం. జూలై నెలలో వాది

కంపెనీవారు రూ.137/–లు అభ్యర్థిస్తూ దావా వేయటం అన్యాయమూ అక్రమమూ కూడా. కనుక మొదటి ప్రతివాది కోర్టువారిని తత్సంబంధమైన రికార్డు, పాస్ పుస్తకం, పోస్ట్ ఆఫీసు వారి తిరుగు రసీదు పరిశీలించి తనమీద, తన హామీదార్లమీద వేసిన ఈ కేసు ఎంతవరకు న్యాయబద్ధమైనదో పరిశీలించాల్సిందిగా ప్రార్థించారు.

3) మొదటి ప్రతివాది ఈ కింది ఆరోపణలతో తన లిఖితపూర్వక స్టేట్‌మెంట్‌లో దాఖలు చేశాడు:–

మొదటి ప్రతివాది మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్, వరంగల్లులో నెలకు రూ.100/–ల చొప్పున 50నెలలపాటు చెల్లించే రూ.5000/–ల చిట్‌విలువ గల నెం.ఎల్ టి–4 డి డబ్ల్యు 16 చిట్‌లో చేరాడు. 28.9.80తేదీన జరిగిన వేలంపాటలో మొదటి ప్రతివాది పాల్గొనగా, చివరి వేలంలో మొదటి ప్రతివాదికి అనుకూలంగా వేలంపాట ముగిసి 27.10.1980 తేదీన అతని పేరిట రూ.4430/–ల చెక్కు జారీ చేయటం జరిగింది. మొదటి ప్రతివాది సక్రమంగా 13.11.81 తేదీ వరకు 49 వాయిదాలు చెల్లించారు. ఒక్క చివరి వాయిదా సొమ్ము రూ.100/–లు మాత్రమే వాదికంపెనీకి చెల్లించవలసి ఉంది. నోటీసు అందిన తరవాత మొదటి ప్రతివాది 12.2.1982 తేదీన, డి.డి.నెం.బిడి /1 830150 నెంబరుగల రూ.110/–ల బ్యాంకు డ్రాఫ్టు వాదికంపెనీ పేరిట తీసుకొని 13.2.1982 తేదీ 1236 నెంబరుగల తిరుగు రసీదుతో రిజిస్టర్ పోస్టు ద్వారా పంపారు. అందుచేత ఈ దావా కొట్టివేయవలసిందిగా అతను కోర్టును ప్రార్థిస్తున్నాడు.

4) రెండు పార్టీల వాదనలు విన్న తరవాత కోర్టువారు 5.3.1983 తేదీనాడు ఈ కింది వాదాంశాలను రూపొందించటం జరిగింది:–

1) మొదటి ప్రతివాది తన లిఖితపూర్వక స్టేట్‌మెంట్‌లో ఆరోపించినట్లు ఒక్కవాయిదా మాత్రమే తను చెల్లించవలసి ఉందా?

2) మొదటి ప్రతివాది ఆరోపించినట్లు 12.2.1982 తేదీన చివరి వాయిదా రూ.110/–లు పంపించారా?

3) వాది దావా మొత్తానికి హక్కుదారా?

4) ఏ పరిహారం ఇవ్వాలి?

5) వాదాంశం నెం.1:– ఇప్పుడు పరిశీలనలో ఉన్న ప్రశ్న మొదటి ప్రతివాది వాది కంపెనీకి చెల్లించవలసింది ఒకే వాయిదా డబ్బా,కాదా? అనేదానికి సంబంధించినది. మొదటి ప్రతివాది, రెండో ప్రతివాది డబ్బు విషయమై అంగీకరించారు. 28.9.80 తేదీన జరిగిన వేలంపాటలో వచ్చిన చిట్ డబ్బు మొదటి ప్రతివాదికి ముట్టినది యథార్థమైన విషయం. చిట్ విలువ రూ.5000/–, నెలసరి వాయిదా రూ.100/–ల చొప్పున, వాదికంపెనీ తరఫున వాది సాక్షిగా వచ్చిన మేనేజర్ ఈ వ్యవహారానికి సంబంధించిన సమస్త విషయాల గురించి వాఙ్మూలం ఇచ్చాడు. కోర్టులో హాజరు పరచవలసిన పత్రాలపై ఎ–1 నుంచి

ఎ-9 వరకు ముద్రవేయడమైంది. మొదటి ప్రతివాదీ, రెండోప్రతివాదీ లిఖితపూర్వక స్టేట్ మెంట్లు దాఖలు చేసినప్పటికీ సాక్షిబోనులోకి వచ్చి వాఙ్మూలం ఇవ్వలేదు. దావా అభ్యర్థన మొత్తం రూ. 137/-లు మొదటి ప్రతివాది ఇచ్చిన లిఖితపూర్వక స్టేట్ మెంట్ లో అతను చెల్లించివలసింది చివరివాయిదా రూ.100/–మాత్రమేనని స్పష్టంగా ఉంది. వాది అడ్వొకేటు నోటీసు ప్రతిలో కోర్టులో హాజరు పరచవలసిన పత్రాలు ఎ-5ని బట్టి మొదటి ప్రతివాది రూ.100/–లు బకాయి ఉన్నట్లూ, వడ్డీ, నోటీసు ఛార్జీలు రూ.30/–లు కలిపి మొత్తం 130 రూపాయిలు బకాయి ఉన్నట్లు తెలుస్తోంది. దీన్నిబట్టి మొదటి ప్రతివాది చివరి వాయిదామొత్తమైన రూ100/–లు మాత్రమే బకాయి ఉన్నట్లు తెలుస్తుంది. ఆలస్యం మాత్రం జరిగింది. వాదికంపెనీ వారు వడ్డీ కూడా వేసి దానికి నోటీసు ఛార్జీలు కలపగా రూ.130/–లు అయింది. కాబట్టి దీనికి అనుబంధంగా ఈ వాదాంశానికి సమాధానం ఇవ్వటమైంది.

6) వాదాంశం నెం.2:- 9.2.1982 తేదీగల న్యాయవాది నోటీసు అందిన తరవాత మొదటి ప్రతివాది 12.2.1982 తేదీన రూ.110/–లకు బాంకు డ్రాఫ్టు తీసుకొని పంపినట్లు చెప్పుకొన్నారు. అయితే మొదటి ప్రతివాది చెక్కుద్వారా డబ్బుపంపినప్పటికీ, పంపినడబ్బు చాలకపోవడంవల్ల దాన్ని తిప్పి పంపడమైనదని వా.సా–1 వాఙ్మూలం ఇచ్చారు. వాదికంపెనీకి రూ.110/–ముట్టినట్లు మొదటి ప్రతివాది ఏలాంటి రసీదుగానీ ఇతర లిఖితపూర్వక సాక్ష్యాధారాలను కానీ చూపించలేదు. దాన్ని తిప్పి పంపినట్లు వా.సా–1 ఇంతకుముందే చెప్పి ఉన్నారు. 12.2.1982 తేదీన మొదటి ప్రతివాది రూ.110/–లు బాంక్ డ్రాఫ్టు ద్వారా పంపినది సత్యం. అయితే అది తిరిగివచ్చేసింది. దాని ప్రకారం ఈ అంశానికి సమాధానం ఇవ్వటమైంది.

7) అంశం. నెం.3:- పై అంశాలు ఆధారంగా మొదటి ప్రతివాది చివరివాయిదా మాత్రమే బకాయి ఉన్నాడు. ఆ చిట్ మొత్తం 12.2.1982 తేదీన పంపారు. ఆదేవిధంగా సొమ్ము తక్కువ పడినందున ఆ సొమ్మును తిప్పిపంపడం కూడా జరిగింది. వాది రూ.130/–లు చెల్లించవలసిందిగా కోరారు. వడ్డీ, లీగల్ నోటీసు ఖర్చులు కలుపుకొని అయింది రూ.37/–లు. ఎందుకంటే మొదటి ప్రతివాది చివరి వాయిదా చెల్లించటంలో ఆలస్యంచేశాడు కాబట్టి, వాదికంపెనీ వారు రూ110/–ల చెక్కు తీసుకొని దాన్ని డబ్బుగా మార్చుకొని ఉండవలసిందని నా అభిప్రాయం. మిగతా ఇవ్వవలసింది ఏమైనా ఉంటే అతనికి సూచించి వసూలు చేసుకొని ఉండవలసింది. అలా కాకుండా వాదికంపెనీ వారు 1982 సం.జూలై నెలలో దావా వేసి తొందర పడ్డారు. అందుచేత వాదికంపెనీ వారు రూ.137/–లు వసూలు చేసుకోడానికి హక్కుదారులని నా అభిప్రాయం. ఆ ప్రకారమే ఈ దావాను దావావేసిన నాటి నుండి డబ్బు చెల్లించేవరకు సంవత్సరానికి 6శాతం చొప్పున భవిష్యత్ వడ్డీతో రూ.137/–లకు డిక్రీ చేయడమైంది. ఈ కేసుకు సంబంధించిన పరిస్థితులను బట్టి ఎటువంటి ఖర్చులనూ మంజూరు చేయటంలేదు.

సంక్షిప్త లేఖరికి చెప్పి రాయించడమైంది. వాటిని లిపిబద్ధం చేసి, సరిచేసి బహిరంగ న్యాయస్థానంలో 1983సం. డిసెంబరునెల 31వ తేదీన నేను ప్రకటించడమైంది.

సంతకం/–
ప్రధాన జిల్లా మునసబు
వరంగల్లు

## సాక్ష్యం అనుబంధం
## పరీక్షించిన సాక్షులు

వాది తరపున: ప్రతివాది తరపున:

వా.సా.–1 పి.వి.రమణరావు –ఎవరూ లేరు–

## మార్కు అయిన పత్రాలు

**వాది తరపున:**

ఎగ్జిబిట్ ఎ1–10.9.80 తేదీ నాటి చిట్ ఒప్పందం.
ఎగ్జిబిట్ ఎ2–ప్రోనోటు
ఎగ్జిబిట్ ఎ3–హామీదారు ఒప్పందం
ఎగ్జిబిట్ ఎ4–27.10.80 తేదీ నాటి సొమ్ముకు రసీదు.
ఎగ్జిబిట్ ఎ5–9.1.82 తేదీ నాటి డిమాండ్ నోటీసు కార్యాలయ ప్రతి
ఎగ్జిబిట్ ఎ6–తపాలా శాఖవారి ముట్టినట్లు రసీదు
ఎగ్జిబిట్ ఎ7–తపాలాశాఖ వారి ముట్టినట్లు రసీదు.
ఎగ్జిబిట్ ఎ8– తపాలాశాఖ వారి ముట్టినట్లు రసీదు
ఎగ్జిబిట్–ఎ9– ఖాతా ప్రకటన

**ప్రతివాది తరపున:**

– ఏమీ లేవు–

సంతకం/–
ప్రధాన జిల్లా మునసబు,
వరంగల్లు.

–సరైన నకలు–